శ్రీః

ఓం నమో భగవతే రమణమూర్తయే

# మాహేశ్వరసూత్రాణి

## శ్రీనందికేశ్వరవిరచిత - కాశికాభిః

## ఉపమన్యుమునికృత - తత్త్వవిమర్శిన్యా

## అక్షరజ్ఞవిరచితయా - ప్రణవవల్ల్యాఖ్యయా

ఆంధ్రవ్యాఖ్యయా చ సహితాని

***

अइउण्
ऋऌक्
एओङ्
ऐऔच्
हयवरट्
लण्
ञमङणनम्
झभञ्
घढधष्
जबगडदश्
खफछठथचटतव्
कपय्
शषसर्
हल्

ప్రకాశకులు

రావి మోహనరావు, కృష్ణకుమారీ దంపతులు

**404, జంజనం కాంప్లెక్స్, చీరాల - 523 155.**

శ్రీః

ఓం నమో భగవతే రమణమూర్తయే

# మాహేశ్వరసూత్రాణి

శ్రీనందికేశ్వరవిరచిత - కాశికాభిః

ఉపమన్యుమునికృత - తత్త్వవిమర్శిన్యా

అక్షరజ్ఞవిరచితయా - ప్రణవవల్ల్యాఖ్యయా

ఆంధ్రవ్యాఖ్యయా చ సహితాని

ప్రతులు : 500

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి 2017 - మహాశివరాత్రి - దుర్ముఖనామసంవత్సరం

పుటలు : 116

వెల రూ. : 150/-


404, Janjanam Complex,
Opp. I-Town Police Station,
**CHIRALA** - 523 157. **Cell : 94401 15411**

D.T.P.:
**P. PARVATHI**
Cell : 7416586775.

Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

# ఉపోద్ఘాతమ్

పురా కిల భగవాన్ చంద్రశేఖరస్స్వాత్మతత్త్వప్రబోధనాయ, శబ్దశాస్త్రవ్యుత్పాదనాయ చ, ఆత్మానముద్దిశ్య చిరాచరితతపసాం సనకాదీనాం పాణిన్యాదీనాం చ, అభీప్సిత-మాపిపూరయిషుః, ఢక్కాం **చతుర్దశకృత్వః** నాదయామాస. స నాదః, అ-ఇ-ఉణ్- ఇత్యాది చతుర్దశసూత్రాత్మనా తేషాం శ్రవణపథమవతతార. తత్సూత్రజాలమాధారీకృత్య భగవాన్ పాణినిః స్వోపజ్ఞం వ్యాకరణం రచయామాసేతి విదితమేవ సర్వేషాం పండితానాం తదితరేషాం చ. ఆత్మతత్త్వప్రబోధనాయ ప్రార్థితవతాం సనకాదీనామీహితమపి తదా త్వ ఏవ తేనైవ సూత్రజాలేన ఆపూరితమాసీదితి ఉరరీ కార్యమ్. యద్యేవం న స్యాద్భగవతి భక్తపరాయణేఽపి ఛ్ఛలం, సనకాదిషు ఆజానసిద్ధేష్వపి బాలిశత్వం చారోపితం భవేత్. నహి తే సనకాదయః పాణిన్యాదయ ఇవ శబ్దశాస్త్ర వ్యుత్పాదన మాకాంక్షితవంతః, యేన త ఇవ ఇమేఽపి కృతార్థాః స్మః ఇతి నివృత్తా బభూవుః.

పరంతు, నేదం పండితేషు ప్రథితం భవతి **చతుర్దశసూత్ర్యాః** వ్యాకరణ-ప్రయోజకత్వమంతరేణ, ఆత్మతత్త్వావిష్కరణప్రవణత్వమపీతి. అస్తు నామైతత్. సనకాదయోఽక్షరసమామ్నాయరూపే ఆత్మతత్త్వబోధకత్వేనానుగృహీతే సూత్రజాలే కిమప్యజానానా భగవంతం నందికేశ్వరమపరమివ త్ర్యంబకం ప్రార్థయంత ఏతత్సూత్రవివరణాయ. సోఽపి కృపాతరంగితాంతరంగ**ష్షడ్వింశతి**సంఖ్యాకైరానుష్టుభైర్వృత్తైః కాశికాఖ్యైస్సూత్ర**చతుర్దశకస్యో**పనిషదాత్మతత్త్వపరత్వం స్ఫుటీచకార. మహామునే ర్వ్యాఘ్రపాదస్య పుత్త్రో భగవా**నుపమన్యు** స్తత్త్వవిమర్శిన్యాఖ్యయా వ్యాఖ్యయా తత్కాశికానాం భావం హృద్యతమ-మావ్యకరోత్. ఏతత్త్రయం సుగూఢమౌపనిషదం తత్త్వం సుబోధం కరోతీతి, అగ్రే పఠితౄణా-మనుభవవిషయో భవిష్యతి. అస్మిన్ హి అద్వైతదర్శన సిద్ధాంతభూతాః, నిర్గుణః పరమాత్మా మాయయా సగుణః స్రష్టా చ బభూవ. స్రష్టుస్సృష్టస్య చాభేదః, స్రష్టుస్స్వేనైవ రూపేణ ప్రవేశః, జగతో మాయామయత్వమ్ - ఇత్యాదయో బహవోఽంశాః ప్రతిపాదితాస్సంతి. ఇతరదర్శనసిద్ధాంతాశ్చ తత్రతత్ర ప్రసంగేన. ఇత్థం సర్వస్స్పృహణీయమప్యేతదనభ్యస్త-సంస్కృతభాషాణామవిజ్ఞాతశాస్త్రతత్త్వానాం చ నోపకారాయేతి, ఉపనిషత్సు, యోగశాస్త్రే-

ష్వితిహాసాదిషు, శ్రీభగవత్పాదప్రతిపాదితప్రకరణేషు భాష్యప్రస్థానేషు చ యస్య యస్య భావస్య యేనయేన సంవాదస్తత్సర్వమేకత్ర దర్శయితుకామ ఇవ సువిపులాయాం హృద-యంగమాయాం స్వవిరచితాయామాంధ్రభాషావ్యాఖ్యాయాం విశదీకృత్య, అక్షరజ్ఞనా-మాస్మత్ప్రియసుహృత్ప్రకటయతీతి సర్వేషాం ప్రమోదమాపాదయే**దితి సత్యమేతత్.** మన్యామహే తేనైవ భగవతా సూత్రప్రవర్తకేన చిరాకాంక్షితే స్వకీయే మహతి కార్యే ప్రేరితోఽభూదితి. రత్నాకరాదుద్ధృత్య సర్వసాధారణ్యేన ఆపణప్రసారితా ఇవ అనర్ఘ్యా అర్థవిశేషాః పండితా పండితముఖాలంకారణాయాత్ర ప్రతిపాదితాస్సంతీతి నాత్యుక్తిః. యథాస్య భాషావ్యాఖ్యాతుశ్చిరాదంగీకృతశ్రమస్సఫలో భవేత్తథా పండితైః పఠితృభిశ్చ సమమియ-మాద్రియేతేతి తేషాం ధన్యవాదస్య, మహేశ్వరప్రసాదస్య పాత్రీబభూవాయం వ్యాఖ్యాతేతి చ దృఢం విశ్వసిమః. గచ్ఛతః స్ఖలనమివ తత్రతత్ర అజ్ఞానాదశోధనాద్వా ప్రసక్తాన్ దోషాన్ సహృదయాః క్షంతుమర్హంతి. విలసతాదియం భాషావ్యాఖ్యా సహృదయహృదయానందినీ ఆకల్పమితి ప్రార్థయామహే.

పచ్చయప్ప పాఠశాల,
చెన్నపురి.

**నా.వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రీ**
వేదాంతశిరోమణిః.

# భూమిక

శ్రీమహానటుం డగు పరమశివుండు తాండవము చేయుసమయమునందు సనకసనందనాదులగు సిద్ధులును, పాణిన్యాదులగు మునులును పరమాత్మతత్త్వమును తెలిసికొనఁదలంచినవారై యచ్చటికి వెళ్లియుండిరి. మహేశ్వరభగవానుఁ డా వచ్చియున్నవారి యింగిత మెఱింగి నాట్యానంతరమునఁ దనచేతిఢక్క (డమరుకము)ను పదునాలుగు పర్యాయములు మ్రోఁగించెను. ఆ పదునాలుగు ధ్వనులను, పదునాలుగు సూత్రములుగా వారు గ్రహించిరి. వారిలో భగవానుఁడగు పాణినిముని యాపదునాలుగు సూత్రములను ఆధారముగాఁ జేసికొని యెనిమిది యధ్యాయములుగల (అష్టాధ్యాయి) వ్యాకరణ సూత్రములను రచించెను. సనకాదులుమాత్ర మాసూత్రముల కాత్తతత్త్వ మెఱుంగఁజాలనివారై పరమశివుని పార్షదులలో ముఖ్యుఁ డయిన శ్రీనందికేశ్వరుని సన్నిధి కేఁగి 'యీ పదునాలుగుసూత్రములకును శివభగవానుల వారియుద్దేశ మేమో వివరించి చెప్పు' మని యతనిని ప్రార్థింపఁగా, నతఁడుపోద్ఘాతముగా, "**నృత్తావసానే**" అను శ్లోకమును, దానితరువాతిశ్లోకమును, ఆపైని 1-వ సూత్రమునకు 2-3-4-5-6-7 కాశికలను, 2-వ సూత్రమునకు 9-10-11 కాశికలను, 3-వ సూత్రమునకు 12వ కాశికను, 4-వ సూ. 13వ కాశికను, 5వ సూ. 14-15 కాశికలను, 6వ సూ. 16వ కాశికను, 7వ సూ. 17వ కాశికను, 8వ సూ. 18 1/2-వ కాశికను, 9వ సూ. 19వ కాశికను, 10వ సూ. 20వ కాశికను, 11వ సూ. 21,22 వ కాశికలను, 12వ సూ. 23వ కాశికను, 13 వ సూ. 24,25 వ కాశికలను, 14 వ సూ. 26వ కాశికను ఇట్లు 26 కాశికలను రచించెను. అంత వారు కృతార్థులయి యవి గైకొని వెడలిపోయిరి.

మఱికొంతకాలమునకు, ఆ కాశికల యర్థము సుగమముగామి యెఱింగినవాఁడై ఉపమన్యుమహాముని వానికి "**తత్త్వవిమర్శిని**" అను వ్యాఖ్యానమును నాతివిస్తరముగ రచించెను. కాశికలును, వానివ్యాఖ్యానమును సంస్కృతభాషయం దుండుటంజేసియు, కావుననే సంస్కృతభాషాజ్ఞానము లేనివారికి దురవగాహము లగుటంజేసియు, ఆంధ్రులయిన అక్షరజ్ఞుఁడు గారు, ఆ కాశికలకును, వాని వ్యాఖ్యాన మగు తత్త్వవిమర్శినికిని

ప్రతిపద టీకాతాత్పర్యములు వ్రాసియు, ఆయా సందర్భములయందు **బ్రహ్మసూత్రములు, యోగసూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీతలు, అధ్యాత్మరామాయణోత్తర కాండమునందలి రామగీతాశ్లోకములు, శ్రీశంకరభగవత్పాదాచార్యుల వారి వేదాంత ప్రకరణముల**యందలి శ్లోకములను ప్రమాణముగాఁ జూపి, వానికిని సుగమ మగునట్లు తాత్పర్యము వ్రాసియు "**ప్రణవవల్లి**" అనెడి యాంధ్రవ్యాఖ్యానమును గావించి సంస్కృతభాషాజ్ఞానము చాలని యాంధ్రులగు ముముక్షువులకుఁ బరమోపకారము చేసినవారైరి. నా యెఱిఁగినంతవఱకు శ్రీనందికేశ్వరునికాశికలు గాని, తద్వ్యాఖ్యానమగు తత్త్వవిమర్శిని గాని **యెచ్చటను ముద్రిత మయినట్లు కానరాలేదు**. కాఁగా, వానిని సంపాదించి యీ మాదిరిగా తయారుచేసి ముద్రింపించి యాంధ్రముముక్షువులచేతి కరఁటిపండొలిచి యిచ్చినారన్నమాట! ప్రణవవల్లి చదివినవారి కక్షరజ్ఞుఁడుగారి సర్వతోముఖమైన **యద్వైతవేదాంతజ్ఞానము స్పష్టపడఁగలదు.** మఱియు నీపుస్తకము ముద్రణకు రాకముందును, ముద్రణసమయమునందును బ్రహ్మీభూతులు, శ్రీరమణమహర్షులవారు చిత్తగించి ముద్రణానుమతి నొసంగుచు వచ్చినారు. కావున, ఆంధ్రముముక్షువు లీగ్రంథమును చదివి, మననము చేసికొన్నచో, అక్షరజ్ఞుఁడుగారు దీనివిషయమునఁ బడినపరిశ్రమము సార్థకము గాఁగల దని ముద్రణకుఁ బూర్వముననుండియు దీనిభారమును వహించిన నేను సకలాంధ్రసోదరముముక్షువులను ప్రార్థించుచున్నాను.

ఆంధ్రపత్రికా కార్యాలయము, **పురాణం సూర్యనారాయణతీర్థులు.**
చెన్నపట్టనము.

# దక్షిణామూర్తి స్తోత్రమ్

శ్లో॥ ఓం నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే ।
నిర్మలాయ ప్రశాంతాయ దక్షిణామూర్తయే నమః ॥

శ్లో॥ గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్ ।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః ॥

శ్లో॥ ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేదవిభాగినే ।
వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయే నమః ॥

శ్లో॥ చిద్ఘనాయ మహేశాయ వటమూలనివాసినే ।
సచ్చిదానందరూపాయ దక్షిణామూర్తయే నమః ॥

శ్లో॥ అంగుష్ఠతర్జనీయోగముద్రావ్యాజేన దేహినామ్ ।
శ్రుత్యర్థం బ్రహ్మజీవైక్యం దర్శయన్నోఽవతాచ్ఛివః ॥

***

ఓం సద్గురవే నమః.

# కృతి సమర్పణమ్.

శ్లో॥ లోకశ్రేయోవితరణదీక్షితసనకాదిసన్నుతపదాబ్జః ।
ఢక్కానాదవ్యాజేనాఽదాద్యత్సూత్రబృందమంబేశః ॥

శ్లో॥ నందీ తన్మాహేశీం సూత్రతతిం వ్యాఖ్యదానురూప్యేణ ।
తత్త్వం పదార్థబోధప్రవణం యత్ర్పాహురగ్రిమాః ప్రాజ్ఞాః ॥

శ్లో॥ గీర్వాణగిరినిబద్ధం నాలం జనతేహ బోద్ధుమస్త్యస్మాత్ ।
తద్ధుహితృభాషయాంధ్ర్యా వ్యాఖ్యాతవ్యేతి మే మతిర్జాతా ॥.

శ్లో॥ జాగర్త్యేకో నాన్యస్తస్య చ కర్తృత్వకర్మతే న స్తః ।
ఇతి వదతి భగవతీ వాక్ తస్మాత్ కస్యాస్తి వస్తుతోఽహంతా? ॥

శ్లో॥ నిగమదివ్యతరోరతియత్నాత్ పదసుమైర్గ్రథితామహమేనామ్ ।
విదితవేద్యతయా విలసచ్ఛ్రీరమణపాదయుగే కలయామి ॥

శ్లో॥ చుళుకీకృతనిగమాబ్ధిం వితథీకృతదుర్వ్వాదపాషండమ్ ।
విశదీకృతసత్తత్త్వం వసతీకృతవిశ్వవంద్యశోణాద్రిమ్ ॥

శ్లో॥ నౌమి సదా తం రమణమునీంద్రం
స్వాత్మారామైర్విబుధైర్వినుతమ్ ।
గ్రాహితతత్త్వప్రణతజనౌఘం
శోణశిలోచ్చయకల్పితవాసమ్ ॥

శ్లో॥ నిగమచోదితామున్యనుష్ఠితా-
శ్శమదమాదయః కర్మ నైగమమ్ ।
యస్య హేతుతాం యంతి యద్దహే-
ద్భూతభావినీ పుణ్యపాపకే ॥

శ్లో॥ ప్రాప్య యత్పుమాన్సప్తపూరుషాం–
స్తారయేత్పురః పరమథ స్వకాన్ ।
జ్ఞానమీదృశం ప్రాప్య యో లసేత్
తాదృశం వినా కం ను నౌమ్యహమ్ ॥

శ్లో॥ శ్రీరమణప్రేరణతః
శ్రీరమణప్రాప్త్యుపాయఫలమేతత్ ।
శ్రీరమణతుష్టిరచితం
శ్రీరమణస్యాశిషా చిరం జీయాత్ ॥

శ్లో॥ అక్షరజ్ఞాహ్వయా జ్ఞాతో విద్వదర్హణనిష్ఠితః ।
కశ్చిద్రచితవానాంధ్ర్యాం నందిసూత్రవివర్తనమ్ ॥

**ఓం సద్గురుచరణారవిందాభ్యాం నమో నమః.**

***

# ఉపమన్యు చరిత్రము

శ్రీమంతంబై పుణ్యభూమియని ప్రసిద్ధిం గాంచిన మన భరతఖండము మహర్షుల చరిత్రముల కెన్నిటికో ఆకరమై యున్నది. అట్టి మహనీయులలో ఉపమన్యుఁ డొక్కండు. ఇమ్మునికులతిలకుఁ డాయోదుఁ డను నామాంతరమును వహించి యుండిన ధౌమ్యునకు శిష్యుఁడు. ఆరుణి, వేదుఁ డనునిద్ద ఱీతనికి సహాధ్యాయు లైయుండిరి. ధౌమ్యుఁ డుపమన్యుని తెలివితేటలకు మనమునఁ గడు సంతసించెడివాఁడు. ఇట్లుండ ధౌమ్యుఁడు శిష్యుని తెలివితేటలను, గురుభక్తిని పరీక్షింపఁదలచి శిష్యునిం బిలిచి యిట్లనియె. "నాయనా, ఉపమన్యూ! నీవు నేఁటినుండి మనగోవులను మేపుకొని వచ్చుచుండవలయు" నని యానతిచ్చె. ఉపమన్యుఁడు సౌమ్యగుణసంపన్నుఁడు **"గురుశుశ్రూషయా విద్యా"** అనునార్యోక్తిని జక్కఁగ నెఱింగినవాఁడు కావున గురువునాజ్ఞానుసారముగ నావులఁ గాచుట యిహపరసాధక మని యెంచి యట్లే చేయుచుండెను. ఒకనాఁడు గోవులను బ్రొద్దు గ్రుంకుసరికి శాలకుఁ జేర్చి గురువుకడ కరుగుదెంచి సాష్టాంగముగ నమస్కరించెను. ధౌమ్యుఁడు మ్రొక్కిన శిష్యుని స్నేహమున వీక్షించి యిట్లనియె. 'వత్సా! నిన్నుఁ జూడ నాకు కడుంగడు చోద్య మయ్యెడిని. నీశరీరము మిక్కిలి పుష్టిగలదై యున్నది. కావున నీవు భుజించునాహారమున నెద్దియో మహత్త్వ ముండవలెను. లేదేని నీశరీర మింత దృఢముగ నుండఁజాలదు. ఎట్లు జీవనము చేయుచున్నా' వని ప్రశ్నించెను. శిష్యుం డందులకు 'స్వామీ! భిక్షాచరణమున జీవయాత్ర నడుపుచున్నాఁడను. యాదృచ్ఛికముగ లభించు నాహారమును గ్రహించుచున్నాను. స్వాదుతరములగు నాహారములపట్ల నారసనేంద్రియ మెన్నఁడును సుముఖంబై యుండదు. కొన్ని వేళల నిద్రాహారములను సైతము వీడుచుందును. కాని నాశరీర మిట్లు దృఢముగ నుండుటకు కతం బెయ్యదియో తెలియనేరదు.' అనవుడు ధౌమ్యుఁడు శిష్యునిఁ గాంచి 'ఓరీ! భిక్షాన్నము నాకు నివేదింపక యిటుపైని నీవు భుజింపకుము. తెలియకపోయినది పోని' మ్మని వాక్రుచ్చెను. శిష్యుఁడు గురునానతి నౌదలఁ దాల్చి యమ్మఱుసటిదినముననుండి భిక్షాన్నమును గురువునకు నివేదించుచుండెను. గురుఁడు భిక్షాన్నము నంతయును తానే గ్రహించుచుండెను. శిష్యుఁ డందుల కావంత

యేని చింతించినవాఁడు కాఁడు. యథాప్రకారముగ గోవుల మందను గాచుచుండెను. పగలంతయు గోవులను మేపి సూర్యాస్తమయసమయమునకు గోవులను విడిచి తనయెదుటికి వచ్చి మ్రొక్కి నిలిచిన శిష్యునిం గని గురుం డిట్లనియె. 'బిడ్డా! నీవు తెచ్చుభిక్షాన్న మంతయు నేను భుజించుచున్నాను. నీ వెట్లు జీవనము చేయుచుం బుష్టిగ నున్నా' వని యడిగెను. అందులకు శిష్యుఁడు, 'అయ్యా! మొదట తెచ్చు భిక్షను మీకిచ్చి రెండవ తూరి తెచ్చుదానివల్ల నేను జీవనము చేయుచున్నాఁడను' అనఁగా గురుండు 'వత్సా! నీవు తప్పు చేసితివి. నీ విన్నిమార్లు భిక్షకుం బోదువేని భిక్షవలన జీవించునితరులకు జీవనహాని కాదా? ఇటుపై నట్లు చేయకు' మని గురుండు చెప్పెను. అట్లు చేయ నని చెప్పి యుపమన్యుండు పశువుల నెప్పటియట్ల మేపి గురునియెదుటికి వచ్చి మ్రొక్కి నిల్చిన శిష్యుండు బలసియుండుటను గాంచి గురుండు వాని కిట్లనియె. 'వత్సా! నీవు తెచ్చు భిక్షాన్న మంతయు నేనే గ్రహించుచు నిన్ను మరల భిక్షకేఁగవల దంటిని. నీ వింకను బలసినట్లె యున్నావు. నీవు జీవన మెట్లు చేయుచున్నా?' వనెను. అంతట శిష్యుఁడు 'నేను గోవుల పాలవలన జీవించుచున్నా' ననెను. గురుండు 'నీవు పాలు త్రావుట న్యాయము గాదు. నాయనుజ్ఞ లేక యట్లు చేయకు' మనెను. అందులకు శిష్యుండు సమ్మతించి గోవులను మేపి మరల గురునియెదుటికి వచ్చి నమస్కరించి నిలిచెను. గురుండు వానిం గని, 'బిడ్డా! నీకు భిక్షాన్నము లభించుటలేదు. పాలు త్రాగవలదంటిని. నీవింకను బలసియున్నావు. దీనికిం గతం బేమి?' యని గురుం డడిగెను. అందులకు శిష్యుండు, 'గోవులయొద్ద దూడలు పాలు త్రాగునపుడు విడుచునట్టి నురువును దిని మను చున్నా' ననెను. గురుఁ డామాటలు విని 'నీ విట్లు చేయుట తగదు. నీవు నురుగుఁ దినుట యెఱింగి దూడలు తాము త్రాగుపాలలో, విశేషభాగము నీకై క్రింద విడుచును. అట్లు చేయుటచే దూడలకు జీవనహాని యగును కావున నిటుపై నట్లు చేయకుము.' అనఁగా నట్లే యని గోవులను మేపుటకుం జని తనకు భిక్షాన్నము పాలు నురుగు మొదలగునవి యేమియు లేమింజేసి యాఁకలి పట్టఁజాలక యుపమన్యుం దగ్నికల్పము లగు నర్కపత్రములం దినుట కారంభించిన, దానిచే దృష్టిపాటవము చెడి యంధుం డయ్యెను. అట్టిదశయందు నమ్మునిపుత్రుండు గోవులను మేపుచుండి మార్గమం దున్న యొకకూపంబునం బడియెను. కావున నా యుపమన్యుం డింటికి రాఁడయ్యె. అందులకు గురుండు ఖిన్నుండై యితరశిష్యులం బిలిచి 'బాలురారా! యుపమన్యుండు నేఁడు రాత్రియైనను గృహంబునకు రాఁడయ్యెను. ఎందున్న వాఁ' డని యడుగ, 'వా రుపమన్యుండు గోవులను గాచుటకు వనంబున కేఁగె' నని చెప్పిరి. అంతట గురుండు 'నేను వానిని సర్వవిధములను నిషేధించి యాహారము మాన్పించితిని. దానంజేసి కుపితుఁ డై కాఁబోలును వాఁడు నాకడకు రాఁడయ్యెను. కావున వానిని మనము వెదుకంజన

వలయును' అని చెప్పి శిష్యులతోడ నడవికిం జని, 'ఓ యుపమన్యూ! నాయనా! ఎందున్న వాఁడవు? ర' మ్మని బిగ్గఱగఁ బిలిచెను. అందులకు శిష్యుండు గురుండు పిలుచుట యెఱింగి 'నే నీబావియం దున్నాను. అర్కపత్రములఁ దినుటచే నంధుండనై దారి తెలియక యీకూపమునం గూలితి' ననెను.

ఖిన్నుండై గురుండు శిష్యునిం బిలిచి, 'నాయనా! అశ్వినీ దేవతల స్తుతింపుము. వారు దేవవైద్యులు కావున నీయం దనుగ్రహించి నిన్ను చక్షుష్మంతునిం జేయంగల' రనెను. ఉపాధ్యాయుని యాజ్ఞచొప్పున నుపమన్యుం డశ్వినీదేవతలను వేదవాక్కులచే నుతియించెను. స్తోత్రముచే సంతుష్టిం గాంచి యశ్వినీదేవతలు వానికడ కేతెంచి యిట్లనిరి. 'వత్సా! నీయెడఁ గరుణించితిమి. ఈ భక్ష్యముం గొని తినుము.' అనఁగా నుపమన్యుండు వారితోడ, 'నేను దీనిని గురులకు నివేదింపక భుజింప' ననియె. అశ్వినీదేవతలు, 'వత్సా! తొల్లి యొకప్పుడు మీగురునకిట్లే యొకయపూప మిచ్చితిమి. దానిని మీగురుండు గురునకు నివేదింపకయే భక్షించెను. నీవును నీ గురుండు చేసినట్లే చేయుము.' అనఁగా నుపమన్యుండు 'నేనట్లు చేయనొల్ల' ననెను. అందుల కశ్వినీ దేవత లిట్లనిరి. 'బాలుఁడా! నీగురుభక్తికి సంతసించితిమి. నీవు చక్షువులం గాంతువుగాక. నీగురునికి లోహ దంతములును, నీకు స్వర్ణదంతములు నగుంగాక. నీకు శ్రేయఃప్రాప్తియగుంగాక! నీగురుండు శిష్యులయెడ నిర్దయుఁడై వ్యవహరించినట్లుగాక నీవు శిష్యులయెడ దయగలిగి వర్తింతువుగాక! నీకు లోకమున గొప్పతనము లభించునుగాక' యని యశ్వినులు యథేచ్ఛం జనిరి.

నేత్రములం గాంచిన యుపమన్యుండు గురునిసన్నిధికేఁగి మ్రొక్కి నిలిచియున్న, వానిని గురుండు చూచి సంతోషించెను. అశ్వినీదేవతలు తనకుం జేసిన యుపకారమును సవిస్తారముగ శిష్యుండు గురునకుఁ జెప్పెను. 'అవును, అశ్వినులు చెప్పినట్లే నీకు శుభం బగును. గొప్పవాఁడ వనిపించుకొనియెదవు. నాలుగువేదములు, సర్వశాస్త్రములు, సకలవిద్యలును నీకు లెస్సగ స్ఫురింపఁగలవు. మఱియు మన్వాదుల ధర్మశాస్త్రములు నీకు గోచరించు' నని యాశీర్వదించెను.

ఇది శ్రీమహాభారతాంతర్గతాదిపర్వములోని పౌష్యపర్వమునం దృతీయాధ్యాయము.

***

ఓమ్

# మాహేశ్వర సూత్రాణి

## కాశికా తత్త్వవిమర్శినీ ప్రణవవల్లీ సహితాని

## అక్షరజ్ఞవిరచిత ప్రణవవల్లి.

అవ. శ్రీమదనంతకల్యాణగుణపరిపూర్ణుండును, సచ్చిదానందస్వరూపుండునునగు పరమేశ్వరుఁడు తొల్లి డమరుకధ్వనివ్యాజమునం గొన్ని ధ్వనులను వెల్లడింపఁజేసెను. అవి పదునాలుగుసూత్రంబులుగా నొప్పెను. వానికి **మాహేశ్వరసూత్రము లనియు, డమరుకసూత్రము లనియు, శివసూత్రజాలమనియు, శైవ (శివసంబంధి) సూత్రసమూహ మనియు, కల్యాణరూపసూత్ర** సమూహం బనియుఁ బెక్కు నామంబులు గలవు. ఆదికాలంబునఁ బరమ–శివుఁడు శ్రీ దక్షిణామూర్త్యవతారావసరంబున,

**శ్లో॥ కృతే తు దక్షిణామూర్తిస్త్రేతాయాం గురుదత్తకః**
**ద్వాపరే వ్యాసరూపశ్చ కలౌ శ్రీగురుశంకరః**

అను వాక్యానుసారంబున, బ్రహ్మమానసపుత్రులగు సనక సనందన సనాతన సనత్కుమారాదిమునిశ్రేష్ఠులకొఱకును, నిజ్జగంబునందు తీవ్రపాశుపతవ్రతము సలిపి కైలాసంబున చిరకాల ముండియు జీవన్ముక్తులు గాక భేదబుద్ధితో నుండు ప్రమథగణంబులకొఱకును ఢక్కను దొలుత తొమ్మిది పర్యాయములు, ననంతర మైదుపర్యాయములును మ్రోఁగించెను. అట్లు మ్రోఁగించినను తదర్థంబును దెలిసికొనఁజాలక వారు బ్రహ్మాకారవృత్తి యనియు, వృత్తిజ్ఞానం బనియు ననంబడు నందికేశ్వరుని సమీపించి తత్త్వమును వివరింపఁ బ్రార్థించిరి. అట్లు ప్రార్థింపఁబడిన నందికేశ్వరుఁడు పూర్ణదయతో తత్‌సూత్రార్థమును తనకాశికామూలమునఁ బ్రకాశింపఁజేసెను. పతంజలిమహర్షి **"ఏఓఙ్"** సూత్రమున ప్రతిపాదింపఁబడిన ఓకారమును ప్రధానముగ గణించి ఓంకారధ్యానమును, తదర్థభావనమును ప్రతిపాదించు గొప్పయోగశాస్త్రమును రచించెను. కనుకనే అతఁడు, యోగసూత్రసమాధిపాదమునందు 27,28,29 సూత్రములలో **"తస్య వాచకః ప్రణవః"** ఆపరబ్రహ్మమునకు వాచకము ప్రణవము అనఁగా బ్రహ్మము ఓంకారవాచ్యము,

**"తజ్జపస్తదర్థభావనమ్"** (ఆ ప్రణవమును జపించుటయు, ఆ ప్రణవవాచ్యమైన బ్రహ్మమును ధ్యానించుటయు సమాధిసాధనములు) **"తతః ప్రత్యక్చేతనాధిగమోఽన్తరాయాభావశ్చ"** (అట్లు చేయు ప్రణవార్థవిచారమువలనిఫలమే యేవిధమగు విఘ్నముగాని లేకుండుటయు, బ్రహ్మత్వము నందుటయు నని యెఱుంగనగును) అని వాక్రుచ్చెను.

వ్యాఘ్రపాదమహర్షి **"శబ్దనిష్ఠమిదం జగత్"** అను నుపనిషద్వాక్యరీతి నీసూత్రముల యంత్యవర్ణములు (ణ్,క్,ఙ్,చ్,ట్,ణ్,మ్,ఞ్, ష్,శ్,ప్,య్,ర్,ల్) ను, శబ్దముల కాధారమైన ధాతువులను ప్రతిపాదించుచున్న వని ధాతువుల నాశ్రయించి జనించిన శబ్దములకై గొప్పవ్యాకరణశాస్త్రమును రచించెను. పిదప నావ్యాఘ్రపాదమహర్షి పుత్త్రుఁడైన యుపమన్యుమహర్షి తనతండ్రియోజించిన విషయమునకు మిగుల ఖిన్నుఁడై బ్రహ్మతత్త్వనిరూపణముం జేయుతత్సూత్రములకు ముముక్షుజనోపయోగార్థము **"తత్త్వవిమర్శిని"** యను నొకయద్భుతవ్యాఖ్యను విరచించెను. అది సంస్కృతభాషయందు వెలయుటంజేసి లోకోపకారార్థము నా యథాశక్తి నాంధ్రంబున ప్రణవవల్ల్యాఖ్యవ్యాఖ్యను సంక్షేపముగా రచింపఁబూనెద.

### ఉపమన్యువిరచితా తత్త్వవిమర్శినీ

ఓం

శ్లో॥ **నమశ్శివాయ దేవాయ సర్వజ్ఞాయ పరాత్మనే ।**
**యస్యోన్మేషనిమేషాభ్యాం వ్యక్తావ్యక్తమిదం జగత్ ॥**

శ్లో॥ **శ్రీశంకరం కుమారం చ శైవతత్త్వవిశారదమ్ ।**
**ప్రణమ్య నందికేశాదీన్ శివభక్తాన్ముహుర్ముహుః ॥**

శ్లో॥ **కాశికామాదిసూత్రాణాం నందికేశకృతాం శుభామ్ ।**
**లోకోపకారిణీం దివ్యాం వ్యాకరోమి యథామతి ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** ఓం నమశ్శివాయ దేవాయ... వ్యక్తాఽవ్యక్తమిదం జగత్ – ఇది ఆత్మతత్త్వనమస్కారరూపమైన మంగళాచరణము. శ్రీశంకరం... ముహుర్ముహుః – ఇది ఆత్మవిద్యాసంప్రదాయాచార్యనమస్కారరూపమైన మంగళాచరణము. దేవాయ = ప్రకాశించు-వాఁడును, బోధరూపుఁ డనుట. **"అత్రాఽయం పురుషస్స్వయంజ్యోతిర్భవతి"** – బృహ.ఉ. 4.3.9 ఈ పురుషుఁడు (జీవుఁడు) పూర్ణమైన జ్యోతిస్స్వరూపుఁడు. ఈ యర్థ మీ క్రింది శ్లోకమున వ్యక్తమగుచున్నది.

శ్లో॥ **నానాఛిద్రఘటోదరస్థితమహాదీపప్రభాభాస్వరం**
**జ్ఞానం యస్య తు చక్షురాదికరణద్వారా బహిస్స్పందతే ।**
**జానామీతి తమేవ భాంతమనుభాత్యేతత్సమస్తం జగ-**
**త్తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥**

(ఈ దేహము, నేత్రములు మొదలగు నింద్రియము లనెడి యనేక రంధ్రములు గలది. అట్టి దేహమునం దంతటను చైతన్యస్వరూపుఁడగునాత్మ నిండియుండును. కాఁబట్టి పెక్కురంధ్రములు గల కుండయందు దీపకాంతి నిండి రంధ్రముల మూలమున వెలుపలికిఁ బాఱునట్లు, ఏయాత్మస్వరూప మగు చైతన్యము దేహమం దంతటను నిండి చక్షురాదికములైన రంధ్రముల మూలమున వెలువడుచున్నదో, ఏయాత్మ "**తెలియుచున్నా**" నని జ్ఞానస్వరూపముచేతఁ బ్రకాశించుచుండఁగాఁ దత్ప్రకాశమువలన నానావిధమైన సమస్తప్రపంచమును, ఇంద్రియ సంప్రయోగంబునందు నింద్రియానుగతమైన యంతఃకరణమందుఁ దత్ప్రతిబింబసంబంధముచేఁ బ్రకాశము నొందుచున్నదో, అట్టి జ్ఞానము నుపదేశించుటకు గురుమూర్తిగా నవతరించిన శ్రీ దక్షిణామూర్తికి నమస్కారము.)

సర్వజ్ఞాయ = (తన్ను బయటివస్తువులను) సమస్తమును దెలిసికొనువాఁడును, "**తత్ర నిరతిశయం సార్వజ్ఞ్యబీజమ్**" – పతంజలి, 1.25 (ఆ యీశ్వరునియందు సర్వజ్ఞుఁ డనుటకుఁ దగినహేతువు గలదు గాన ఈశ్వరుఁడున్నాఁ డనుటకు ముఖ్యప్రమాణ మున్నది. ఈశ్వరుఁడు సర్వజ్ఞత్వమునకు బీజము – (కారణము) అని చెప్పినందున, అతనికంటె మఱివేఱేదియు లేదని సిద్ధించెను. ఈశ్వరునందే సర్వజ్ఞత్వము నిరూపించుటకు కారణ మే మనఁగా, స్వయముగ జడమైన చిత్తమందు ఆత్మచైతన్యాభివ్యక్తివలన జ్ఞానాద్యుత్తమ ధర్మములెల్ల న్యూనాధికత (హెచ్చుతక్కువ)లు, మాలిన్యము, నిర్మాలిన్యము మున్నగు వ్యత్యాసములు గలవియై పరిణమించుటంబట్టి వీనికిఁ గారణ మొకఁడున్నాఁ డనియును, అతనిచేతనే యిట్టి తారతమ్యములు గలుగుచున్న వనియును దెలియఁబడుచున్నది. కావున నిరతిశయ (అత్యధిక) జ్ఞానశక్తి యీశ్వరునియందే యున్న దనియు, అతఁడే మూలకారణ మనియు విశద మగుచున్నది.) ఈయర్థమున కుపోద్బల మీశ్లోకము :-

**శ్లో॥ బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వా స్వవస్థాస్వపి**
**వ్యావృత్తాస్వనువర్తమానమహమిత్యంతః స్ఫురంతం సదా ।**
**స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యో భద్రయా ముద్రయా**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥**

(దేహమునకు బాల్యము మొదలగునవస్థలు గల్గుచున్నవి. ఈయవస్థలు ఒకదానికంటె నొకటి భిన్నముగాఁ దెలియఁబడుచున్నవి. ఆయాయవస్థలందు దేహము మాఱుచుండుటయుఁ బ్రత్యక్షము. బాల్యమందలి శరీరమునకును, యౌవనమందలి శరీరమునకును భేదములు కాన్పించుచున్నవి. కావున నవి ఘటపటములట్లు పరస్పరము భిన్నము లని చెప్పనొప్పును. ఇట్లు బాల్యము నందలిదేహము యౌవనమందు లేదు. ఆత్మ యట్లు కాదు. బాల్యాదులయందు

శరీరాదులు మాఱుచున్నను ఆత్మయొకఁడుమాత్రము మార్పులేక ఒక్కవిధముననే "**నేను**" అని స్ఫురించుచుండును. బాల్యమునందలి శరీరముకంటె యౌవనమందలి శరీరము భిన్నముగా నున్నను, ఆత్మమాత్రము బాల్యమునందెట్లో యట్లే యౌవనమునందును ఎంతమాత్రము భేదము లేక "**నేను**" అని యేకరసముగాఁ బ్రకాశించుచున్నది. ఆత్మ యొకయవస్థయందుఁ జేసినకార్యము మఱొకయవస్థయందును స్మరించును. ఒక యవస్థయందు "**నావి**" యని భావించినవానిని మఱొకయవస్థయందు నట్లే "**నావి**" అనియే భావించును. ఆకార్య మప్పుడే నశించినను, "**నావి**" అనియే భావింపఁబడినవి మాఱినను కర్తగా నున్న వాఁడును, భావించువాఁడునగు నాత్మమాత్రము ఒక్కవిధముగనే యున్నాఁడు. మఱియు, జాగ్రదాద్యవస్థలును పరస్పరభిన్నములుగాఁ దెలియు చున్నవి. జాగ్రత్తయం దనుభవింపఁబడిన వస్తువులు స్వప్నమం దుండవు. అట్లే స్వప్న మందలివి జాగ్రదవస్థయం దుండవు. ఈరెండును సుషుప్తియం దుండవు. ఆత్మయో యీయవస్థలన్నిటి యందును, మణిహారమందు దారమువలె (సూత్రం మణిగణే యథా) నెడతెగక యేకరసముగా నుండుట అనుభవసిద్ధము. ఆత్మ "**నేను**" అని యెల్లప్పుడును స్ఫురించుచున్నాఁడు. సర్వావస్థలయందలి దేహేంద్రియాదు లన్నియు "**నావి**" అని యాత్మసంబంధులుగా స్ఫురించు చున్నవి. అవి యెల్లప్పు డుండునవియుఁ గావు. కావున, ఆత్మ దేహేంద్రియాదిసర్వ ప్రపంచ విలక్షణుఁడై పరస్పరభిన్నములైనవానియం దనుస్యూతుఁడై యుండువాఁడని తెలియవలెను. అట్టి యాత్మను, ఫలాభిసంధి వదలి విహితకర్మముల ననుష్ఠించుటచేతఁ జిత్తశుద్ధినొంది యాత్మజ్ఞానేచ్ఛగల వారికి జ్ఞానముద్రచేఁ దెలియఁజేయునట్టి శ్రీదక్షిణామూర్తికి నమస్కారము.)

ఆత్మ యన నవస్థాత్రయసాక్షి :–

**శ్లో॥ అహం సాక్షీతి యో విద్యా ద్వివిచ్యైవం పునఃపునః।**
**స ఏవ ముక్తస్సో విద్వానితి వేదాంతడిండిమః ॥**

(ఇట్లు పలుమాఱు వివేచించి '**నేను సాక్షిని**' అని యెవ్వఁ డెఱుంగునో అతఁడే ముక్తుఁడు, అతఁడే విద్వాంసుఁడు నని వేదాంతడిండిమము.)

శివాయ = భద్రాత్మకుఁడునైన, పరమాత్మనే = ఉత్తముఁడును, అవస్థాత్రయసాక్షియు నగు నాత్మతత్త్వముకొఱకు, నమః = నమస్కారము. యస్యోన్మేషనిమేషాభ్యాం వ్యక్తావ్యక్తమిదం జగత్ = యస్య ఉన్మేషేణ ఇదం జగద్వ్యక్తం, యస్య నిమేషేణ ఇదం జగదవ్యక్తం = ఎన్నిక (అనఁగా సంకల్ప వికల్పములు) లేనపుడు బ్రహ్మము మెఱపువలె బయటపడును. ఒక యెన్నికకైనను చోటిచ్చినపుడు కన్ను మూసిన ట్లుండును. ఈవిషయమునే తలవకారోపనిష త్తిట్లు చెప్పుచున్నది:–

**తస్యైష ఆదేశో యదేతద్విద్యుతో౽ వ్యద్యుతదా *3* ఇతి న్యమిషదా *3* ఇత్యధిదైవతమ్ 4.4.**

(ఆ బ్రహ్మము మెఱపువంటి ప్రకాశముగలది. కనుమూయునంతలో ననఁగా నతిశీఘ్రముగా మఱుఁగువడునది. ఆ బ్రహ్మస్వరూపస్థితి యిట్టిది.

"**అంతర్లక్ష్యం బహిర్దృష్టిరున్మిషో నిమిషవర్జితః**" – మండల బ్రాహ్మణము, రాజయోగభాష్యము. "**అత్రాఽయం పురుషః స్వయంజ్యోతిర్భవతి**" – బృహదారణ్యకము. శ్రీ శంకరం = నిత్య ప్రకాశుఁడును, ఆనందరూపుఁడు నగు శంకరుని, శైవతత్త్వవిశారదమ్ = ఆత్మతత్త్వమున విశారదుఁడగు, కుమారం చ = సుబ్రహ్మణ్య(స్కందు)నిని, నందికేశాదీన్ = నందికేశ్వరుఁడు మొదలుగాఁగల, శివభక్తాన్ =శివభక్తు (ఆత్మయందే రమించు వార)లను, ముహుర్ముహుః = మాటిమాటికిని, ప్రణమ్య = నమస్కరించి, ఆదిసూత్రాణామ్ = మాహేశ్వర సూత్రములకు (అ.ఇ.ఉణ్ మొదలగు పదునాల్గుసూత్రములకును) నందికేశకృతామ్ = నందికేశ్వరునిచేత రచింపఁబడి నదియు, శుభామ్ = మంగళస్వరూపయును, లోకోపకారిణీమ్ = బ్రహ్మత్వము నరయఁగోరు జనుల కుపకరించునదియును, దివ్యామ్ = సకల సంశయవిచ్ఛేదకమై ప్రకాశించునదియునగు, కాశికామ్ = కాశిక యనుపేరుగల వృత్తిని, యథామతి = నాబుద్ధి కందినంతవఱకు, వ్యాకరోమి = వివరించి చెప్పుచున్నాను.

**తత్త్వవిమర్శిన్యా :** అవ. ఇహ ఖలు సకలలోకనాయకః పరమశివః సనక సనందన–సనత్కుమారాదీన్ శ్రోతౄన్ నందికేశ్వరవ్యాఘ్రపాదాదీం శ్చోద్ధర్తుం ఢక్కానినాదవ్యాజేన చతుర్దశ సూత్ర్యా ఆత్మతత్త్వముపదిదేశ. తదను తే సర్వే మునీంద్రవర్యాశ్చిరకాలాశ్రితానా–మస్మాకమాత్మతత్త్వముపదిదేశేతి మత్వాఽస్య సూత్రజాలస్య తత్త్వార్థం నందికేశ్వరో జానాతీతి నందికేశ్వరం ప్రణిపత్య పృష్టవంతః. తేషు పృష్టవత్సు స షడ్వింశతి కాశికారూపేణ తత్త్వం సూత్రాణాముపదేష్టుమిచ్ఛన్నిదమాచచక్షే.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** సకల = సమస్తమగు, లోక = లోకములకు (ఇరువదియైదనాత్మ తత్త్వములకు) నాయకః = నాయకుఁడు, జాగ్రత్స్వప్నసుషుప్తుల కతీతుఁడు. అనఁగా సాక్షి. "**జాగరితే బ్రహ్మా స్వప్నే విష్ణుస్సుషుప్తౌ రుద్రస్తురీయ మక్షరమ్**" బ్రహ్మోపనిషత్.

దీనికి ప్రమాణము :– "**జీవః పంచవింశకః స్వకల్పితచతుర్వింశతి తత్త్వం పరిత్యజ్య షడ్వింశః పరమాత్మాఽహమితి నిశ్చయాత్ జీవన్ముక్తో భవతి**" – (ఇరువదియైదవ తత్త్వమగు జీవుఁడు తనచేతఁ గల్పింపఁబడిన యిరువదినాల్గు తత్త్వములను త్యజించి తనకంటె నసఁగా జీవునికంటె నధికమైన యిరువదియాఱవ తత్త్వమైన పరమాత్మయే తా ననెడి నిశ్చయమువలన జీవన్ముక్తుఁడగును.) **మండల బ్రాహ్మణము, ప్రథమ బ్రాహ్మణము, కడపటి మంత్రము.**

పరమశివః = పరమ మంగళరూపుఁ డగు తురీయుఁడు, సనక సనందన సనాతన సనత్కుమారాదీన్ = సనకుఁడు, సనందనుఁడు, సనాతనుఁడు, సనత్కుమారుఁడు మున్నగువారలను,

(సనకాదులు నలువురును బ్రహ్మమానసపుత్రులు. వీరు జన్మించినతోడనే బ్రహ్మయెదుట నిలిచి మాకు కర్తవ్యం బేమని యడుగ, '**నేను స్వరూపసాక్షాత్కారానుభవము నిమిత్త మేఁగెదను. నావచ్చువఱకు సృష్టివృత్తిని సలుపుఁడు**' అని బ్రహ్మ వారిని నియమించె. వా రందులకు సమ్మతింపక వారే ప్రథమమున బ్రహ్మానుభవమును బడయుటకు యత్నింపఁదొడంగి, వైకుంఠంబునకుఁ జని యచ్చట లక్ష్మీసమేతుఁడై యున్న మహావిష్ణువుం గని తృప్తిం జెందక కైలాసంబున కేఁగిరి. తత్సమయంబున శివుని పూర్వభార్యయగు సతీదేవి వేఱుజన్మ మెత్తుటకై హిమవత్పర్వత ప్రాంతంబునకుఁ బోయె. అత్తఱుణంబున నొకవటవృక్షంబు క్రింద వయసున మిక్కిలి చిన్న-వాఁడును, మౌనమాత్రముచేతనే పరబ్రహ్మతత్త్వమును తేటతెల్లముగ నుపదేశించువాఁడును, హస్తమందు, అంగుష్ఠతర్జన్యసంయోగరూపమైన జ్ఞానముద్రను ధరించి స్వాత్మానందంబు ననుభవించువాఁడును, ఆనందస్వరూపుఁడును, నిత్యానందంబునఁ బ్రసన్నవదనుండును, జ్ఞానమూర్తియు, సమస్తాచార్యులకును బ్రథముండునగు శ్రీదక్షిణామూర్తిని గని యమ్మహాత్మునివలన మౌనోపదేశంబును బడసిరి. ఆ నలుగురిలోఁ గడపటివాఁడగు సనత్కుమారుండు పిదప స్కందుడుగ నుద్భవించెను.) శ్రోతౄన్ = వినువారైన, నందికేశ్వర పతంజలి వ్యాఘ్రపాదాదీన్ చ = నంది-కేశ్వరుఁడు, పతంజలి, వ్యాఘ్రపాదుఁడు మొదలగువారిని,

**నందికేశ్వరుఁడు :-** ఇతఁడు పరమశివునియొద్ద సదా వృషభరూపుఁడై యుండు-వాఁడు. నందికేశ్వరుఁ డనఁగా వృత్తిజ్ఞానము, అనఁగా బ్రహ్మాకార వృత్తి.

**పతంజలి :-** ఇతఁడు కాశ్మీరదేశంబున జన్మించినట్లు దెలియుచున్నది. ఇతఁడు పుట్టినది మొదలు త్రికాలజ్ఞాని యైయుండెను. ఇతఁడే పాణినివ్యాకరణమునకు మహాభాష్యమును, యోగసూత్రములను రచియించెను. ఇతఁడు లోకోపకారార్థము శరీరశుద్ధిమూలకముగఁ గాయసిద్ధిని పొందుటకు వైద్యశాస్త్రమును గూడ రచియించె నని కొందఱు చెప్పుచున్నారు. కాని యాపొత్తము మాత్రము కానంబడుటలేదు. ఒకానొకప్పుడు శ్రీమన్నారాయణమూర్తి యాదిశేషునకు శివతాండవప్రభావమును జెప్పఁగా నాయాదిశేషుఁడు శివతాండవమును జూడఁగోరి శివునిఁ గూర్చి తపం బొనర్చె. శివుఁడు ప్రత్యక్షమై "**మున్ను అత్రిమునిభార్య యనసూయాదేవి స్నానముచేసి గట్టెక్కు సమయమున నీ వైదుతలలుగల సర్పంబవై యామెయంజలియందుఁ బడెదవు. అందువలనఁ బతంజలి యనుపే రొందెదవు. అపుడు నీ వానామంబుతో చిదంబరమున (చిత్+అంబరము = జ్ఞానాకాశమున) కేఁగుము. అచ్చట నా తాండవమును, దర్శింతువు.**" అని చెప్పెను. ఆ ప్రకారమే పతంజలి చిదంబరమున (జ్ఞానాకాశమున) కేఁగి శివతాండవ దర్శనముచేసి (బ్రహ్మానుభవమును బొంది) ఆనందమును, బొందెను. "**శబ్దనిష్ఠమిదం జగత్, నిశ్శబ్దం బ్రహ్మ ఉచ్యతే.**" "**సంకల్పమాత్రో దేహస్థితీనాం సంకల్పనాశోఽశేషో విదేహీ.**"

**వ్యాఘ్రపాదుఁడు :-** వ్యాఘ్రపాదములవంటి పాదములు గలవాఁడని అర్థము. ఇతఁడు మాహేశ్వరసూత్రవ్యాఖ్య యగు తత్త్వవిమర్శినిని రచియించిన యుపమన్యుమహర్షి జనకుఁడు. ఇతఁడు నొక వ్యాకరణశాస్త్రమును రచియించెను.

ఉద్ధర్తుమ్ = గట్టెక్కించుటకు (తరింపఁజేయుటకు), ఢక్కానినాదవ్యాజేన, ఢక్కా = ప్రకృతి (శుద్ధమాయ) యొక్క, నినాదవ్యాజేన = ధ్వనినెపముతో (ఓంకారధ్వని మూలముగ), చతుర్దశ సూత్ర్యా = పదునాల్గు సూత్రముల ద్వారా, ఆత్మతత్త్వమ్ = పరబ్రహ్మ స్వరూపమును, ఉపదిదేశ = ఉపదేశించెను. తదను = పిమ్మట, తే = ఆ, సర్వే మునీంద్రవర్యాః = మునివరు లందఱును, చిరకాలాశ్రితానామ్ = దీర్ఘకాలమునుండి యాశ్రయించియున్న, అస్మాకమ్ = మనకు, ఆత్మతత్త్వమ్ = పరబ్రహ్మతత్త్వమును, ఉపదిదేశ+ఇతి = ఉపదేశించెనని, మత్వా = ఎంచి (భావించి), అస్య సూత్రజాలస్య = ఈ సూత్రసముదాయమునకు (పదునాలుగు సూత్రములకు), తత్త్వార్థమ్ = సరియగు నర్థమును (వేదాంతార్థమును), నందికేశ్వరః = నందికేశ్వరుఁడు, జానాతి = ఎఱుంగుచున్నాఁడు, ఇతి = అని, నందికేశ్వరమ్ = నందికేశ్వరుని, ప్రణిపత్య = నమస్కరించి, పృష్టవంతః = అడిగిరి. తేషు పృష్టవత్సు = వా రడుగఁగా, సూత్రాణామ్ = సూత్రములకు (మాహేశ్వరసూత్రములు పదునాల్గింటికి), తత్త్వమ్ = తత్త్వమును (వేదాంతార్థమును), షడ్వింశతికాశికారూపేణ = ఇరువదియాఱుకాశికల రూపముగా, ఉపదేష్టుమ్ = ఉపదేశించుటకు, ఇచ్ఛన్ = కోరినవాఁడై, సః = అతఁడు (ఆ నందికేశ్వరుఁడు), ఇదమ్ = దీనిని (నుడువఁబోవు విషయమును), ఆచచక్షే = చెప్పెను.)

## శ్రీనందికేశ్వర కాశికా

**శ్లో॥ నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచవారమ్ ।**
**ఉద్ధర్తుకామస్సనకాదిసిద్ధానేతద్విమర్శే శివసూత్రజాలమ్ ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** నటరాజరాజః = నటరాజశ్రేష్ఠుఁడగు మహేశ్వరుఁడు **(అంతర్యామి),** సనకాది సిద్ధాన్ = సనకుఁడు మున్నగు సిద్ధపురుషులను **(అంతఃకరణమును)** (అహంకారము, చిత్తము, మనస్సు, బుద్ధియే సనక, సనందన, సనాతన, సనత్కుమారులు.) (సనకాదిసిద్ధాన్ = అహం (జీవ) అహమస్మి (అంతఃకరణము), అహం దేహోఽస్మి (ఇంద్రియ జ్ఞానముగామాఱి) ఉద్ధర్తుకామః = ఉద్ధరింపఁగోరినవాఁడై, నృత్తావసానే = నర్తనాంతమందు (నృత్త = ఆనందానుభవముయొక్క), అవసానే = అంతమందు, అనఁగా జీవుఁడుగా (అంతః కరణముగా) పరిణమించినపుడు, అనఁగా సుషుప్త్యంతమం దహంవృత్తి బయలుపడినపుడు.) నవపంచవారమ్ = పదునాల్గు పర్యాయములు (నవ = తొమ్మిదిసారులు:- జీవుఁడు, మనస్సు, బుద్ధి, ప్రాణము, జ్ఞానేంద్రియ తన్మాత్రలగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు. ఇవి

జీవోత్పత్తిస్థితులను దెలుపుచున్నవి; పంచవారమ్ = అయిదుసారులు – అనగా బ్రహ్మోపాసనవలన జీవలయమును దెలియఁజేయుచున్నవి. ఉపనిషత్తులందు జీవుఁడు, మనస్సు, బుద్ధి, నాదము – ఇవి పర్యాయపదములుగ నుపయోగింపఁబడుచున్నవి. **ఆణవం** (నేను) **కామ్యం** (నాది) **మాయా** (జగత్తు) ఇవి జీవునిలో లయింప జీవుఁడు పరమాత్మలో లయించును.) ఢక్కామ్ = దమరుకమును (ప్రకృతిని, లేక, శుద్ధమాయను) ననాద = మ్రోగించెను, ఏతత్ = ఈ, శివసూత్రజాలమ్ = పరమశివునిచే మ్రోగింపఁబడిన ఢక్కా నాద విశ్రుతమైన చతుర్దశసూత్ర సముదాయమును, విమర్శే = విమర్శించుచున్నాను.

**తాత్పర్యము :** నటరాజోత్తముఁడైన పరమశివుఁడు సనక, సనందన, సనాతన, సనత్కుమారాది సిద్ధుల నుద్ధరింపఁగోరి నర్తనాంతమందు ఢక్కను పదునాల్గు పర్యాయములు మ్రోఁగించెను. ఆ మ్రోఁత సనకాదులకు 1.అ, ఇ, ఉణ్, (2) ఋ, లుక్, (3) ఏ, ఓఙ్, (4) ఐ, ఔచ్, (5) హ, య, వ, రట్ (6) లణ్, (7) ఞ, మ, ఙ, ణ, నమ్, (8) ఝ, భఞ్, (9) ఘ, ఢ, ధష్, (10) జ, బ, గ, డ, దశ్, (11) ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, తవ్ (12) క, పయ్, (13) శ, ష, సర్, (14) హల్ అను పదునాల్గుసూత్రములుగా పరిణమించెను. కాఁబట్టి యీ చతుర్దశసూత్రములకు శివసూత్రములని నామధేయము. తత్త్వము నరయఁగోరియున్న ప్రమథగణంబు లీ సూత్రార్థము నరయఁజాలక మహాజ్ఞానియగు నందికేశ్వరు నడుగ నతఁడు కాశిక యనుపేర నిరువదియాఱు శ్లోకములతోఁ దత్త్వమును ప్రకాశపఱుపఁబూనెను.

**శ్లో॥ ఆత్మా త్వం గిరిజా మతిస్సహచరాః ప్రాణాశ్శరీరం గృహం**
**పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః ।**
**సంచారః పదయోః ప్రదక్షిణవిధిస్స్తోత్రాణి సర్వా గిరో**
**యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో! తవారాధనమ్ ॥**

**– శివమానసపూజాస్తోత్రము.**

(ఓ శివా! నాచేయు మానసికపూజయందు నీవే జీవాత్మవు. పార్వతియే మనస్సు. ప్రాణాపానవ్యానోదానసమానము అను పంచప్రాణములే పరిజనులు. శరీరమే గృహము. స్రక్చందనాది విషయసుఖముల ననుభవించుటయే నీపూజ. నిద్రయే చిత్తవృత్తినిరోధము. ఉత్క్షేపణము మొదలగు పంచకర్మములే ప్రదక్షిణకృత్యములు. నోటిచేత నుచ్చరింపఁబడువాక్కు లన్నియు స్తోత్రములు. ఇవి యవి యన నేల? నాచేయు సమస్తకృత్యములు నీసేవయే యని భావము.)

**తత్త్వవిమర్శినీ :** అహమితి శేషః. నటరాజరాజ ఇత్యనేన మంగళాదీని దర్శితాని.

విశ్వరూపవిలాసవైచిత్ర్యచమత్కారప్రవీణత్వాన్నటరాజరాజః. తాండవాఖ్యరాసమాత్రవిలాస-వైచిత్ర్యచమత్కారప్రవీణత్వస్య త్వన్యత్ర నటాదావపి సత్త్వాత్. స త్వాత్మతత్త్వం వాగాద్యగోచర మితి జ్ఞాపనార్థం ఢక్కానినాదవ్యాజేన సనకాదీనుద్ధర్తుకామోఽయం నవపంచవారం చతుర్దశవారం స్వాంతర్గతమాత్మతత్త్వం ప్రకటయితుం నృత్తావసానే ఢక్కాం ననాద నాదితవాన్. అహం తదేతద్వితతనినాదోద్భూతవర్ణాత్మకమాద్యమతిరహస్యం శివసూత్రజాలం (శివసంబంధిసూత్రసమూహం) కల్యాణరూపసూత్రసమూహం వా విమర్శే విచార్య స్ఫుటీకరోమీత్యర్థః.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** 'నేను' అని చేర్చుకొనవలయును. 'నటరాజరాజః' అనుటవలన మంగళము మున్నగునవి నిరూపింపఁబడినవి. లోకరూపమైన విలాసమునను వైచిత్ర్యమునను ప్రవీణుఁడని తాత్పర్యము. తాండవమునందలి విలాసాదులు సామాన్యనటునియం దుండుటంబట్టి అది యిక్కడ చెప్పుట యుక్తముకాదు. అట్టి నటరాజరాజు ఆత్మతత్త్వము వాగాదులకు గోచరము కాదని చూపుటకు ఢక్కా శబ్దవ్యాజమున సనకాదిమునుల నుద్ధరింపఁగోరి పదునాల్గు సార్లు తనలోని ఆత్మతత్త్వమును ప్రకటించుటకు నర్తనాంతమున ఢక్కను మ్రోఁగించెను. నే నట్టివ్యాపకమైన శబ్దమునుండి యావిర్భవించిన వర్ణరూపమైనదియు, మొదటిదియు, అతిరహస్యమునగు శివసూత్రసమూహమును, మంగళరూపమైన, సూత్రసమూహమును న్యాయమూలముగా విచారించి విశదపఱిచెదను అని అర్థము.

## (1) కాశికా

**శ్లో॥ అత్ర సర్వత్ర సూత్రేషు హ్యనుబంధచతుర్దశమ్ ।**
**ధాత్వర్థం సముపాదిష్టం పాణిన్యాదీష్టసిద్ధయే ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** అత్ర = ఈ, సర్వత్ర సూత్రేషు = ఎల్లసూత్రముల యందును (అనఁగా బదునాల్గు సూత్రములయందును), పాణిన్యాది = శబ్దశాస్త్రకర్తలగు పాణిని మొదలగు వారలయొక్క, ఇష్టసిద్ధయే = ఈప్సిత మీడేరుటకొఱకు, ధాత్వర్థమ్ = ధాతుమూలక శబ్దశాస్త్రమే ప్రయోజనముగాఁగల, అనుబంధచతుర్దశమ్ = పదునాల్గు సూత్రముల అంత్యవర్ణముల సముదాయము, సముపాదిష్టమ్ = ఉపదేశింపఁబడినది.

**తత్త్వవిమర్శినీ :** అనుబంధాః పాణిన్యాద్యుద్దేశకా ఏవేత్యాహ – అత్రేతి. ఏప్సిత్యాదిరర్థః. అంత్యవర్ణేతి వా పాఠః. ఉభయథాఽపి బహువ్రీహిః కదంబమన్య-పదార్థః. అసమాసాంతో వా పాఠః. చతుర్దశేతి. తదా తత్పురుషః ద్వ్యేకయోరితివచ్చతుర్దశేతి ప్రయోగః. కేషు చిత్పుస్తకేషు అంత్యవర్ణచతుర్దశకమితి పాఠః. ధాత్వర్థమ్ = ధాతుమూలక శబ్దశాస్త్రప్రవృత్త్యర్థమంత్యవర్ణజాలం శబ్ద ఇతి న్యాయేన. తథాచోక్తమింద్రేణ **"అంత్యవర్ణసముద్భూతా ధాతవః పరికీర్తితా"** ఇతి.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** అనుబంధములు (సూత్రములయొక్క కడపటి యక్షరములు) పాణిన్యాదుల నుద్దేశించి చేర్పఁబడిన వని చెప్పుచున్నారు. ఈసమస్త సూత్రములలోను అంత్యవర్ణ చతుర్దశం అని పాఠాంతరము. రెండు పాఠభేదముల లోను ఈపదము బహువ్రీహిసమాసాంతము. కడపటి వర్ణములయొక్క పదునాల్గును సముదాయ మని యర్థము. లేక ప్రత్యయహీనమైన అంత్యవర్ణశ్చతుర్దశ అనియైనా పాఠము. ఈపాఠములో తత్పురుషసమాసము. '**ద్వ్యేకయోః**' అనునట్లు ప్రయోగము. కొన్ని పొత్తములలో '**అంత్యవర్ణచతుర్దశకం**' అనియు పాఠము గలదు. అంత్యవర్ణసముదాయము ధాతుమూలక మైన శబ్దశాస్త్రప్రవృత్తికొఱకై యున్న దని భావము. '**అంత్యవర్ణజాలం శబ్దః**' అనఁగా ప్రతిసూత్రముయొక్క కడపటివర్ణములసమూహమే **శబ్దశాస్త్ర** మని న్యాయము. ఇంద్రునిచేతను ధాతువులు అంత్యవర్ణములలోనుండి పుట్టినట్లు చెప్పఁబడి యున్నది.

## (1) సూత్రము. అ, ఇ, ఉణ్.

### 2. కాశికా

**శ్లో॥ అకారో బ్రహ్మరూపస్స్యాన్నిర్గుణస్సర్వవస్తుషు ।**
**చిత్కలామిం సమాశ్రిత్య జగద్రూప ఉణీశ్వరః ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** అకారః = అకారము, నిర్గుణః = సత్త్వాదిగుణరహితమైన, బ్రహ్మరూపః = పరబ్రహ్మస్వరూపము, స్యాత్ = అగును, (ఆ నిర్గుణ బ్రహ్మము) సర్వవస్తుషు = **పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి** మున్నగు సకల వస్తువులయందు, అనఁగా నిరువదియై దనాత్మతత్త్వములయందు. ఇందులో, పరా = అర్ధమాత్ర, పశ్యంతీ = మ, మధ్యమా = ఉ, వైఖరీ = అ, వీనికే నాదబిందుకళ లని పేరు. చిత్కలాం = మాయారూపమగు (దీనికే చిచ్ఛక్తి, అభిన్నశక్తి, శుద్ధమాయ, ప్రణవధ్వని, ప్రకృతి యని పేర్లు. చిచ్ఛక్తి = ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులు లేక సత్త్వరజస్తమో గుణములు.) ఇమ్ = ఇకారమును, సమాశ్రిత్య = ఆశ్రయించి, ఉః = వ్యాపకుఁడును, జగద్రూపః = సగుణ స్వరూపుఁడునగు, ఈశ్వరః = ఈశ్వరుఁడు, ణ్ = ఆయెను. (అః = నిర్గుణ బ్రహ్మము; ఇమ్ = మాయను (పొంది) ; ఉః = సగుణబ్రహ్మము ; ణ్ = ఆయెను. అని సూత్రార్థము.)

**తత్త్వవిమర్శినీ :** తత్రాద్యేన సూత్రేణ సర్వవర్ణానాం సమస్తభువనానాం చ సముద్భవరూపం స్వాత్మతత్త్వముపదిష్టమిత్యాహ – అకార ఇత్యనేన అః పరమశివో నిర్గుణః, ఇం మాయామాశ్రిత్య, ఉః వ్యాపకః సగుణః పరమేశ్వరః – ణ్, ఆసీదితి సూత్రార్థ– స్సూచితః. సర్వవస్తుషు పరాపశ్యంతీమధ్యమావైఖర్యాదిషు. "**చిత్కళా**" మిత్యత్ర "**గాయత్రీ పద్మినీ**" మితివదీకారో బోధ్యః. అత్ర సూత్రే ఈకారస్తు త్రినేత్రేణ నోదితః, ఇకారేణైవ ఈకారః ప్రకటితః. అత్ర ప్రమాణం "**అసద్వా ఇదమగ్ర ఆసీత్, తతో వై సదజాయత**" ఇతి

శ్రుతిః. అసద్బ్రహ్మ వై నిశ్చయేన అగ్రే సృష్టేః పూర్వం ఇదం అకారరూపాక్షరాత్మకం ఆసీత్ తతోఽక్షరాదసతో వై సత్ సగుణమజాయత జాతమితి తదర్థః. తదుక్తం గీతాయాం **"అక్షరాణామకారోఽస్మి"** ఇతి.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** వీనిలో మొదటిసూత్రముచేత సమస్తవర్ణములకును సమస్త లోకములకును కారణభూతమైన స్వాత్మతత్త్వ ముపదేశింపఁబడినది అని చెప్పుచున్నాఁడు. అః – నిర్గుణుఁడైన పరమశివుఁడు, ఇం – మాయను ఆశ్రయించి, ఉః – సగుణుఁడు, ణ్ – ఆయెను అని సూత్రార్థము సూచింపఁబడినది. పర పశ్యంతి మధ్యమ వైఖరి మున్నగుదానిలో, చిత్కలాం ఇం – ఇకారమును, పద్మినీ గాయత్రీ ఇత్యాదులంబోలె ఈకారాంతముగా గ్రహింపవలయును. ఈసూత్రమునందు పరమశివుఁడు ఈకారమును పఠింపకపోయినను ఇకారము చేతనే ఈకారము ప్రకటింపఁబడినది. ఈ విషయమున ప్రమాణము '**అసద్వా ఇదమగ్ర ఆసీత్, తతో వై సదజాయత**' అని శ్రుతి. అసత్ – బ్రహ్మము (అవ్యక్తనామరూపమైనది) నిశ్చయముగ సృష్టికి పూర్వము ఈ అకార రూపాక్షరాత్మకమైనది. ఆ యక్షరముననుండియే సగుణముగ ఆయెను అను శ్రుత్యర్థము. గీతలోను ఈ యర్థమే '**అక్షరాణామకారోఽస్మి**' అనుదానిచే చెప్పఁబడినది.

**విశేషాంశములు :–** "చిత్కలామిం" అనుచోట '**గాయత్రీమిక్ష్చేతి**' అను స్థలమునందువలె నీకారము గ్రాహ్యము. సర్గసంభవకాలమున "అ, ఇ, ఉ, ఋ, ఌ" అను **నైదువర్ణములే నలువది తొమ్మిదియక్షరము**లకును పంచభూతములకును వర్గపంచకమునకును గ్రమముగఁ గారణ మని ఇకారమే సూత్రమందుఁ జెప్పఁబడినది.

వాక్కులు పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి యని నాల్గువిధములు. పర = **సంకల్పము పుట్టుట;** పశ్యంతి = **సంకల్పమును వెలువరించుట;** మధ్యమ = దంతతాల్వోష్ఠవ్యాపారములతోఁ గూడినది; వైఖరి = బిగ్గఅగా మాటాడుట. ఈవాక్కులు, దిగువనుండి యొకటొకటి యడఁగిపోఁ గాఁ జివరకు నిలిచెడు పర **అనువాక్కుకూడ లేనపుడు బ్రహ్మానందము కలుగును.**

**శ్లో॥ పరా ప్రాణమయీ ప్రోక్తా – పశ్యంతీ చ మనోమయీ ।**
**మధ్యమా త్వింద్రియాణ్యాహు – ర్వైఖరీ వాగితి స్మృతా ॥**

**– బ్రహ్మర్షి వాచా.**

(పర **ప్రాణస్వరూప** యనియు, పశ్యంతి **మనోరూప** యనియు, మధ్యమ **యింద్రియ–స్వరూప** యనియు, వైఖరి **వాక్స్వరూప** యనియు బ్రహ్మర్షి వాక్కు గలదు.)

**శ్లో॥ పరా వృక్షేషు సంజాతా పశ్యంతీ భూజలేషు చ ।**
**మధ్యమా పశువక్త్రేషు మనుష్యేషు చ వైఖరీ ॥ – ఉత్తరగీత 1–62 శ్లో.**

(వృక్షములందు **పర యను వాక్కుండు** ననియు, భూమియందును, జలములందును **పశ్యంతి యనువాక్కుండు** ననియు, పశువుల వక్త్రముల యందు **మధ్యమ యనువాక్కుండు** ననియు, మనుజులందు శబ్దరూప యగు **వైఖరి యనువాక్కుండు** ననియు నుత్తరగీత నుడువుచున్నది.)

ఈ మధ్యమయే అంతఃకరణము.

**శ్లో॥ మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్ ।**
**సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత! ॥**
**సర్వయోనిషు కౌంతేయ! మూర్తయస్సంభవంతి యాః ।**
**తాసాం బ్రహ్మ మహద్యోనిరహం బీజప్రదః పితా ॥**

**– గీత 14–3,4.**

ఓ యర్జునుడా! సకల కార్యములకంటె నధికమైన దగుటవలన మహత్తనియు, సకలము వృద్ధి నొందించున దగుటవలన బ్రహ్మ మనియుఁ జెప్పఁబడును త్రిగుణాత్మికయైన మాయ యీశ్వరుఁడ నైన నాయొక్క గర్భస్థానమగుచున్నది. అట్టి గర్భస్థానమందు అనఁగా మహత్తనియు, బ్రహ్మమనియుఁ జెప్పఁబడు త్రిగుణాత్మకమైన మాయయందు హిరణ్యగర్భుఁడు మున్నగు సకలప్రాణులయొక్క జన్మమునకును గారణ మగుబీజమును (గర్భమును) క్షేత్ర క్షేత్రజ్ఞులనెడి ప్రకృతిద్వయముయొక్క శక్తిమాత్రుఁడ నీశ్వరుఁడ నగు నేను ఉంచుచున్నాను. ఆ గర్భమునుండి హిరణ్యగర్భుఁడును, అతనిమూలమున సకలభూతములును గలుగుచున్నవి. మఱియు నో కౌంతేయా! దేవపితృమనుష్యపశుమృగాది సకలయోనులయందును బుట్టు పలువిధములైన శరీరములకు **మాయ (ప్రకృతి) తల్లి యనియు**, పరమేశ్వరుఁడ నగు నేను గర్భాదానకర్త యగు **తండ్రి యనియుఁ** దెలిసికొనుము.)

**శ్లో॥ య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।**
**సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥** **– గీత 13–24**

(ప్రకృతి **నేనే**, ప్రకృతిజన్యము లగు సుఖదుఃఖమోహాదులు **నేనే**, అనుభవించునట్టివాఁడును **నేనే**, యనునట్టిది యజ్ఞానము. జీవాత్మపరమాత్మలను **వస్తుద్వయము** లేదు. వ్యవహారజన్యములైన యీశబ్దద్వయముచేతఁ జెప్పఁబడునది పరమాత్మయే యనియు, మాయావికారములైన సుఖదుఃఖమోహాదులతోఁ గూడినది ప్రకృతి యనియు నిశ్చయముగ నెఱుంగుటయే పరమాత్మ **జ్ఞానము**. అట్టి పరమాత్మజ్ఞానసంపన్నుఁడు శాస్త్రోక్తప్రకారము నడచుకొన్నను, **నడచుకొనకున్నను** అనఁగా **నెట్లు ప్రవర్తించినను** పునర్జన్మము నందఁడు. అనఁగాఁ **బ్రారబ్ధశరీరత్యాగముతో ముక్తుఁ డగును.**)

**"అసద్వా ఇదమగ్ర ఆసీత్, తతో వై సదజాయత, తదాత్మానగ్ స్వయమకురుత, తస్మాత్తత్సుకృతముచ్యత ఇతి, యద్వైతత్సుకృతం, రసో వై సః, రసగ్ హ్యేవాఽయం లబ్ధ్వాఽఽనందీ భవతి, కో హ్యేవాఽన్యాత్కః ప్రాణ్యాత్, యదేష ఆకాశ ఆనందో న స్యాత్, ఏష హ్యేవానందయాతి. 1. యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విందతే, అథ సోఽభయం గతో భవతి, యదా హ్యేవైష ఏతస్మిన్నుదరమంతరం కురుతే, అథ తస్య భయం భవతి, తత్త్వేవ భయం విదుషోఽమన్వానస్య తదప్యేష శ్లోకో భవతి. – "** **– తైత్తిరీయము, ఆనందవల్లి, 7.అనువాకము.**

(పరమాత్మయే కారణముగాఁగల ఈప్రపంచము సృష్టికి పూర్వము **నామరూపవిశేష రహిత** మగు **అవ్యాకృతస్వరూపముగ** నుండి సృష్ట్యనంతరము నామరూపవిశిష్టమగు సత్స్వరూపము గలదాయెను. ఆ బ్రహ్మము కారణాంతరమును **గాని,** సాధనాంతరమును **గాని** అపేక్షింపక **తానే** జగమును సృజించెను గావున, నది **స్వకర్తృక** మని చెప్పఁబడుచున్నది. అదియే **రసస్వరూపము.** అట్టి రసము ననుభవించియే జీవుఁడు సుఖవంతుఁ డగు చున్నాఁడు. హృదయాకాశమునం దిట్టి యానందస్వరూపుఁడే లేనియెడల లోకమునం దెవ్వఁడును ప్రాణాదిక్రియలను జేయఁ జాలఁడు. సాధకుఁడగువాఁ డింద్రియగోచరుఁడు కానట్టివాఁడును, అశరీరియు, చెప్పుటకు అలవికానివాఁడును అగు ఆత్మయందు భయరహితమైన స్థితి నెప్పుడు పొందునో అప్పుడే భయరహితస్థితిని పొందు చున్నాఁడు. పండితుఁడైనను ఎవఁడు బ్రహ్మమునందు **భేదబుద్ధిని గాంచునో** వానికి **భయమే కలుగుచున్నది.**)

"అసద్వా ఇదమగ్ర ఆసీత్, తతో వై సదజాయత" అను శ్రుతియు (అసత్ = బ్రహ్మము, వై = నిశ్చయముగ, అగ్రే = సృష్టికిఁ బూర్వము, ఇదమ్ = అక్షరాత్మకముగ, ఆసీత్ = ఆయెను, తతః = ఆ యక్షరమునుండి, వై = నిశ్చయముగ, సత్ = సగుణబ్రహ్మము, అజాయత = పుట్టెను). ఈ విషయమే గీతయందు '**అక్షరాణామకారోఽస్మి**' అని చెప్పఁబడెను.

**శ్లో॥ అక్షరాణామకారోఽస్మి – ద్వంద్వస్సామాసికస్య చ ।**
**అహమేవాఽక్షయః కాలో – ధాతాఽహం విశ్వతోముఖః ॥ –గీత 10–33.**

(అక్షరములలో అకారమును, అవ్యయీభావము, తత్పురుషము, బహువ్రీహి, ద్వంద్వము అను సమాసములలో నుభయపదార్థప్రధాన మగు ద్వంద్వసమాసమును, నాశములేని కాలమును, కర్మఫలప్రదుఁడగు చతుర్ముఖబ్రహ్మయు నేనే యగుచున్నాను.)

**శ్లో॥ యో వేదాదౌ స్వరః ప్రోక్తో – వేదాంతే చ ప్రతిష్ఠితః ।**
**తస్య ప్రకృతిలీనస్య – యః పరస్స మహేశ్వరః ॥ – ఉ.గీ. 1–22.**

(సకలవేదములకు నాదియం దుచ్చరింపఁబడునదియును, సకలవేదములకు నంతమునం దుచ్చరింపఁబడునదియును, ప్రకృతియం దణఁగియున్నదియునగు **ప్రణవమునకు బయట నుండువాఁడు పరమేశ్వరుఁడు.)**

(సకలవేదములను **రక్షింప నుంచఁబడిన స్వరము ప్రణవ మనఁబడును.** ప్రణవధ్వనియైన ప్రకృతియొక్క పరాశక్త్యాద్యవస్థలయందలి నాద (జీవుఁడు) బిందు (బుద్ధి) కళల (ప్రాణముల) లయమునకుఁ బరమై యుండువాఁడు మహేశ్వరుఁడు.

**శ్లో॥ మనోఽగ్రే వసతే బిందుః - ప్రాణాగ్రే వసతే కళా ।**
**ఉభయోర్లీయతే నాదో - లయ ఇత్యుచ్యతే బుధైః ॥**

(మనసున కగ్రముగానుండు బిందు వగు బుద్ధియు, ప్రాణమునకగ్రముగా నుండు కళయును లీన మైనప్పుడే నాదమును లయ మగును. అట్టి నిష్కళయే బ్రహ్మస్వరూపము. అదియే బ్రహ్మస్థానము.)

**శ్లో॥ ఓంకారధ్వనినాదేన వాయుసంహరణాత్మకమ్ ।**
**నిరాలంబం సముద్దిశ్య తత్ర నాదో లయం గతః ॥ - ఉ.గీ.1-47**

వాయువుయొక్క ఉపసంహారమే స్వరూపముగాఁగలదియు, **నిరాధారమునైన బ్రహ్మము** నోంకారధ్వని (నాదము)చేత లక్ష్యమునం దుంచి విద్వాంసుఁ **డెక్కడ లయమును బొందు చున్నాఁడో**, యక్కడ నాదము **లయమును** బొందును. అనఁగా (నోంకారధ్వన్యాత్మకమైన నాదముతోడ) (మారుతోపసంహరణాత్మకమైన **నిరాలయ నిర్విశేషబ్రహ్మమును లక్ష్యమున** నుంచుట చేత) (ఆ బ్రహ్మము**నందే నాదము లయించును.)** (ఆ నాదమే యా విష్ణుదేవుని పరమపద) మగును.

**(నాదమనఁగాఁ బ్రణవధ్వని.)** రేచకపూరకకుంభకాదులవలనఁ బుట్టిన వాయువు లయ మగుపర్యంతము **నానాద ముండును.)** ఆ వాయువు లయమైనయెడల నిరాలంబమైన బ్రహ్మమందు నాదము **లయ మగును.** అట్టి **వాయువు మనసుతో సంబంధించి** యున్నది. చిత్తైకాగ్రతంజేసి మనసును వృత్తిరహితముగఁ **జేసినచో నావాయువు వెంటనే లయ మగును.**

**శ్లో॥ దృగ్యుగ్మం లీయతే యత్ర - మనస్తత్రైవ లీయతే ।**
**దృఙ్మనో లీయతే యత్ర - మారుతం తత్ర లీయతే ॥**

అను ప్రమాణానుసారముగ, మనఃప్రాణములు లయ మగుచున్నవి. మఱియును **"మనోఽగ్రే వసతే బిందుః"** అను ప్రమాణము ప్రకారము **మనఃప్రాణములు లీన మైనపుడే నాదము లయమగును.** అదియే బ్రహ్మస్థానము.)

**శ్లో॥ అనాహతస్య శబ్దస్య తస్య శబ్దస్య యో ధ్వనిః**
**ధ్వనేరంతర్గతం జ్యోతిర్జ్యోతిరంతర్గతం మనః ।**
**తన్మనో విలయం యాతి - తద్విష్ణోః పరమం పదమ్ ।      - ఉ.గీ.1-46.**

(అనాహతచక్రముయొక్క ధ్వనిలోపల జ్యోతిస్సిమిడియున్నదనియు, ఆ మనస్సు జ్యోతిస్స్వరూప మైనదగుటచేత నామనస్సు జ్యోతిస్సులోపల నున్నదనియు తెలియవలెను. **ఇట్టి మన స్సెక్కడ లయమగుచున్నదో** యదియే విష్ణువుయొక్క పరమపద మని యెఱుంగవలయును. అనఁగా నెడతెగని నాదమందు జ్యోతి స్సున్నదనియు, నాజ్యోతిస్సునందు మనస్సంతర్గత మైయున్న దనియు, **నామనస్సు దేనియందు లయమగునో** యదియే **విష్ణువుయొక్క పరమపద మనియు** భావము. అనఁగా వృత్తిశూన్యమగు మనస్సే బ్రహ్మమందు లయించు నని భావము.)

### 3. కాశికా

**శ్లో॥ అకారస్సర్వవర్ణాగ్ర్యః - ప్రకాశః పరమశ్శివః**
**ఆదిరంత్యేన సంయోగా - దహమిత్యేవ జాయతే ।**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** సర్వవర్ణాగ్ర్యః = సకలవర్ణములకును, అనఁగా నక్షరములకు **మొదటిదియగు,** అకారః = అకారము, ప్రకాశః = ప్రకాశించునట్టి, పరమః+శివః = పర-మేశ్వరుఁడు. ఆదిః = మొదటి దగునట్టి అకారము, అంత్యేవ = **కడపటియక్షర మగు హకారముతోడ,** సంయోగాత్ = కలయుటవలన, **అహం = అహము** (అహమహంశబ్ద-ప్రత్యయాలంబనః ప్రత్యగాత్మా), ఇత్యేవ = అనియే, జాయతే = ఏర్పడుచున్నది.

అకారాది హకారాంతములగు వర్ణములు పరమాత్మనుండి యుద్భవించె నని భావము.

**తత్త్వవిమర్శినీ :** అత ఏవాహ - అకార ఇతి. ఆదిరంత్యేన సంయోగాదితి - ఆదిః అకారః, అంత్యో హకారః. అకారాది హకారాంతాస్సర్వే వర్ణాస్తతః పరమాత్మన స్సమభవన్నిత్యర్థః.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** మొదటివర్ణము అకారము. అంత్యః హకారము. అకారము మొదలు హకారమువఱకు నున్న యన్ని వర్ణములు నాపరమాత్మనుండి పుట్టెనని అర్థము.

**విశేషాంశములు :-** “జాగరితస్థానో వైశ్వానరోఽకారః ప్రథమా మాత్రాఽఽప్తే-రాదిమత్త్వాద్వాఽఽప్నోతి హవై సర్వాన్ కామానాదిశ్చ భవతి య ఏవం వేద”

**- మాండూక్యము - 9వ మంత్రము.**

(జాగ్రదవస్థయం దుండి స్థూలశరీరాభిమాని యగునాత్మయొక్క ప్రథమపాదమైన వైశ్వానరుఁడు, ఓంకారముయొక్క మొదటిమాత్ర యగు అకారము సర్వవాక్కులందు వ్యాపించి యన్నింటికిని మొదటి దైనట్టు సర్వమునందు వ్యాప్తమై సర్వమునకును మొదటివాఁ డగుటవలన, అకారమాత్రగానే యున్నాఁడు. ఇట్లు **ఓంకార ప్రథమమాత్ర యగు అకారమును** వైశ్వానరుని ఈరెంటి నొక్కటిగానే తెలిసికొనువాఁడు సమస్తకామములను బొంది మహాత్ములలో మొదటివాఁ డగును.)

**శ్లో॥ నిశ్వస్యాత్మవివక్షాయామాదిసామాన్యముత్కటమ్ ।**
**మాత్రాసంప్రతిపత్తౌ స్యాదాప్తిసామాన్యమేవ చ ॥**

**– గౌడపాదకారిక – ఆగమప్రకరణము –19.**

(స్థూలశరీరాభిమానియైన యాత్మయొక్క ప్రతమపాదమగు విశ్వుని ఓంకారముయొక్క ప్రథమమాత్రయగు అకారముగానే వివక్షించుటయందు అకారమునకువలెనే సర్వమునకు నాది యగుట సమాన మైనదిగా నావిశ్వునకు స్పష్ట మగుచున్నది. ఆ విశ్వుఁడు అకారమాత్రను బొందుటయందును సర్వమునందును వ్యాపించియుండుట అకారమునకు సమస్తవాక్కులందును స్ఫుట మగుచున్నది.)

### 4. కాశికా

**శ్లో॥ సర్వం పరాత్మకం పూర్వం జ్ఞప్తిమాత్రమిదం జగత్ ।**
**జ్ఞప్తేర్బభూవ పశ్యంతీ మధ్యమా వాక్తతస్ స్మృతా ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** పూర్వమ్ = (జగత్సృష్టికి) తొలుత, ఇదమ్ = ఈ, జగత్సర్వమ్ = జగత్తంతయు, పరాత్మకమ్ = **నాభియందుండు పరావాక్కు** రూపమగు, జ్ఞప్తిమాత్రం = జ్ఞానముగానే, బభూవ = కలిగెను. తతః = **అపశ్యంనుండి,** మధ్యమా = కంఠస్థానమందు, మధ్యమ యను, వాక్ = వాక్కు, స్మృతా = కలిగెనని చెప్పఁబడినది.

**తత్త్వవిమర్శినీ :** సర్వమితి. ఈశ్వర ఏవాఽనాదిజీవోపాధ్యాశ్రిత కర్మప్రేరిత ప్రాణవ్యాపారానంతరం నాభౌ పరాఖ్యం మాయా పరిణామముపేత్య హృది పశ్యంత్యాఖ్య-ముపేత్య విశుద్ధిచక్రే మధ్యమాఖ్యముపేత్య.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** సర్వము ఈశ్వరుఁడే అనాదియగు జీవరూపమైన ఉపాధిని ఆశ్రయించి యుండు కర్మములచే ప్రేరేపింపఁబడిన ప్రాణచేష్టకు తర్వాత **నాభియందు పర అనుపేరుగల** మాయాపరిణామము పొంది, హృదయమున **పశ్యంతి** అను పరిణామమును

పొంది, విశుద్ధిచక్రమునందు **మధ్యమ** అనుపరిణామమును పొంది, తర్వాత ముఖమునందు **వైఖరి అను** పేరుగల మాయాపరిణామమును పొంది, **వేదాదిరూపుఁ డగుచున్నాఁడు.**

**5. కాశికా**

**శ్లో॥ వక్త్రే విశుద్ధిచక్రాఖ్యే వైఖరీ సా మతా తతః ।**
**జ్ఞప్త్యావిర్భావమాత్రాత్మా మధ్యమా వాక్సమాయుతా॥**

**శ్లో॥ వక్త్రే విశుద్ధిచక్రాఖ్యే వైఖరీ సా మతా తతః ।**
**సృష్ట్యావిర్భావమాత్రాత్మా మధ్యమా వాక్సమీరితా ॥ ఇతి పాఠాంతరమ్.**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** తతః = పిమ్మట, విశుద్ధిచక్రాఖ్యే = విశుద్ధిచక్రమనఁబడు, వక్త్రే = వక్త్రమునందు (**కంఠస్థానమునందు**), సా = అది, వైఖరీ = వైఖరియై, (జాగ్రదవస్థావాగ్రూపముగ), మతా = ఒప్పియున్నది. (ఏవం = ఇట్లు), జ్ఞప్తి = జ్ఞాప్తియొక్క (సృష్టియొక్క), ఆవిర్భావమ్ = జననమును, ఆసాద్య = పొంది, మధ్యమా = మధ్యమ యను, వాక్ = వాక్కు, సమాయుతా = కూడియున్నది.

**తాత్పర్యము :** ఈశ్వరుఁడే యనాదిజీవోపాధ్యాశ్రితకర్మప్రేరితప్రాణవ్యాపారానంతరము **మూలాధారమందు** (ఉత్పత్తిక్రమము) **పర యనఁబడు మాయాపరిణామమును బొంది,** హృదయమునందు పశ్యంతి యనఁబడి, విశుద్ధిచక్రమునందు మధ్యమ యనునామముం బొంది, యనంతరము వక్త్రమునందు (అనఁగా నోటియందు) వైఖరి నాఁబడి వేదాదిరూపుఁ దగు-చున్నాఁడు.

**తత్త్వవిమర్శినీ :** పశ్చాద్వక్త్రే వైఖర్యాఖ్యమవాప్య వేదాదిరూపో భవతీత్యర్థః. శ్రుతిరపి **"వాగేవ విశ్వా భువనాని జజ్ఞే"** ఇతి. సూక్ష్మా వాగేవ విశ్వాకారేణ పరిణమతే వివర్తతే-వేత్యర్థః. శ్రుత్యంతరేపి **"వాచైవ విశ్వం బహురూపం నిబద్ధమ్" "తదేతదేకం ప్రవిభజ్యోపభుఙ్క్తే"** ఇతి. అత్ర వర్ణసంభవకాలే అ ఇ ఉ ఋ ఌ ఇతి వర్ణపంచకమేవ సర్వేషామేకోనపంచాశ-దక్షరాణాం పంచభూతానాం పంచవర్గాణాం చ క్రమేణ యోనిః, తచ్చ **దీర్ఘహ్రస్వభేదా ద్ద్వివిధమ్.**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** అ ఇ ఉ ఋ ఌ అను నైదువర్ణములే వర్ణములు సంభవించు కాలమున నలువది తొమ్మిది అక్షరములకును పంచభూతములకును పంచవర్గములకును క్రమముగఁ గారణ మాయెను. ఆ యక్షరపంచకము (అ ఇ ఉ ఋ ఌ) దీర్ఘము హ్రస్వ మని **రెండుభేదములు గలది.** దీనినిగూర్చి శ్రుతియు నిట్లు చెప్పుచున్నది. **'వాగేవ విశ్వా భువనాని జజ్ఞే'** (వాక్కే అనఁగా లోపల నణఁగి**యుండు జ్ఞప్తియే, సకలలోకములను గనెను.** అనఁగా

సూక్ష్మవాక్కే విశ్వాకారము నొందె నని భావము.) శ్రుత్యంతరములుగూడ నిట్లు చెప్పుచున్నవి. **'వాచైవ విశ్వం బహురూపం నిబద్ధమ్'** (వాక్కుచేతనే పెక్కురూపములుగ ప్రపంచము ఏర్పడినది.) **'తదేతదేకం ప్రవిభజ్యోపభుజ్క్తే'** (ఆ వాక్కు ఒక్కటిమాత్రమే ప్రపంచమును ప్రత్యేకముగ విభజించి యనుభవించుచున్నది.)

**6. కాశికా**

**శ్లో॥ అకారం సన్నిధీకృత్య జగతాం కారణత్వతః ।**
**ఇకారస్సర్వవర్ణానాం శక్తత్వాత్కారణం మతమ్ ॥**

**7. కాశికా**

**శ్లో॥ జగత్స్రష్టుమభూద్వాంఛా యదా హ్యాసీత్తదాఽభవత్**
**కామబీజమితి ప్రాహుర్మునయో వేదపారగాః ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** అవతారిక – అం దంతట ఇకారమునకే (మాయకే) స్వాతంత్ర్యము చెప్పఁబడెను. ఎట్లన:– ఇకారః = ఇకారము (మాయ), జగతామ్ = సకలజగములకును (అహంకారాది జగత్తునకు), కారణత్వతః = కారణ మగుటవలన, అకారమ్ = అకారమును, (బ్రహ్మమును), సన్నిధీకృత్య = సన్నిధియం దుంచుకొని (ఆధారముగఁగొని), సర్వవర్ణానామ్ = అక్షరములకెల్ల, శక్తత్వాత్ = సమర్థ మగుటంజేసి, కారణమ్ = కారణముగా, మతమ్ = అంగీకృతము.

**తాత్పర్యము :** జ్ఞప్తిమాత్రమైనది అకారము. తత్సాన్నిధ్యప్రభావమున ఇకారము సకలవర్ణము (అక్షరము)లకును మూలకారణ మగుచున్నది.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** అస్య = ఈ పరమాత్మకు, యదా హి = ఎప్పుడైతే, జగత్ = జగమును, స్రష్టుమ్ = సృజించుటకు, ఇచ్ఛా = కోరిక, అభూత్ = కలిగెనో, తదా = అప్పుడే, కామబీజమ్ = జీవోత్పత్తి, అభవత్ = ఆయెను, ఇతి = అని, వేదపారగాః = వేదములను గడముట్ట నెఱింగినవారగు, మునయః = మునులు (మననశీలురు), ప్రాహుః = చెప్పుదురు.

**తాత్పర్యము :** పరమాత్మకుఁగల జగత్సృష్టిసంకల్పమే కామబీజ మనియు, ఇకార మనియు, మాయ యనియు, కారణ మనియు నెఱుంగనగును.

**తత్త్వవిమర్శినీ :** తత్ర సర్వత్ర ఇకారస్యైవ స్వతంత్రతామాహ – అకారమితి.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** ఈ యన్నిటిలో ఇకారమునకే స్వాతంత్ర్య మని 'అకారం సన్నిధీకృత్య...' ఇత్యాదిచే వివరింపఁబడినది.

**తత్త్వవిమర్శినీ :** జగత్స్రష్టుమభూద్వాంఛేతి. ఉక్తం చ, "స్వప్రకాశపరమాత్మవస్తునో దృశ్యమానజగతస్సిసృక్షయా, కామతః పరశివప్రవేశనం కామబీజమిదమేవ నిశ్చితమ్" ఇతి.

**శ్లో॥ బీజం బిందుద్వయారూఢం సాధ్యయోనిస్వరూపకమ్ ।**
**మహాకామకలారూప మాత్మానం చింతయే ప్రియే! ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** స్వప్రకాశమైన పరమాత్మ వస్తువు దృశ్యమైన జగత్తును సృజింప వలయు ననుకామముతో పరమశివునినుండియే ప్రవేశించెను. ఇదియే కామబీజ మని నిశ్చయింపఁ బడినది. చిత్కళయును కామబీజము ననఁబడు ఇకారము పరమాత్మస్వరూప మనువిషయమును పార్వతికిఁ బరమశివుఁడే "బీజం బిందుద్వయారూఢం..." అని నుడివెను. బీజ మనఁగా **జీవుఁడు**. బిందువనఁగాఁ **ప్రకృతి**. ఈ రెంటి కెయ్యది **యుత్పత్తిస్థానమో, యెయ్యది సమస్తేచ్ఛలకు నునికిపట్టో** యదే పరమాత్మ కాఁబట్టి యా పరమాత్మనే సర్వదా ధ్యానింపవలయును.

### 8. కాశికా

**శ్లో॥ అకారో జ్ఞప్తిమాత్రం స్యాదికారశ్చిత్కళా మతా ।**
**ఉకారో విష్ణురిత్యాహుర్వ్యాపకత్వాన్మహేశ్వరః ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** అకారః = అకారము, జ్ఞప్తిమాత్రమ్ = జ్ఞప్తియే (కేవలజ్ఞానాకారమే), స్యాత్ = అగును. ఇకారః = ఇకారము, చిత్కళా = చిత్కళ యని, మతా = చెప్పఁబడినది. ఉకారః = ఉకారస్వరూపుఁడైన, మహేశ్వరః = ఈశ్వరుఁడు, వ్యాపకత్వాత్ = అంతటను నిండి యుండుటం బట్టి, విష్ణుః = విష్ణువు, ఇతి = అని, ఆహుః = (బుధవరేణ్యులు) చెప్పుదురు.

**తత్త్వవిమర్శినీ :**

**శ్లో॥ ఉక్తమేవ ద్రఢయతి. అకార ఇతి. ఉ వ్యాపకత్వేన ।**
**ణ్, ఈశ్వర ఆసీదర్థకః. ఉణీశ్వర ఇత్యత్రేతి భావః ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** మునుపు చెప్పినదానినే దృఢపఱుచుచున్నాఁడు. అ, ఇ, ఉణ్ అను సూత్రమున ఉ - వ్యాపకత్వముచే, ఈశ్వరుఁడు, ణ్ - ఆయె నని భావము.

పూర్వము చెప్పియుండు **ఇకారము మాయ.** ఇదే సర్వజగత్కారణమగుటకు ప్రమాణము:-

**శ్లో॥ అవ్యక్తనామ్నీ పరమేశశక్తి-**
**రనాద్యవిద్యా త్రిగుణాత్మికా పరా ।**

**కార్యానుమేయా సుధియైవ మాయా**
**యయా జగత్సర్వమిదం ప్రసూయతే ॥ - వివేకచూడామణి 110 శ్లో.**

వి.చూ.శ్లో. **111,112,125** చూడుఁడు.

## 2. సూత్రము ఋ, ఌక్.

### 9. కాశికా

**శ్లో॥ ఋ ఌక్ సర్వేశ్వరో మాయాం మనోవృత్తిమదర్శయత్ ।**
**తామేవ వృత్తిమాశ్రిత్య జగద్రూపమజీజనత్ ॥**

**శ్లో॥ (ఋ ఌక్ మహేశ్వరో మాయాం విస్తారితచరాచరామ్ ।**
**పత్నీమాశ్రిత్య చిద్రూపో జనయామాస కేవలః ॥) - ఇతి పాఠాంతరమ్.**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** ఋ = పరమాత్మ, ఌ = మనశ్శక్తి యను పరమేశ్వరిని, క్ = చూపెను. మాయామ్ = మాయారూప మగు, మనోవృత్తిమ్ = మనోవ్యాపారమును, అదర్శయత్ = చూపెను. తామ్ = ఆ, వృత్తిమ్ = వృత్తిని (మనశ్శక్తిరూప పరమేశ్వరిని,) ఆశ్రిత్య ఏవ = ఆశ్రయించియే, జగద్రూపమ్ = జగత్స్వరూపమును, ఆజీజనత్ = కనెను.

**తాత్పర్యము :** పరమేశ్వరుఁడు మాయారూపమైన మనోవ్యాపారమున జగత్తును నిర్మించెను. కావున నద్వైతహాని కలుగనేరదు.

**తత్త్వవిమర్శినీ :** నను సర్వవేదాంతేషు పరమేశ్వర ఏక ఇతి నిశ్చితత్వాత్ మాయాం ఈం చిత్కళాం సమాశ్రిత్య జగద్రూపోఽభూదిత్యుక్తే అద్వైతహానిస్స్యాదిత్యాశంకాయామాహ – ఋ ఌ గితి. తత్ర ఆద్యపాఠే ఋ = పరమేశ్వరః, ఌ = మాయాఖ్యాం మనోవృత్తిం, క్ = అదర్శయత్. తామేవాశ్రిత్య స్వేచ్ఛయా జగజ్జనయామాసేత్యర్థః. పాఠాంతరే – రసతా (తాం మనోవృత్తిమాశ్రిత్యేదం చరాచరం జనయామాసేత్యర్థః) ఋ పరమేశ్వర ఇత్యత్ర **"ఋతం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణపింగలమ్"** ఇతి శ్రుతిః ప్రమాణమ్. ఋతం తత్పదార్థం పరం బ్రహ్మ సత్యమిత్యర్థః. శ్రుత్యంతరమపి "సోఽకామయత బహు స్యాం ప్రజాయేయేతి". శ్రీతంత్రేఽపి, "మమ చాభూన్మనోరూపం ఌ కారః పరమేశ్వరి!" ఇతి. ఋఌవర్ణౌ యథా తాదాత్మ్యాపన్నౌ తథేత్యర్థః.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** ఇచ్చట ఒక ఆక్షేపము. సర్వోపనిషత్తులందును పరమేశ్వరుఁ డొక్కఁడే యని నిశ్చయింపఁబడి యున్నది. మాయ యగు ఇకారమును (చిత్కళను) పొంది జగద్రూపుఁ డాయె నని చెప్పినట్లయిన అద్వైతమునకు (రెండవ వస్తువు లే దనుటకు) లోపము గల్గు నని ఆశంక రాఁగా చెప్పుచున్నాఁడు. దీనిలో మొదటిపాఠమున **"ఋ"** పరమేశ్వరుఁడు

"ఇ" మాయ యను నామముగల మనోవృత్తిని చూపెను. దాని నాధారముగ నుంచికొనియే స్వేచ్ఛగా జగమును పుట్టించె నని అర్థము. పాఠాంతరమున – రసత్వము చెప్పియున్నది. మనోవృత్తి నాశ్రయించి చరాచరములను సృజించెను. ఋ – పరమేశ్వరుఁ డనుటకు "**ఋతం సత్య**" మిత్యాది శ్రుతి ప్రమాణము. తం – తత్పదవాచ్యమైన, ఋ – పరబ్రహ్మము, సత్యం అని అర్థము, "సోఽకామయత బహు స్యాం ప్రజాయేయేతి" అని మఱియొక శ్రుతియుఁ గలదు.

ఋ అనఁగా పరమేశ్వరుఁ డనుటకుఁ బ్రమాణము –

**శ్లో॥ ఋతం సత్యం పరం బ్రహ్మ – పురుషం కృష్ణపింగలమ్ ।**
**ఊర్ధ్వరేతం విరూపాక్షం – విశ్వరూపాయ వై నమో నమః ॥**

**– నారాయణవల్లీ – 23 అనువాకం.**

(పరం బ్రహ్మ = పరమాత్మ; కృష్ణ = ఇప్పుడు గూఢముగా నుండు నీశ్వరుఁడు, పింగలమ్ = ప్రకృతి). (ఈబ్రహ్మము శ్రేష్ఠమైనది. మఱియు, సత్య మైనదియు నని యర్థము. బ్రహ్మము వ్యావహారికమునందు హిరణ్యగర్భాఖ్యతోఁ గలదు. కావున తద్విలక్షణార్థము "**ఋతం సత్యం**" అని చెప్పఁబడినది. హిరణ్యగర్భాఖ్య మగు వ్యావహారికబ్రహ్మము కాదని యెఱుంగునది. అట్టి పరబ్రహ్మము భక్తులయం దనుగ్రహబుద్ధితో నుమామహేశ్వరాత్మకరూపము గల దగుచున్నది. ఆ రూపము కృష్ణపింగలవర్ణము గలిగియుండును. **మహేశ్వరసంబంధి యగు దక్షిణభాగమందుఁ బింగలవర్ణమును, ఉమా సంబంధియగు వామభాగమునందుఁ గృష్ణవర్ణమును గలదని భావము.** యోగబలముచేత నూర్ధ్వభాగ మగు బ్రహ్మరంధ్రమునందు తన **రేతస్సును జేర్చుకొన్నవాఁడు ఊర్ధ్వరేతుఁడు.** మూఁడు నేత్రములు గలుగుట చేత విరూపమైన అనఁగా విలక్షణమైన నేత్రములు గలవాఁడు. కావున **విరూపాక్షుఁ డనఁబడును.** జగత్తున కంతకును గారణ మగుటచేత జగదాత్మకుఁడు. అట్టి పురుషునకు నానమస్కారము.) "సోఽకామయత బహు స్యాం ప్రజాయేయేతి" అనియు శ్రుత్యంతరము ప్రమాణము – తైత్తి – బ్రహ్మ 6 అను, (ఆబ్రహ్మ మనేకము గావలయు నని కోరెను.)

ఇ అనఁగా మనోవృత్తి యనుటకుఁ బ్రమాణము –

**"మమ చాఽభూ న్మనోరూపం ఇకారః పరమేశ్వరి!"** అని శ్రీతంత్రము నుడువుచున్నది.

**విశేషాంశములు :** గీత 14 అ 3–4 శ్లోకములం దిట్లు చెప్పఁ బడియున్నది.

**శ్లో॥ మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్ ।**
**సంభవస్సర్వభూతానాం తతో భవతి భారత! ॥**

(ఓయర్జునుఁడా! సమస్తకార్యములకంటె నధికమైన దగుటంజేసి మహత్తనియు, సంకల్పము వృద్ధినొందించుటంజేసి కాని, ధరించుటఁజేసి కాని బ్రహ్మ మనియుఁ, జెప్పంబడు త్రిగుణాత్మికయైన మాయ యీశ్వరుఁడ నైన నాదు గర్భస్థానము. అట్టిమాయయందు హిరణ్యగర్భాది సకలప్రాణులయొక్క జన్మమునకు గారణ మగు బీజము నుంచుదును. ఆ గర్భమునుండి హిరణ్యగర్భుఁడును, అతనినుండి సకలభూతములును గలుగును.)

**శ్లో॥ సర్వయోనిషు కౌంతేయ! మూర్తయస్సంభవంతి యాః ।**
**తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా ॥**

(ఓయర్జునుఁడా! దేవ పితృ మనుష్య పశు కీటకాది సకలయోనుల యందును బుట్టు సకలవిధశరీరములకును మాయ (మహత్తనియు బ్రహ్మమనియుఁ జెప్పఁబడుప్రకృతి) తల్లి యనియును, పరమేశ్వరుఁడ నగు నేను బీజదాత యగు తండ్రి ననియు నెఱుంగుము.)

### 10. కాశికా

**శ్లో॥ వృత్తివృత్తిమతోరత్ర భేదలేశో న విద్యతే ।**
**చంద్రచంద్రికయోర్యద్వద్యథా వాగర్థయోరపి ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** చంద్రచంద్రికయోః = చంద్రునకును వెన్నెలకును, యద్వత్ = ఏవిధముగా, భేదలేశః = కొంచెమైనను భేదము, న విద్యతే = లేదో, యథా = ఏప్రకారము, వాగర్థయోరపి = శబ్దమునకు దానియర్థమునకును, భేదలేశః = కొంచెమైనను భేదము, న విద్యతే = లేదో, (తద్వత్ = ఆప్రకారముగా,) అత్ర = ఇచ్చట, వృత్తివృత్తిమతోః = వృత్తికిని వృత్తిమత్తునకును, భేదలేశః = ఏమాత్రము భేదమును, న విద్యతే = లేదు.

### 11. కాశికా

**శ్లో॥ స్వేచ్ఛయా స్వస్య చిచ్ఛక్త్యా విశ్వమున్మీలయత్యసౌ ।**
**వర్ణానాం మధ్యమం క్లీబం ఋ ౠ వర్ణద్వయం విదుః ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** స్వేచ్ఛయా = స్వేచ్ఛచేతను, స్వస్య = తన (పరమేశ్వరుని) యొక్క, చిచ్ఛక్త్యా = చిచ్ఛక్తియందు, అసౌ = ఈ పరమేశ్వరుఁడు, విశ్వమ్ = జగత్తును, ఉన్మీలయతి = సృజించుచున్నాఁడు. వర్ణానామ్ = అక్షరములలో (అక్షర సమామ్నాయమునందలి స్వరములలో), మధ్యమమ్ = నడిమిదియగు, ఋ ౠ వర్ణద్వయమ్ = ఋ ౠ అను అక్షరములజంట, క్లీబమ్ = నపుంసక వర్ణముగా, విదుః = ఎఱుంగుదురు.

**తాత్పర్యము :** చంద్రుఁ డనియు వెన్నెల యనియు వేర్వేఱు పదార్థములు వ్యవహారము నందుఁ దోఁచుచున్నను విజ్ఞానముచేతఁ జంద్రునకు జంద్రికకు నేభేదమును లేదు. అట్లే శబ్దము

నకును ఆ శబ్దార్థమునకును శబ్దద్వయముచేత భేదము తోఁచుచున్నను, విజ్ఞానముచేత శబ్దార్థముల కేమాత్రము భేదము లేదు. అట్లే మనోవృత్తికిని (మాయకును) వృత్తిమత్తునకును (బ్రహ్మమునకును) విజ్ఞానముచేత నేభేదము లేదని భావము. మఱియు నట్టి పరమేశ్వరుఁడు మనోవృత్తియను చిద్రూపశక్తియందు అనఁగా మాయయందు జగత్తును స్వేచ్ఛామాత్రమున సృజించుచున్నాఁడని భావము.

**తత్త్వవిమర్శినీ :** తదాహ – భేదలేశ ఇతి – వాస్తవ ఇత్యర్థః.

## 3వ సూత్రము. ఏ, ఓఙ్

### 12. కాశికా

**శ్లో॥ ఏ ఓఙ్మాయేశ్వరాత్మైక్యవిజ్ఞానం సర్వవస్తుషు ।**
**సాక్షిత్వాత్సర్వభూతానాం స ఏక ఇతి నిశ్చితమ్ ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** అవతారిక : స్వేచ్ఛచేతఁ బ్రపంచమును సృజించుచున్నాఁడని చెప్పుటంజేసి జన్యజనకభావ మేర్పడుచున్నది గదా! అప్పు డద్వైతము నకు హాని సంభవింపదా? అను ప్రశ్న కవకాశము కలుగకుండ "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" అను శ్రుత్యర్థము (అనఁగా జీవబ్రహ్మైక్యము) "ఏ ఓ ఙ్" సూత్రముచేత నిరూపింపఁబడుచున్నది.




నిర్గుణ బ్రహ్మచక్రపటమును చూడుఁడు.

**టీ.** సర్వభూతానామ్ = సకలభూతము (25 అనాత్మతత్త్వము) లకును, సాక్షిత్వాత్ = సాక్షి యగుటవలన, సర్వవస్తుషు = సకలపదార్థముల యందును (అనఁగా 25 అనాత్మ తత్త్వములయందు,) సః = ఆ పరమేశ్వరుఁడు, ఏకః = ఒక్కఁడే, మాయేశ్వరాత్మైక్యవిజ్ఞానమ్ = ఈశ్వరుఁడును మాయా కల్పిత ప్రపంచమును వేఱు గాదను విశేషజ్ఞానమే. ఏఓఙ్ = ఏ ఓ ఙ్ సూత్రముచేత నరయఁదగిన విషయము, ఇతి = అని, నిశ్చితమ్ = పెద్దలచే నిశ్చయింపఁ బడినది.

**తత్త్వవిమర్శినీ :** నను జనయామాసేత్యుక్తే జన్యజనకభావే అద్వైతహానిస్స్యా-దిత్యాశంకాయాం **"తత్సృష్ట్వా తదేవాఽనుప్రావిశత్"** ఇతి (తైత్తిరీయ) శ్రుతిమాశ్రిత్యాహ – ఏ.ఓ.ఙ్ మాయేశ్వరాత్మైక్యేతి. జన్యజనకత్వం చ స్వస్యైవ తత్తద్రూపేణ వివర్తనాదితి నాద్వైత హానిః. అకారోకారాభ్యాం నిష్పన్నప్రణవరూపేణ ఓకారేణ సగుణనిర్గుణయోరైక్యే బోధితే తేనైవ దృష్టాంతేన సర్వత్రైక్యబుద్ధిః ద్వైతనిరాసో ధ్వనితః. సమష్టివ్యష్టిభేదేన పూర్వవర్ణ-యుతద్వితీయస్య తద్యుక్తతృతీయస్య చ సమన్వయబోధకమిదం సూత్రమ్. అ – అక్షరాత్మకః, ఇ – మాయాయుక్తః సన్ యః సః. ఏ = జ్ఞానరూపప్రజ్ఞానాత్మా సర్వవస్తూనా-మేకత్వాదద్వైతోపపత్తిః. న నానాత్వం జన్యజనకత్వంచ స్వయం ప్రవిశ్య తత్తద్రూపేణ వర్తతే ఇత్యర్థః. వటబీజన్యాయేన చ పూర్వసూత్రద్వయజనితం వర్ణపంచకమేవ సకలజగత్కారణ మితి ప్రాగుక్తమ్. ఉత్తరసూత్రవర్ణానామపి తస్మాదేవ సంభవః సమష్టి వ్యష్టి భేదేషు పూర్వవర్ణయుతద్వితీయస్య పూర్వవర్ణయుతతృతీయస్య చ సంయోగజనకమిదం సూత్రం సమన్వయబోధనమపి ఏకత్వేనోక్తమ్. అత్రాస్య పరత్వే సర్వవేదసమ్మతం చ. తథా చ సనకదక్షిణామూర్తిసంవాదే మహావాక్యవివరణే:-

**శ్లో॥ శృణు త్వం సావధానేన చతుర్ణామపి సామ్యతా ।**
**వేదానాం చ మహాభాగ! చతుష్కాణామిహోచ్యతే ॥**

**శ్లో॥ బ్రహ్మశబ్దేన యద్వస్తు తత్ప్రజ్ఞానముదీరితమ్ ।**
**ప్రజ్ఞానం బ్రహ్మ యస్మాద్ధి తస్మాద్బ్రహ్మాస్మ్యహం తతః ॥**

**శ్లో॥ తద్బ్రహ్మ సర్వసాక్షిత్వాత్తత్త్వమస్యేవ తత్త్వతః ।**
**అన్యత్వ వారణార్థాయ హ్యయమాత్మేత్యథర్వణీ ।**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** 'జనించె' ననినట్లయిన జన్యజనకభావము (పుట్టింపఁబడు నది పుట్టించువాఁడు) సంభవించును గాన, అద్వైతమునకు (ఐక్యావాదమునకు) హానిగల్గు నని ఆశంక ప్రాప్తముకాఁగా, **"తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్"** (ఆ బ్రహ్మము సృజించెను. అదియే ప్రవేశించెను.) అను శ్రుతినిబట్టి సమాధానము చెప్పుచున్నారు, **"ఏ ఓ ఙ్మా యేశ్వరే"**త్యాదిచే. జన్యజనకత్వ

మెట్లనఁగా ఆ యొక వస్తువే ఆయావిధముగా వివర్త మగుటచే అద్వైతమునకు హాని కలుగనేరదు. అకార ఉకారముల సంయోగమువలనఁ గల్గిన ఓంకార రూపమైన ఓకారముచేతనే సగుణ నిర్గుణముల కైక్యము చెప్పఁబడెను. ఆ దృష్టాంతముచేతనే సర్వ మేక మని బుద్ధి కలుగుటవలన ద్వైతనిరాసము ధ్వనింపఁబడుచున్నది.

ఈ సూత్రము ప్రథమవర్ణమైన అకారముతోఁ గూడిన తృతీయవర్ణమైన ఉకారమునకును, అకారముతోఁ జేరిన ద్వితీయవర్ణమైన ఇకారమునకును సమష్టిగాను వ్యష్టిగాను సమన్వయమును (ఐక్యమును) బోధించుచున్నది. ఎట్లనిన, అ – అక్షరాత్మకుఁడైన ఏపరమాత్మ, ఇ – మాయాయుక్తుఁ డైనాఁడో వాఁడే, ఏ – ప్రజ్ఞానాత్మuఁ డాయెను. కావున సర్వవస్తువు లొకటే యనుటలో నద్వైతమునకు హానిలేదు. భేదమును జన్యజనకభావమును లేదు. తానే ప్రవేశించి ఆయారూపముతో నున్నాఁడని యర్థము. వటబీజన్యాయమువలన నిది సమన్వయ మగుచున్నది.

మొదటి రెండుసూత్రములచే నెఱిఁగింపఁబడిన యైదువర్ణములే సమస్త లోకములకును కారణ మని చెప్పఁబడినది. రాఁబోవు సూత్రములకుఁగూడ నీవర్ణపంచకమే కారణము. సమష్టి వ్యష్టి భేదముగా నీసూత్రము పూర్వవర్ణములతోఁ జేరినది. ద్వితీయవర్ణమునకును, అట్లే పూర్వవర్ణముతోఁ జేరిన తృతీయవర్ణమునకును సంయోగమును బోధించుచున్నది. ఏకత్వము వలననే సమన్వయము బోధింపఁబడినది. ఇచ్చట ప్రతిపాదింపఁబడిన అక్షరాత్మక బ్రహ్మము పర మనుటలో సర్వవేదసమ్మతము. అట్లే సనకదక్షిణామూర్తిసంవాదమున మహావాక్య వివరణమునందు చెప్పఁబడియున్నది. సమాహితమైన మనస్సుతో వినుము. నాలుగు మహావాక్యము లకును నాలుగు వేదములకును సామ్యము (సమన్వయము – ఏకార్థప్రతిపాదకత్వము) నిచ్చట చెప్పెదను. బ్రహ్మ శబ్దముచేత నే వస్తువు సూచింపఁబడునో అదియే ప్రజ్ఞానశబ్దముచేతను చెప్పఁ బడును. ఆ ప్రజ్ఞానము బ్రహ్మమగుటంజేసియే నేనా బ్రహ్మముగా నున్నాను. ఆ బ్రహ్మము సర్వసాక్షి యగుటంజేసి యథార్థముగ నాబ్రహ్మము నీవైతివి. బ్రహ్మముకంటె నన్య మెద్దియు లేదు. సర్వము బ్రహ్మమే యని నిరూపించుటకొఱకే "**అయమాత్మా**" (ఈజీవుఁడే బ్రహ్మము) అని యథర్వణము నుడువుచున్నది.

**విశేషాంశములు :** తైత్తిరీయ – ఆనందవల్లి 6–వ అనువాకము.

"అసన్నేవ స భవతి, అసద్బ్రహ్మేతి వేద చేత్, అస్తి బ్రహ్మేతి చేద్వేద, సంత–మేనం తతో విదురితి, తస్యైష ఏవ శారీర ఆత్మా, యః పూర్వస్య, అథాతోఽనుప్రశ్నాః, ఉతా విద్వానముం లోకం ప్రేత్య కశ్చన గచ్ఛతి **3** అహో, విద్వానముం లోకం ప్రేత్య కశ్చిత్సమశ్నుతా **3** ఉ. సోఽకామయత బహు స్యాం ప్రజాయేయేతి, స తపోఽతప్యత, స తపస్తప్త్వా ఇదగ్ంం సర్వమసృజత, యదిదం కిం చ, తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్,

తదనుప్రవిశ్య, సచ్చ త్యచ్చాభవత్, నిరుక్తం చానిరుక్తం చ, నిలయనం చానిలయనం చ, విజ్ఞానం చావిజ్ఞానం చ, సత్యం చానృతంచ సత్యమభవత్, యదిదం కించ, తత్సత్య-మిత్యాచక్షతే, తదప్యేష శ్లోకో భవతి."

(పరబ్రహ్మము లేదని తెలిసికొనువాఁడు సమస్తవర్ణాశ్రమాదివ్యవస్థాలక్షణ మగు సన్మార్గమందును, వ్యవహారాతీతమైన పరబ్రహ్మమునందును, నాస్తికత్వమును బొందు చున్నాఁడు. పరబ్రహ్మస్వరూపమున్నదని తెలిసికొనువానిని అట్లు తెలిసికొనుటవలన పరబ్రహ్మ స్వరూపమును బొందినవానినిగా బ్రహ్మవేత్తలు తెలిసికొనుచున్నారు. (అనఁగా నాజనుఁడు ఇతరులకు పరబ్రహ్మమువలెనే తెలిసికొనఁదగినవాఁ డగుచున్నాఁడు.) ఆ కారణమువలన నానందాత్మకమగు నాకాశాదిసర్వకారణమైన యా పరబ్రహ్మమున్న దని తెలిసికొనవలయును. ఇట్టి పరబ్రహ్మస్వరూపమగు నానందమయాత్మ పూర్వము చెప్పియున్న విజ్ఞానమయమున కాంతరమగు నాత్మస్వరూపముగా నున్నది. ఇట్టి పరబ్రహ్మము జ్ఞాన్యజ్ఞానులకు సమాన మగుటం జేసి యుభయులకును బొందఁదగినదేకదా యని శిష్యుఁడు గురువాక్యము ననుసంధించి యీ ప్రశ్నలు చేయుచున్నాఁడు:-

ఓస్వామీ! యీ పరబ్రహ్మమును అజ్ఞాని మరణానంతరము పొందుచున్నాఁడా? లేదా? జ్ఞానియు మరణానంతరము పరబ్రహ్మమును పొందుచున్నాఁడా? లేక యజ్ఞాని వలెనే పొందఁడా? అని ప్రశ్నింపఁగా నీప్రశ్నలకు నుత్తరము చెప్పుటకు నుత్తరగ్రంథ ముపక్రమింపఁ బడుచున్నది.

సత్యజ్ఞానానందాత్మకమగు నాపరబ్రహ్మము తాను బహువిధములై పుట్టవలయు నని కోరెను. (ఒక్కఁడై పరిపూర్ణమగు బ్రహ్మమనేకవిధములగుట యెట్లు సంభవించు ననఁగా, ఆత్మయందు నభివ్యక్తములు గాక యుండెడి నామరూపము లెప్పు డభివ్యక్తము లగుచున్నవో యప్పుడు పరబ్రహ్మముచేత నాత్మవంతములగు నా నామరూపములచేత ఘటాద్యావరణములచేత నాకాశము పలుతెఱంగులైనట్లు పరబ్రహ్మము బహువిధములాయెను.) ఇట్లా పరబ్రహ్మము కోరినవాఁడై జగద్రచనావిషయక మైన యాలోచన చేసెను. ఈ ప్రకార మాలోచించి ప్రాణికర్మాది నిమిత్తానురూపముగా నీసమస్తజగత్తును దేశకాలములవలన నామరూపములతోఁ బ్రాణులయొక్క అనుభవప్రకారము సృజించెను. అట్లు సృజింపఁబడిన జగత్తునందు తాను ప్రవేశించెను. (సర్వత్ర పరిపూర్ణమును, సర్వాంతరమును, సర్వకారణమును, నిరవయవమునగు పరబ్రహ్మము మఱొక వస్తువునందుఁ బ్రవేశించుట యెట్లన? ఇంతకుఁ బూర్వము "**బ్రహ్మవిదాప్నోతి పరం సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ, యో వేద నిహితం గుహాయామ్**" అను వాక్యమందుఁ జెప్పఁబడిన పరబ్రహ్మవిజ్ఞానముకొఱకు ఆకాశాది సమస్తకార్యమును జూపింపఁ బడినది. ఆ కార్యమునందు

అన్నమయాత్మకంటె నంతరమైనది ప్రాణమయాత్మ యనియు, దానికంటె నంతరమైనది మనోమయాత్మ యనియు, దానికంటె నంతరమైనది విజ్ఞానమయాత్మ యనియుఁ జెప్పి యీవిజ్ఞానమయ స్వరూపమగు బుద్ధిగుహయందు ఆనందమయ మగు నాత్మ ప్రవేశించియున్న దని చూపింపఁబడినది. ఈకారణమువలన పరమానందమయ మనులింగముయొక్క ప్రాప్తిద్వారా ఆనందాభివృద్ధియొక్క యవసానమే స్వరూపముగాఁగలదియును, సమస్తవికల్పములకు నాస్పదమును, నిర్వికల్పమును, ఆనందమయమునకు పుచ్ఛమువలె నాధారమునగు పరబ్రహ్మము ఈ విజ్ఞానగుహయందే పొందఁదగియున్నది. స్థలాంతరమునందుఁ బొందఁబడదు. కనుక పరబ్రహ్మమునకు "**తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్**" అను వాక్యముచేత విజ్ఞానగుహయందుఁ, బ్రవేశము కల్పింపఁబడినది. ఇట్లు ప్రవేశించి యా పరబ్రహ్మము సమానాసమాన జాతీయముల చేతను దేశకాలములతోఁగూడుకొనుటచేతను ఇదియదియని చెప్పఁబడునదియును, సర్వమునకు నాశ్రయమును, చేతనమును, వ్యవహారమునందలి వస్తువుల సత్యస్వరూపమునగు మూర్త ద్రవ్యమును, ఇది యది యని చెప్పఁబడనిదియు, దేనికి నాశ్రయము కానిదియు, చేతనము కానిదియు, అసత్యస్వరూపము నగు రజ్జుసర్పాదిభ్రమరూపమునై యమూర్తస్వరూప మాయెను. ఇట్లు మూర్తామూర్తరూపమగు నీ సమస్తప్రపంచము పారమార్థికసత్య మగు పరబ్రహ్మమే యగుచున్న దని బ్రహ్మవేత్తలు చెప్పెదరు. ఈప్రకారము సర్వకారణమును సర్వస్వరూపమునగు పరబ్రహ్మ మున్న దని తెలిసికొనవలయును. ఈయర్థమందు బ్రాహ్మణవాక్యమువలనఁ బూర్వము చెప్పిన యన్నమయాది పంచకోశములయందలి యన్నమయాద్యాత్మప్రకాశకము లగు మంత్రములవలెనే సర్వమునకు నంతరతమ మగు నాత్మయొక్క యస్తిత్వమును బ్రకాశింపఁజేయునట్టిది యీమంత్ర మగుచున్నది.) ఆధ్యాత్మరామాయణము - పంచమసర్గము, రామగీత, 48 మొ. 54 వఱకు.

**శ్లో॥ పూర్వం సమాధేరఖిలం విచింతయే-**
**దోంకారమాత్రం సచరాచరం జగత్ ।**
**తదేవ వాచ్యం ప్రణవో హి వాచకో**
**విభావ్యతేఽజ్ఞానవశాన్న బోధతః ॥**

(సమాధిని బొందఁగోరువాఁడు మొదట జంగమస్థావరాత్మక మైన సమస్త ప్రపంచమును ఓంకారముగ నిశ్చయింపవలెను. ఎందువల్ల ననఁగా లౌకికవైదికములైన సమస్తశబ్దములు నోంకారమువలనఁ బుట్టినట్లు శ్రుతి చెప్పుచున్నది. కారణమునకును గార్యమునకును అభేద మగుటవలనఁ గారణమైన యోంకారమునకును గార్యమైన సమస్తవైదిక శబ్దములకును అభేదము. వాచ్యవాచకముల కభేద మగుటంజేసి వాచకములగు నీశబ్దములకును వాచ్యములగు నర్థములకును

అభేదము. అందువలన నోంకారమునకును వాచ్యవాచక రూపమగు సమస్తప్రపంచమునకును నభేద మగును. కాఁబట్టి యట్టియభేద భావన చేయవలయును. వాచ్యవాచకాత్మకమైన సమస్తప్రపంచము నజ్ఞానముననే తోఁచును గావున నీభావన జ్ఞానకాలమునందు లయ చింతనార్థము సేయవలయును.)

**శ్లో॥ అకారసంజ్ఞః పురుషో హి విశ్వకో**
**హ్యుకారకస్తైజస ఈర్యతే క్రమాత్ ।**
**ప్రాజ్ఞో మకారః పరిపఠ్యతేఽఖిలై-**
**స్సమాధిపూర్వం నతు తత్త్వతో భవేత్ ॥**

(లయచింతనము చెప్పుటకై మొదట నోంకారమునందుఁ బ్రపంచారోపము వివరింపఁ బడుచున్నది. వ్యష్టిస్థూలాభిమాని జీవుఁడగు విశ్వునకును, సమష్టిస్థూలాభిమానియగు విరాట్టునకును అకారము వాచకము. వ్యష్టిసూక్ష్మాభిమానియగు తైజసునకును, సమష్టిసూక్ష్మాభిమానియగు హిరణ్యగర్భునకును ఉకారము వాచకము. వ్యష్టికారణాభిమానియగు ప్రాజ్ఞునకును, సమష్టి కారణమగు మాయయం దభిమానియగు నీశ్వరునకును మకారము వాచకము. ఇట వ్యష్టిసమష్టు లకును వాచ్యవాచకములకును అభేద మగుటవలన విశ్వవిరాట్టులకును అకారమునకును, తైజసహిరణ్యగర్భులకును ఉకారమమునకును, ప్రాజ్ఞేశ్వరులకును మకారమునకును అభేద మని యెఱుంగవలయును.)

**శ్లో॥ విశ్వం త్వకారం పురుషం విలాపయే-**
**న్మకారమధ్యే బహుధా వ్యవస్థితమ్ ।**
**తతో మకారే ప్రవిలాప్య తైజసం**
**ద్వితీయవర్ణం ప్రణవస్య చాంతిమే ॥**

(అకారము అకారవాచ్యుఁడైన విశ్వుఁడు విరాట్టు – వీరికి, ఉకారము ఉకారవాచ్యుఁ డైన తైజసుఁడు హిరణ్యగర్భుఁడు వీరికి, మకారము మకారవాచ్యుఁడైన ప్రాజ్ఞుఁడు ఈశ్వరుఁడు వీరికి నభేదము చింతింపవలెను.)

**శ్లో॥ మకారమప్యాత్మని చిద్ఘనే పరే**
**విలాపయేత్ప్రాజ్ఞమపీహ కారణమ్ ।**
**సోఽహం పరం బ్రహ్మ సదా విముక్తిమ-**
**ద్విజ్ఞానదృఙ్ముక్త ఉపాధితోఽమలమ్ ॥**

(అంత మకారము మకారవాచ్యుఁడైన ప్రాజ్ఞుఁడు ఈశ్వరుఁడు వీరికి, అమాత్రము

జీవసాక్షి ఈశ్వరసాక్షి వీరికి నభేదము చింతింపవలెను. అంత నేను నిత్యశుద్ధముక్తమగు పరబ్రహ్మమును, సర్వమునకును సాక్షిని సర్వోపాధిరహితుఁడును శుద్ధుఁడును అను అనుభవము కలుగును.)

**శ్లో॥ ఏవం సదా జాతపరాత్మభావన-**
**స్స్వానందతుష్టః పరివిస్మృతాఖిలః ।**
**ఆస్తే స నిత్యాత్మసుఖప్రకాశక-**
**స్సాక్షాద్విముక్తోఽచలవారిసింధువత్ ॥**

(ఇట్లు నిరంతరము బ్రహ్మాకారవృత్తిగలవాఁడు ఆత్మానందముచేతనే నిత్యతృప్తుఁడై యుండును గాని విషయముల నపేక్షింపఁడు. దేహాదిసమస్త ప్రపంచము బాధిత మగుటంజేసి యది యంతయు మఱచి సచ్చిదానంద స్వరూపుఁడై యే విషయములు వచ్చినను ఏ విషయములు పోయినను నిస్తరంగమైన సముద్రముంబోలె నెంతమాత్రమును చలింపకయుండును.)

**శ్లో॥ ఏవం సదాఽభ్యస్తసమాధియోగినో**
**నివృత్తసర్వేంద్రియగోచరస్య హి ।**
**వినిర్జితాశేషరిపోరహం సదా**
**దృశ్యో భవేయం జితషడ్గుణాత్మనః ॥**

(ఇట్లు నిరంతరము సమాధినిష్ఠగలవాఁడై యింద్రియవిషయములను విడిచి కామాద్యరి షడ్వర్గమును జయించినవానికే బ్రహ్మైక్యజ్ఞానము కలుగును.)

**శ్లో॥ ధ్యాత్వైవమాత్మానమహర్నిశం ముని-**
**స్తిష్ఠేత్సదా ముక్తసమస్తబంధనః ।**
**ప్రారబ్ధమశ్నన్నభిమానవర్జితో**
**మయ్యేవ సాక్షాత్ప్రవిలీయతే తతః ॥**

(ఇ ట్లాజ్ఞాని నిరంతరము బ్రహ్మాత్మైక్యానుభవానంద మనుభవించుచు నవిద్యాకృత బంధము లన్నియు వీడినవాఁ డై యభిమానము లేక ప్రారబ్ధోపనీతమైన భోగముల ననుభవించు చుండి ప్రారబ్ధము నశించినపిదప నాలోనే యైక్యము నొందును.)

**"ప్రజాపతిర్లోకానభ్యతపత్తేభ్యోఽభితప్తేభ్యస్త్రయీ విద్యా సంప్రాస్రవత్తామభ్యతప-త్తస్యా అభితప్తాయా ఏతాన్యక్షరాణి సంప్రాస్రవన్త భూర్భువస్సువరితి."**

**"తా నభ్యతపత్తేభ్యోఽ భితప్తేభ్య ఓంకారస్సంప్రాస్రవత్తద్యథా శంకునా సర్వాణి పర్ణాని సన్తృణ్ణాన్యేవమోంకారేణ సర్వా వాక్ సన్తృణ్ణా. ఓంకార ఏవేదగ్ సర్వమోంకార ఏవేదగ్ సర్వమ్."** **- చాందోగ్యోపనిషత్ 11-23-2,8**

(లోకముల నుద్దేశించి వానిలో నేది సార మని బ్రహ్మ ధ్యానించెను. వానిలో మూఁడువేదములు సార మని తోఁచెను. ఆ మూఁటిలో నేది సార మని ధ్యానించెను. భూః, భువః, సువః, అనునీమూఁడు వ్యాహృతులు సార మని తోఁచెను. వానిలో నేది సార మని ధ్యానించెను. ఓం అను ప్రణవము సార మని తెలిసికొనెను. (ఓం అనునాదము బ్రహ్మశరీరము. అనఁగా దానిలో బ్రహ్మము జ్యోతిర్మయమై కనఁబడుచున్నది. అనఁగా ఓం అనుశక్తి దానియందు బ్రహ్మము ప్రకాశించుచున్నది.) లోకమున పర్ణముయొక్క మధ్యనాళముచేత సమస్తపర్ణము లనుస్యూతమై యెట్లు వ్యాపింపఁబడియున్నవో యట్లే స్థూలసూక్ష్మరూపముగా నుండు ప్రపంచమంతయు నామమాత్రవికారమును, సమస్తనామములు, అకారమునందు చేరియున్నందున అకార మాత్రమును, అకారము ఓంకారమునందు అవయవభూతమైన యొక వర్ణముగా నున్నందున ఓంకారముచేతనే వ్యాపింపఁబడి యున్నది. సర్వము నోంకారమే.)

**"వ్యాప్తేశ్చ సమంజసమ్"** - బ్రహ్మసూత్రము 111-3-9.

[(ఓంకారస్య = ఓంకారము) వ్యాప్తేః = వేదమునం దెల్ల వ్యాపించి యున్నది కావున, ఉద్గీథపదమ్ = ఉద్గీథమనుమాట, తద్విశేషణమిత్యేవ = దాని విశేషణ మనుటయే, సమంజసం = సరియైనది.]

ఓంకారము సర్వవేదవ్యాప్తము కాఁబట్టి **"ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీత"** (ఛాందోగ్య. 1-1-1) అను వాక్యమునందలి యుద్గీథము విశేషణమే యని తాత్పర్యము.

**శ్లో॥ ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీత,**
**ఓమిత్యుద్గాయతి తస్యోపవ్యాఖ్యానమ్ - ఛాందోగ్య. 1-1-1.**

(ఉద్గీథవాచ్యమైన ఓంకారము నుపాసింపవలయును. ఓం అని ఉద్గాత గానము చేయుచున్నాఁడు. ఆ ఓంకారముయొక్క వివరణము చెప్పఁబడును.)

భగవద్గీత 8వ అధ్యా. శ్లో మొ 13 వఱకు.

**శ్లో॥ యదక్షరం వేదవిదో వదన్తి**
**విశన్తి యద్యతయో వీతరాగాః ।**
**యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరన్తి**
**తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥**

(వేదార్థము నెఱింగినవారిచేత నాశరహితమైన దని చెప్పఁబడుచున్నదియు, కామక్రోధాదులను జయించిన యతులచేఁ బ్రవేశింపఁబడుచున్నదియు, భిక్షాన్నాదివ్రతముల నవలంబించి బ్రహ్మచారులచేతఁ దెలియఁబడఁగోరుచున్నదియునైన మోక్షపదమును సంగ్రహముగ చెప్పెదను.)

**శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।**
**మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ ॥**

**శ్లో॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥**

(ఎవ్వఁడు సకలేంద్రియద్వారములఁ జక్కఁగ బంధించి మనస్సును హృదయ పుండరీకమునందు నిలిపి ప్రాణవాయువును శిరస్సునకు సమీపమున నున్న కనుబొమలనడుమ నుంచి బ్రహ్మవాచకమైన యోంకారమును స్మరించుచు నా యోంకారవాచ్యమైన బ్రహ్మమును ధ్యానించుచు యోగస్థైర్యమునందునో యతఁడు శరీరత్యాగానంతరము సర్వోత్తమ మైనగతిని బొందును.)

**శ్లో॥ జ్ఞానానాముపసంహారో బుద్ధేః కారణతాస్థితిః ।**
**వటబీజే వటస్యేవ సుషుప్తిరభిధీయతే ॥ - పంచీకరణవార్తికము.**

(మఱ్ఱివిత్తునందు మఱ్ఱిచె ట్టడఁగియుండునట్లు జ్ఞానలయస్థానమైన బుద్ధియొక్క కారణత్వస్థితి సుషుప్తి యనఁబడును.)

కఠోపనిషత్ 1-2-15,16,17శ్లో. ఇది యమనాచికేతోపదేశము.

**శ్లో॥ సర్వే వేదా యత్పదమామనంతి**
**తపాంసి సర్వాణి చ యద్వదంతి ।**
**యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి**
**తత్తే పదగ్ం సంగ్రహేణ బ్రవీమి. ఓమిత్యేతత్ ॥**

(వేదము లన్నియు నుపనిషత్తు లన్నియు నియమము లన్నియు నే స్వరూపము నుద్దేశించి చెప్పుచున్నవో యట్టి స్వరూపము సంగ్రహముగా నోంకారమే.)

**శ్లో॥ ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్ ।**
**ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ ॥**

(ఈ ఓంకారమును బ్రహ్మస్వరూపమునుగాను శ్రేష్ఠమైనదిగాను జక్కఁగఁ దెలిసికొని యెవఁడు దేనినిగోరి యుపాసించునో వాని కది సిద్ధించును.)

**శ్లో॥ ఏతదాలంబనం శ్రేష్ఠ - మేతదాలంబనం పరమ్ ।**
**ఏతదాలంబనం జ్ఞాత్వా - బ్రహ్మలోకే మహీయతే ॥**

(పరాపరబ్రహ్మరూపమును శ్రేష్ఠమును బ్రహ్మప్రాప్తిసాధనము నైన యోంకారమును తెలిసికొని నరుఁడు బ్రహ్మలోకమునందుఁ బూజ్యుఁ డగు చున్నాఁడు.)

కఠోపనిషత్. 1-5-12-13.

**శ్లో॥ ఏకో వశీ సర్వభూతాంతరాత్మా**
**ఏకం బీజం బహుధా యః కరోతి ।**
**తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా-**
**స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥**

(ఏయాత్మ సమానాధికములు లేనిదై బీజభూతము నవ్యక్తమునగు తన్ను నామరూప భేదములచేత ననేకవిధములుగ చేయుచున్నదో బుద్ధిగుహయం దుండు నా పరమాత్మను బ్రత్యక్షము చేసికొనిన జ్ఞానులకు నిత్యబ్రహ్మానందసుఖము కలుగును. అజ్ఞానులకు నిట్టిసుఖము గలుగదు.)

**శ్లో॥ నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానా-**
**మేకో బహూనాం యో విదధాతి కామాన్ ।**
**తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా-**
**స్తేషాం శాంతిశ్శాశ్వతీ నేతరేషామ్ ॥**

(సర్వజనులకును వారివారి కర్మఫలానుగుణముగ ఫలము నిచ్చుచు నశించువానిలో నశింపనివాఁడై బ్రహ్మాదిస్తంబపర్యంత ముండు జీవులకుఁ జేతనస్వరూపుఁడై యేపరమాత్మ యుండునో బుద్ధిగుహయందుండు నా పరమాత్మను మరలింపఁబడిన సర్వేంద్రియవృత్తులుగలవారై చూచు జ్ఞానులకు నిత్యమగు స్వాత్మానుభవము కలుగును. అజ్ఞానులకుఁ గలుగదు.)

**ఈక్షతి కర్మవ్యపదేశాత్సః -** బ్ర.సూ. 1-3-13.

(దర్శనార్థకమైన యీక్షతి క్రియకుఁ గర్మముగాఁ జెప్పఁబడుటవలన అనఁగా "స ఏతస్మాజ్జీవఘనాత్పరాత్పరం పురిశయం పురుషమీక్షతే" (ప్రశ్న 5-5) అను నెడఁ బురుషుఁడు కర్మవాచకముగ నుండుటంజేసి యిం దా పురుషవాచకమైనది ఓంకార మనియు నెఱుంగనగును.

ప్రశ్నోపనిషత్ - 5-వ ప్రశ్నము.

**ఓం అథ హైనం శైబ్యస్సత్యకామః పప్రచ్ఛ, స యో హ వై తద్భగవన్మనుష్యేషు ప్రాయణాన్తమోంకారమభిధ్యాయీత, కతమం వావ స తేన లోకం జయతీతి.**

(పూజ్యుఁడవగు నోపిప్పలాదా! మనుష్యులలో జీవితకాల మంతయు నెవఁడు పరాపర-ప్రాప్తిసాధనమగు ప్రసిద్ధమైన యోంకారమును ధ్యానించుచున్నాఁడో, అట్లు ధ్యానించుటచేత

జ్ఞానకర్మములచేతఁ బొందఁదగిన లోకములనేకములలో నేలోకమును వాఁడు పొందును? అని పిప్పలాదుని సత్యకాముఁ డడిగెను.)

**తస్మై స హోవాచ. ఏతద్వై సత్యకామ! పరం చాపరం చ బ్రహ్మ యదోంకార-స్తస్మాద్విద్వానేతేనైవాయతనేనైకతరమన్వేతి.**

(ఓసత్యకాముఁడా! ఏకారణమువలన పరాపరరూపమైన పరమాత్మ ప్రాణరూపమగు నీపరబ్రహ్మము ఓంకారమే యగుచున్నదో యాకారణమువల్లనే యిట్లు ఓంకారమును పరబ్రహ్మస్వరూపముగాఁ దెలిసికొనిన విద్వాంసుఁ డధికమగు నోంకారధ్యానముచేతనే వానియుపాసనానుసారమున పరాపరములను బొందుచున్నాఁడని పిప్పలాదుఁడు సత్యకామునకుఁ జెప్పెను.)

**స యద్యేకమాత్రమభిధ్యాయీత స తేనైవ సంవేదితస్తూర్ణమేవ జగత్యా-మభిసంపద్యతే, తమృచో మనుష్యలోకముపనయంతే, స తత్ర తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సంపన్నో మహిమానమనుభవతి.**

(ఓసత్యకాముఁడా! పూర్వము చెప్పిన యోంకారోపాసకుఁడు ఆ యోంకారముయొక్క మాత్రలు సంపూర్ణముగఁ దెలియనివాఁడైనను ఓంకారము నుపాసించుటచేతనే యోంకారముయొక్క అకారోకారమకారములనెడి మూఁడుమాత్రలలో మొదటిమాత్రయగు ఋగ్వేదరూపమైన అకారోపాసనమువలన జగత్తునందుఁ గర్మమును గోరినవాఁడై మనుష్యలోకమును బొంది అనశనరూపమగు తపముచేతను సంభోగములేని బ్రహ్మచర్యనియమముచేతను, దేవుఁ డున్నాఁ డనెడి యాస్తిక్యబుద్ధిచేతను, బ్రహ్మోపాసనారూపమైన సామర్థ్యమును బొందుచున్నాఁడని పిప్పలాదుఁడు చెప్పెను.)

**అథ యది ద్విమాత్రేణ మనసి సంపద్యతే సోఽన్తరిక్షం యజుర్భిరున్నీయతే, స సోమలోకం స సోమలోకే విభూతిమనుభూయ పునరావర్తతే.**

(ఓసత్యకాముఁడా! ఓంకారము నుపాసించువాఁ డాయోంకారముయొక్క రెండవ మాత్రయగు ఉకారము నెఱుంగనివాఁ డయ్యు యజురాత్మకమగు ఉకారముతోఁగూడిన ఓంకారము నుపాసనచేయుటచేత యజురాత్మకమైన మనసునందు బ్రహ్మధ్యానసంపదగలవాఁడై యంతరిక్షము నాశ్రయించియుండు సోమలోకమును ఆ యజుస్సులచేతనే పొంది యచ్చట నైశ్వర్యము ననుభవించి మరల మనుష్యలోకమునకు వచ్చునని పిప్పలాదుఁడు చెప్పెను.)

**యః పునరేతత్త్రిమాత్రేణైవోమిత్యేతేనైవాక్షరేణ పరం పురుషమభిధ్యాయీత స తేజసి సూర్యే సంపన్నః, యథా పాదోదరస్త్వచా వినిర్ముచ్యత ఏవం హవై స పాప్మనా వినిర్ముక్తః స**

**సామభిరున్నీయతే బ్రహ్మలోకం స ఏతస్మాజ్జీవఘనాత్పరాత్పరం పురిశయం పురుషమీక్షతే తదేతౌ శ్లోకౌ భవతః.**

(ఓసత్యకాముఁడా! ఏజనుఁ డీయోంకారమును అకారోకారమకారాత్మకమైన యోంకార మనెడియక్షరముచేతనే సూర్యమండలాంతర్గతుఁడైన పరమపురుషుఁడగు పరమాత్మనుగా ధ్యానించుచున్నాఁడో యట్టి యుపాసకుఁడు ఓంకారముయొక్క మూఁడవమాత్రయగు మకారస్వరూపమైన తేజోమండలమగు సూర్యునియందుఁ జేరి సూర్యసంపత్తి గలవాఁడై కుబుసము విడుచుటచేత సర్ప మెట్లు విడువఁబడునో యాలాగే పాపవిముక్తుఁడై పరిశుద్ధుఁ డగును. అట్టి పరిశుద్ధుఁడు ఓంకారముయొక్క మూఁడవమాత్రయగు మకారస్వరూపమగు సామములచేత బ్రహ్మలోకమును బొందును. అట్లు బ్రహ్మలోకమును బొందినవాఁడు సర్వజీవాత్మయై సర్వజీవాశ్రయుఁడగు హిరణ్యగర్భునివలన సర్వశరీరములయందును బ్రవేశించియున్న పరమ పురుషస్వరూప మగు పరమాత్మను జూచుచున్నాఁడు. ఈ ముందు చెప్పఁబోవు రెండు మంత్రములు ఓంకారోపాసనను బ్రకాశింపఁజేయుచున్నవి అని పిప్పలాదుఁ డోంకారమును స్తుతించుటకుఁ గాను పూర్వమంత్రములచేతఁ గలుగు లాభమును జెప్పి యీ మంత్రమందుఁ ద్రిమాత్రలతోఁ గూడిన యోంకారోపాసనచేతఁ గలుగువాస్తవస్థితిని చెప్పెను.)

**తిస్రో మాత్రా మృత్యుమత్యః ప్రయుక్తా అన్యోన్యసక్తా అనువిప్రయుక్తాః, క్రియాసు బాహ్యాభ్యంతరమధ్యమాసు సమ్యక్ప్రయుక్తాసు న కంపతే జ్ఞః.**

(ఓసత్యకాముఁడా! ఓంకారముయొక్క అకారము, ఉకారము, మకారము అనెడి మూఁడు మాత్రలు మరణముగలవి. అట్టి మాత్రలు మూఁడును బ్రహ్మదృష్టిచేత నొకటిగాఁ జేర్చి పరమపురుషధ్యానమందుఁ బ్రయోగింపఁబడెనేని మరణదోషము లేని దగును. ఇట్లు ఓంకారమాత్రాత్రయమును దెలిసికొనినయోగి అకారోకారమకారాత్మకములైన జాగ్రత్స్వప్నసుషుప్తి స్థానములందుఁ, బరమపురుషధ్యానక్రియలయందుఁ జలింపఁ డని పిప్పలాదుఁడు చెప్పెను.)

**ఋగ్భిరేతం యజుర్భిరంతరిక్షం స సామభిర్యత్తత్కవయో వేదయన్తే, తమోంకారేణైవాయతనేనాన్వేతి విద్వాన్యత్తచ్ఛాన్తమజరమమృతమభయం పరం చేతి.**

(విద్వాంసులు ఋగ్యజుస్సామములచేత మనుష్యాంతరిక్షబ్రహ్మలోకములు కలుగు చున్నవని తెలిసికొనుచున్నారు. ఆ ఋగ్యజుస్సామరూపములైన అకారోకారమకార స్వరూపమగు నోంకారమార్గముచేతనే యోంకారస్వరూపమును తెలిసికొని యుపాసించు విద్వాంసుఁడు పరబ్రహ్మలక్షణమైన త్రివిధరూపమగు లోకమును పొంది జరామరణములులేని జాగ్రదాదిసమస్త–విశేషములు లేనిదియు, భయరహితమును, ప్రసిద్ధమును, సత్యస్వరూపమునగు పరబ్రహ్మమును బొందును.)

ముండకోపనిషత్ - 2-2-3,4,10,11.

**శ్లో॥ ధనుర్గృహీత్వౌపనిషదం మహాస్త్రం**
**శరం హ్యుపాసా నిశితం సంధ యీత ।**
**ఆయమ్య తద్భావగతేన చేతసా**
**లక్ష్యం తదేవాక్షరం సోమ్య! విద్ధి ॥**

(బ్రహ్మవిచారమందు సమర్థుఁ డగువానికి ప్రణవము నవలంబించి బ్రహ్మాత్మైకత్వమందు చిత్తసమాధానము క్రమముక్తిఫల మని చూపించుటకు నుపక్రమింపఁబడుచున్నది. నీవు ఉపనిషత్ప్రసిద్ధమైన యోంకారమనెడి ధనుస్సును గ్రహించి యా వింటియం దుపాసన యను వాఁడిగల బాణము నెక్కు పెట్టి ఆ యెక్కు పెట్టిన బాణమును ఇంద్రియసముదాయముల విషయముల నుండి మరలించి లక్ష్యమునందే వంచి బ్రహ్మధ్యానమునే పొంది యుండుమనసుచే పూర్వోక్తమగు నక్షరస్వరూపమునే లక్ష్యమునుగాఁ దెలిసికొనుము.)

**శ్లో॥ ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే ।**
**అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥**

(పూర్వము చెప్పియున్న ధనురాదికములో ధనుస్సు ఓంకారమనియు, బాణ మంతః కరణమందుఁ బ్రతిబింబించియుండు జీవుఁ డనియు, లక్ష్యము నాశరహితమగు పరబ్రహ్మ మనియుఁ జెప్పఁబడుచున్నది. కనుక నిట్లు ఓంకారము ధనుస్సునందు ఎక్కుపెట్టఁబడినజీవుఁ డను బాణము లక్ష్యభూతమైన పరబ్రహ్మమందు ఏకాగ్రచిత్తముచేతఁ బొందింపఁ బడెనేని లోకమందలి బాణము లక్ష్యమందుఁ జేరి దానిరూప మెట్లగునో యారీతిగనే జీవుఁడు పర-బ్రహ్మమును జేరి యా పరబ్రహ్మమే యగును.)

**శ్లో॥ న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం**
**నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః ।**
**తమేవ భాంతమనుభాతి సర్వం**
**తస్య భాసా సర్వమిదం విభాతి ॥**

(సర్వమును బ్రకాశింపఁజేయు సూర్యుఁడును, చంద్రుఁడును, నక్షత్రములును, మెఱపులును, అగ్నియును, ఆ పరబ్రహ్మమును ప్రకాశింపఁజేయనేరవు. ప్రకాశించు పరమాత్మ ననుసరించియే సూర్యుఁడు మొదలగు సర్వము ప్రకాశించును. ఆ పరమాత్మ ప్రకాశముచేతనే దృశ్యమగు నీజగమంతయుఁ బ్రకాశించుచున్నది. ఆ పరమాత్మయే ప్రకాశరూపుఁ డగుటవలన నతనిని బ్రకాశింపఁజేయున దేదియు లేదు.)

**శ్లో॥ బ్రహ్మైవేదమమృతం పురస్తా-**
**ద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ ।**
**అధశ్చోర్ధ్వం చ ప్రసృతం బ్రహ్మైవేదం**
**విశ్వమిదం వరిష్ఠమ్ ॥**

(నాశరహితమగు నీపరబ్రహ్మమే ముందుభాగముననను, వెనుకభాగముననను, దక్షిణ భాగముననను, ఉత్తరభాగముననను, ఊర్ధ్వభాగముననను, అధోభాగముననను, అంతటను వ్యాపించి యున్నది. ఇతరమగు కార్యరూపమైన నామరూపములతో వ్యాపించియున్న యీ సమస్తజగత్తును శ్రేష్ఠ మగు పరబ్రహ్మమే.)

సంపూర్ణబ్రహ్మోపదేశమును ప్రతిపాదించు **మాండూక్యోపనిషత్తు.**

**ఓమిత్యేతదక్షరమిదం సర్వం తస్యోపవ్యాఖ్యానం భూతం భవద్భవిష్యదితి సర్వ-మోంకార ఏవ, యచ్చాన్యత్త్రికాలాతీతం తదప్యోంకార ఏవ.**

(ఓంకారముయొక్క నిర్ణయమందు నాత్మను బొందుట కుపాయము పొంద బడుచున్న దని యీ యుపనిషత్తునం దోంకారనిర్ణయము నుడువఁబడుచున్నది. ఈ యోంకారమే నాశరహితమగు పరబ్రహ్మస్వరూపము. వాక్కుచేతఁ జెప్పఁబడిన యీసమస్తము నాయోంకారమును విస్పష్టముగఁ జెప్పుచున్నది. భూత భవిష్య ద్వర్తమానకాలత్రయపరిచ్ఛేద్యమగు సమస్తము నోంకారమే. కాలత్రయమున కతీతమై కాలపరిచ్ఛేద్యము కానట్టి యవ్యాకృతాదికము సర్వము నా యోంకారమే.)

**సర్వగ్ హ్యేతద్బ్రహ్మాఽయమాత్మా బ్రహ్మ సోఽయమాత్మా చతుష్పాత్.**

(పూర్వమంత్రమం దభిధానాభిధేయములగు నోంకారపరబ్రహ్మము లకు, (ఓమిత్యేతదక్షర మను వాక్యమువల్ల) అభిధానప్రాధాన్యముచేత నేకత్వము నిర్దేశింపఁబడినది. ఇట్లు అభిధానాభిధేయము లేకత్వమును బొందుట ముఖ్యప్రయోజనము. అభిధానాభిధేయములు రెండును ఏకప్రయత్నముచేతనే యొకసారిగా భేదమును వదలి విలక్షణమగు నాపరబ్రహ్మమును బొందవలయు నని చెప్పుచున్నది. ఏసమస్తము నోంకారమాత్రమే యని చెప్పఁబడినదో యా సర్వమును పరబ్రహ్మస్వరూపమే. ఇట్లు పరోక్షముగాఁ జెప్పఁబడిన యా పరబ్రహ్మమునే నాల్గవపాదముగా విభజింపఁబడిన యపరోక్షమగు జీవాత్మ యని యభిధానముచే నిర్దేశించి చెప్పఁబడినది. ఇట్లు పరాపరసర్వరూపమై యుండు నోంకారాభిధేయమగు పరమాత్మ నాల్గు పాదములు గలదిగా నున్నది.)

**జాగరితస్థానో బహిఃప్రజ్ఞస్సప్తాంగ ఏకోనవింశతిముఖః స్థూలభుగ్వైశ్వానరః ప్రథమః పాదః.**

(పూర్వము చెప్పిన పరాపరస్వరూపమైన యాత్మకు నాలుగు పాదములు వివరింపఁ బడినవి. జాగ్రత్తయే స్థానముగాఁ గలిగినట్టియు వెలుపల నుండు చక్షురాదీంద్రియములం దవిద్యాకృతమైన జ్ఞానము కలిగినట్టియు ద్యులోకమును, సూర్యుఁడును, వాయువును, ఆకాశమును, అన్నమును, భూమియును, ఆహవనీయాగ్నియు నను నీయేడును గ్రమముగ శిరసును,చక్షువులును, ప్రాణమును, మధ్యభాగమును, పొత్తికడుపును, పాదములును, ముఖమునుగఁ గలిగినట్టియు; త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లయిదును, మనోబుద్ధిచిత్తాఽహంకారములు నాలుగును, చేరి పందొమ్మిది ముఖములు గలిగినట్టియు; సమస్తజీవులనేకవిధముగాఁ బొందించుటచేత వైశ్వానరుఁ డనుపేరు గల యాత్మ పూర్వము చెప్పిన యాత్మయొక్క నాలుగుపాదములలోఁ బ్రథమ పాదముగాఁ జెప్పఁబడుచున్నది.)

**స్వప్నస్థానోఽన్తఃప్రజ్ఞస్సప్తాంగ ఏకోనవింశతిముఖః ప్రవివిక్తభుక్ తైజసో ద్వితీయః పాదః.**

(స్వప్నావస్థయం దుండువాఁడును, మనసుయొక్క వాసనారూప మగు ప్రజ్ఞగల– వాఁడును, పూర్వమంత్రోక్తములగు సప్తాంగములు గలవాఁడును. పందొమ్మిది ముఖములు గలవాఁ డును, వాసనామాత్రముచేత ప్రవివిక్తములగు స్వప్నవిషయముల ననుభవించువాఁడును, తేజోరూపుండునగు తైజసుఁడను నాత్మ పూర్వోక్తములగు నాల్గుపాదములలో రెండవపాదము.)

**యత్ర సుప్తో న కంచన కామం కామయతే న కంచన స్వప్నం పశ్యతి తత్సుషుప్తమ్. సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానందమయో హ్యానందభుక్చేతోముఖః ప్రాజ్ఞస్తృతీయః పాదః.**

(ఆత్మ యే స్థానమునందు నిద్రించి యే కోరికయుఁ గోరక యే స్వప్నమును గనక యుండునో యదే సుషుప్తిస్థాన మనఁబడును. అట్టి సుషుప్తిస్థానము గలవాఁడును, జాగ్రత్స్వప్న స్థానము గలవాఁడును, జాగ్రత్స్వప్నస్థానములయందుఁ బ్రజ్ఞ లేకీభవించుటంజేసి ప్రజ్ఞాన– ఘనుఁడు (దట్టమగుప్రజ్ఞ గలలవాఁడు) ను, ఆనందస్వరూపుఁడును, ఆనందమునే యనుభవించు– వాఁడును, స్వప్నజాగరములను బొందుటకుఁ జైతన్యమే ద్వారముగాఁగలవాఁడును, విశేషముగ సర్వము నెఱుంగు కేవలప్రజ్ఞానస్వరూపుఁడు నగు ప్రాజ్ఞుఁడను నాత్మ పూర్వోక్త మగు నాత్మయొక్క నాలుగుపాదములలో మూఁడవపాదము.)

**ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽన్తర్యామ్యేష యోనిస్సర్వస్య ప్రభవాప్యయౌ హి భూతానామ్.**

(పూర్వము చెప్పినయాత్మపాదములలో మూఁడవపాద మగు ప్రాజ్ఞుఁడు ఆధిదైవికముతోఁ గూడిన సమస్తభేదజాతమునకును నియామకుఁడు గనుక సర్వేశ్వరుఁడును, ఈ ప్రాజ్ఞుఁడే సర్వభేదావస్థలు గలిగి సర్వమును దెలిసికొనువాఁడు గనుక సర్వజ్ఞుఁడును, ఈ ప్రాజ్ఞుఁడే సకల భూతములయొక్కయు నంతఃకరణమునందుఁ బ్రవేశించి నియమించువాఁడు గనుక నంతర్యామి యును, ఈప్రాజ్ఞునివలనఁ బూర్వము చెప్పియున్న స్వప్నజాగరములందు ఆధ్యాత్మికాదిభేద సహితమైన జగత్తు కలుగుచున్నది. ఇట్లు కలిగినసర్వభూతములయొక్క యుత్పత్తిప్రళయములును ఈ ప్రాజ్ఞుఁడే యగుటవలన నీప్రాజ్ఞుఁడే సర్వకారణ మగును.)

**సోఽయమాత్మాఽధ్యక్షరమోంకారోఽధిమాత్రం పాదామాత్రా మాత్రాశ్చ పాదా అకార ఉకారో మకార ఇతి.**

(పరమార్థజ్ఞానమందు సమర్థులగు మధ్యమోత్తమాధికారులకు అధ్యారోపాపవాదముల చేతఁ బరమార్థతత్త్వముపదేశింపఁబడినది. ఇప్పుడు తత్త్వమును దెలిసికొనలేని యధముల కధ్యాత్మధ్యానమును దెలుపుటకు ఆరోపదృష్టినే యవలంబించి చెప్పఁబడినది. పూర్వము నాలుగుపాదములుగాఁ జెప్పఁబడిన పరమాత్మ యోంకార మను నక్షరమును బొందియున్నది. ఆ యోంకార మను నక్షరము అకారోకారమకారము లనెడి మాత్రలను బొందియున్నది. కనుక ఆ పరమాత్మయొక్క నాలుగుపాదములను నాలుగుభాగములుగా విభజింపఁబడిన యోంకారము యొక్క అకారాదిమాత్రలుగాను, ఈ యకారాదిమాత్రలాత్మపాదములుగా నెఱుంగనగును.)

**జాగరితస్థానో వైశ్వానరోఽకారః ప్రథమా మాత్రా ఆప్తేరాదిమత్వాద్వాఽఽప్నోతి హ వై సర్వాన్కామానాదిశ్చ భవతి య ఏవం వేద.**

(జాగ్రదవస్థయం దుండి స్థూలశరీరాభిమాని యగు నాత్మయొక్క ప్రథమపాదమైన వైశ్వానరుఁ డోంకారమందలి మొదటిమాత్రయగు అకారము సర్వవాక్కులందును వ్యాపించి యన్నిటికిని మొదటి దైనట్టు సర్వము నందును వ్యాప్తమై సర్వమునకును మొదటివాఁ డగుటవలన నాయకారమాత్రగానే యున్నాఁడు. ఇట్లే యోంకారప్రథమమాత్రయగు అకారమును, వైశ్వానరునిని ఒకటిగనే తెలిసికొనువాఁడు సమస్తకామములను బొంది మహాత్ములలో మొదటివాఁ డగును.)

**స్వప్నస్థాన స్తైజస ఉకారో ద్వితీయా మాత్రోత్కర్షాదుభయత్వాద్వోత్కర్షతి హ వై జ్ఞానసంతతిం సమానశ్చ భవతి నాస్యాబ్రహ్మవిత్కులే భవతి య ఏవం వేద.**

(స్వప్నస్థానమునం దుండి సూక్ష్మశరీరాభిమానియును, ఆత్మద్వితీయ పాదమునైన తైజసుఁడు ఓంకారమందలి రెండవమాత్ర యగు ఉకారము, ఆ యోంకారమాత్ర లగు అకారాదుల యొక్క మధ్యయం దుండి ప్రథమ మాత్ర యగు అకారముకంటె నధికమైనదై యా అకారమకారాత్మక

మగుచుఁ బ్రసిద్ధమగు జ్ఞానసంతతిని వృద్ధిఁ బొందించునట్టి తైజసుఁడు ఈస్థూలశరీరాభిమాని యగు విశ్వునకును, కారణశరీరాభిమాని యగు ప్రాజ్ఞునకును, మధ్యనుండి విశ్వునికంటె నుత్కృష్టుఁడును, విశ్వప్రాజ్ఞస్వరూపుఁడునై జ్ఞాన సంతతిని వృద్ధిఁ బొందించుటవలన నా ఉకారముగానే యున్నాఁడు. ఇట్లు ఓంకారమందలి ద్వితీయమాత్రయగు ఉకారమునును, సూక్ష్మశరీరాభిమానియగు తైజసునిని ఒకటిగాఁ దెలిసికొనువాని వంశమునందు బ్రహ్మవేత్త కాని వాఁడు జన్మింపఁడు. ఇట్లు తెలిసికొనుట కిదియే ఫలము.)

**సుషుప్తస్థానః ప్రాజ్ఞో మకారస్తృతీయా మాత్రా మితేరపీతేర్వా మినోతి హవా ఇదం సర్వమపీతిశ్చ భవతి య ఏవం వేద.**

(సుషుప్త్యవస్థయం దుండి కారణశరీరాభిమాని యగునాత్మ తృతీయపాదమైన ప్రాజ్ఞుఁడు ఓంకారమందలి మూఁడవమాత్ర యగు మకారము. ఆ యోంకారమందలి ప్రథమద్వితీయ మాత్రలగు అకార ఉకారములు యవాది ధాన్యములు కొలతపాత్రయందువలెనే యోంకారోచ్చారణ మందు మకారమందుఁ బ్రవేశించి యేకీభావమును బొంది మరల బయలువెడలుటచేత భిన్నమైనట్టు స్థూలసూక్ష్మశరీరాభిమానులగు విశ్వతైజసులు ప్రాజ్ఞునియందుఁ బ్రవేశించి యేకత్వమును బొంది బయలువెడలుటచేత భిన్నత్వము నొందుటవలన ఓంకారమందలి తృతీయ మాత్రయగు మకారమును, ఆత్మతృతీయపాదమగు ప్రాజ్ఞునిని నొకటిగాఁ దెలిసికొనినవాఁడు ఈ సమస్తజగత్పరిమితిని తెలిసికొని జగత్కారణాత్మ యగుచున్నాఁడు.)

ఈక్రింది గ్రంథములు చూడుఁడు.

(1) భగవద్గీత 17 అ 23-24శ్లో. (2) పంచీకరణవార్తికము, 1-13-31-42-44-46-47-48-52 (3) ధ్యానబిందూపనిషత్ - 1,2,3,16,17,18,19,22,23,54 మొ - 58 వఱకు, 67,68,100మొ - 104 వఱకు. మంత్రములు. (4) ఉత్తర గీత - 4 అ 3,4,9,10,13,15,16 మొ 23 శ్లో. వఱకు; 1-వ అ.36 శ్లో; 2 అ. 54శ్లో (5) గౌడపాదకారిక ఆగమప్రకరణం - 17-18 కడపటి మూఁడు మం. వేదాంతపంచదశి - చతుర్థప్రకరణము - ద్వైతవివేకము.

**శ్లో॥ బుద్ధతత్త్వేన ధీదోషశూన్యేనైకాంతవాసినా ।**
**దీర్ఘం ప్రణవముచ్చార్య మనోరాజ్యం విజీయతే ॥**

(తత్త్వము నెఱింగినవాఁడు కాఁబట్టియే ధీదోషములగు కామక్రోధాదులులేనివాఁడును, విజనప్రదేశమున వసింపఁగోరువాఁడునై దీర్ఘమగు ప్రణవము నుచ్చరింప నంతఃకరణవిజయము కలుగును.)

**శ్లో॥ జితే తస్మిన్వృత్తిశూన్యే మనస్తిష్ఠతి మూకవత్ ।**
**ఏతత్పదం వసిష్ఠేన రామాయ బహుధేరితమ్ ॥**

(ఎవ్వాఁడు మనంబు (నంతరింద్రియము)ను జయించునో వానిమనంబునం దేవృత్తులు నుండవు. వృత్తిశూన్యమైన మనస్సు మూఁగవానియట్లు వ్యవహారరహితమై యుండును. ఈ స్థితిని వసిష్ఠమహాముని శ్రీరామచంద్రునకు బహుప్రకారములుగఁ జెప్పియుండెను.)

తృప్తిదీపము :-

**శ్లో॥ తత్త్వమస్యాదివాక్యేషు లక్షణా భాగలక్షణా ।**
**సోఽయమిత్యాదివాక్యస్థపదయోరివ నాపరా ॥**

(సోఽయం దేవదత్తః = ఆ కాలమం దక్కడఁ జూడఁబడిన దేవదత్తుఁడే వీఁ డనెడి యర్థముగల వాక్యములయందు విరుద్ధభాగములను పరిత్యజింపఁజేసెడి రూపముగల **జహదజహల్లక్షణ** యెట్లాశ్రయింపఁబడునో యట్లే తత్త్వమస్యాది మహావాక్యములందును జహదజహల్లక్షణ యాశ్రయింపఁబడునే కాని (1) జహల్లక్షణయును, (2) అజహల్లక్షణయును ఆశ్రయింపఁబడవు. లక్షణావృత్తి 1. జహల్లక్షణ (=విడిచినలక్షణ) 2. అజహల్లక్షణ (= విడువని లక్షణ) 3. జహదజహల్లక్షణ (= విడిచియు విడువని లక్షణ) అని త్రివిధము. అందు జహల్లక్షణ (విడిచినలక్షణ) యెట్టి దనిన:-

గంగాయాం ఘోషః (= గంగయందు గొల్లపల్లె యున్నది) అనెడి వాక్యమునం దుండు గంగ యను పదమునకు ప్రవాహ మని యర్థమగును. కనుక ఈయర్థము విరుద్ధమగుటచేత నీయర్థమును బొత్తిగా విడిచి గంగయొద్దునందు గొల్లపల్లె యున్న దనునర్థమును గ్రహించుటయే **జహల్లక్షణ** యనఁబడును. ఇట్లు తత్త్వమసి యను మహావాక్యమందుఁగల త్వం (=నీవు) అనెడి పదార్థమైన కూటస్థస్వరూపమును బొత్తిగా విడిచిన యెడల ముముక్షువులయొక్క స్వరూపమే లేకపోవును. కనుక జహల్లక్షణ మహావాక్యార్థమందు గ్రహింపఁదగదు. 2. అజహల్లక్షణ (=విడువని లక్షణ) - మంచాః క్రోశంతి (=మంచములు కూయుచున్నవి) అను వాక్యార్థము ప్రత్యక్షవిరుద్ధ మగుటచేత, మంచాః (=మంచములు) అనుపదమును విడువకయే మంచములయం దుండు పురుషులు కూయుచున్నా రనెడియర్థమును గ్రహించుటయే **యజహల్లక్షణ** అనఁబడును. ఇది విడువని రూపము గలదగుట చేత మహావాక్యార్థమందు యుక్తము కానేరదు.

3. జహదజహల్లక్షణ (=విడిచియు విడువనిలక్షణ) :- సోఽయం దేవదత్తః అనువాక్యమునకు ఆ కాలమందు గంగాతీరమందుఁ జూడఁబడిన దేవదత్తుఁడే వీఁడు అని యర్థ మగును. కనుక ఈయర్థమందు విరుద్ధము లగు (ఆ దేశము, ఈ దేశమును), (ఆ

కాలము, ఈ కాలమును) (ఆ వయస్సు, ఈ వయస్సును), మొదలుగాఁగల విరుద్ధాంశముల నన్నిటిని విడిచి కేవల లక్ష్యభూతుఁడైన దేవదత్తుఁడే వాక్యార్థ మని గ్రహించినట్లు "తత్త్వమసి" అను మహావాక్యమునందును తత్త్వంపదార్థము లయిన బ్రహ్మమునకును కూటస్థునకును ఉపాధులగు మాయాఽవిద్యలను, వానికార్యములగు సర్వజ్ఞత్వ కించిద్జ్ఞత్వాది సకలధర్మములను విడిచి కేవలచైతన్యమాత్రమునకు నైక్యమును గ్రహించుటయే **జహదజహల్లక్షణ** యని చెప్పఁబడును. ఇదియే లక్ష్యార్థ మగును. ఈలాగుననే "**ప్రజ్ఞానం బ్రహ్మ**" "**అహం బ్రహ్మాఽస్మి**" "**అయమాత్మా బ్రహ్మ**" అను మహావాక్యములకును లక్షణావృత్తిచేత లక్ష్యార్థమును గ్రహించునది.)

శుకరహస్యోపనిషత్.

**అథ మహావాక్యాని చత్వారి. యథా, ఓం ప్రజ్ఞానం బ్రహ్మ, ఓం అహం బ్రహ్మాఽస్మి, ఓం తత్త్వమసి, ఓం అయమాత్మా బ్రహ్మ.**

| **వేదములు** | **ఉపనిషత్తులు** | **మహావాక్యములు** | **ఉపదేశనిష్ఠాఫల వివరములు** |
|---|---|---|---|
| ఋగ్వేదము | (ఎ) ఐతరేయము-(3 అ. 3వ మంత్రము) | ఓం ప్రజ్ఞానం బ్రహ్మ | లక్షణఫలవాక్యము |
| యజుర్వేదము | (బి) బృహదారణ్యకము (1.ప్ర.4 ఖం.10వ మంత్రము) | ఓం అహం బ్రహ్మాఽస్మి | మనన వాక్యము |
| సామవేదము | (సి) ఛాందోగ్యము. (6అ. 8 ఖండము.7వ మంత్రము) | ఓం తత్త్వమసి | గురూపదేశ వాక్యము |
| అథర్వవేదము | (డి) మాండూక్యము (2వ మంత్రము) | ఓం అయమాత్మా బ్రహ్మ | అనుభూతి వాక్యము |

(ఎ) సర్వం తత్ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం ప్రజ్ఞానేత్రో లోకః ప్రజ్ఞా ప్రతిష్ఠా **ప్రజ్ఞానం బ్రహ్మ.**

(బి) య ఏవం **వేదాఽహం బ్రహ్మాఽస్మీ**తి స ఇదగ్ సర్వం భవతి.

(సి) ఐతదాత్మ్యమిదగ్ సర్వం తత్సత్యగ్ స ఆత్మా **తత్త్వమసి** శ్వేతకేతో ఇతి.

(డి) సర్వం హ్యేతద్బ్రహ్మాఽ**యమాత్మా బ్రహ్మ** సోఽయమాత్మా చతుష్పాత్.

(మహావాక్యములు నాలుగు. అవి యేవి యనఁగా:-

(1. ఋగ్వేదము. ఐతరేయోపనిషత్తు - **ఓం ప్రజ్ఞానం బ్రహ్మ.**

2. యజుర్వేదము. బృహదారణ్యకోపనిషత్తు - **ఓం అహం బ్రహ్మాఽస్మి.**

3. సామవేదము. ఛాందోగ్యోపనిషత్తు - **ఓం తత్త్వమసి.**

4. అధర్వవేదము. మాండూక్యోపనిషత్తు - **ఓం అయమాత్మా బ్రహ్మ.**)

అవతారిక :- ఋగ్వేదమునందు ఐతరేయారణ్యకశ్రుతియందుఁ గల "**ప్రజ్ఞానం బ్రహ్మ**" అను మహావాక్యమునం దుండు ప్రజ్ఞానశబ్దమున కర్థము నిరూపింపఁబడుచున్నది.

**శ్లో॥ యేనేక్షతే శ్రుణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ ।**
**స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞానముదీరితమ్ ॥**

(నేత్రేంద్రియముద్వారా బాహ్యమునకు వ్యాపించిన యంతఃకరణవృత్తితోఁ గూడినట్టి యే చైతన్యముచేతఁ బురుషుఁడు చూచుటకు యోగ్యమైన రూపాదికమును జూచుచున్నాఁడో, మఱియు శ్రోత్రేంద్రియము ద్వారా బాహ్యప్రదేశమునకు వ్యాపించినట్టి యంతఃకరణవృత్తితోఁ గూడిన యే చైతన్యముచేతఁ బురుషుఁడు వినుటకు యోగ్యమైన శబ్దసమూహమును విను-చున్నాఁడో, మఱియు ఘ్రాణేంద్రియముద్వారా బాహ్యప్రదేశమునకు వ్యాపించినట్టి యంతః కరణవృత్త్యుపాధితోఁ యే చైతన్యముచేత గంధసమూహమును బురుషుఁ డాఘ్రాణించు చున్నాఁడో మఱియు వాగింద్రియముద్వారా బాహ్యప్రదేశమునకు వ్యాపించినట్టి యంతః కరణవృత్త్యుపాధితోఁ గూడిన యే చైతన్యముచేత బురుషుఁడు సకలశబ్దముల నుచ్చరించుచు వ్యవహరించుచున్నాఁడో, మఱియు జిహ్వేంద్రియముద్వారా బాహ్యప్రదేశమునకు వ్యాపించిన యంతఃకరణవృత్తితోఁ గూడినట్టి యే చైతన్యముచేతఁ బురుషుఁడు షడ్రసముల నెఱుంగు-చున్నాఁడో, మఱియు నట్లే సకలేంద్రియములతోడ నంతఃకరణవృత్తి చేరుచుండఁగా నట్టి వృత్తిభేదములతోఁ గూడిన యేచైతన్యముచేత సకలేంద్రియముల నెఱుంగుచున్నాఁడో, యట్టి చైతన్యమే "**ప్రజ్ఞానం బ్రహ్మ**" అనెడి మహావాక్యమునందుఁ గల ప్రజ్ఞానశబ్దముచేతఁ జెప్పఁ బడుచున్నది.)

అవ. ఇట్లు ప్రజ్ఞానశబ్దార్థమును దెలిపి బ్రహ్మశబ్దార్థము తెలుపఁబడుచున్నది.

**శ్లో॥ చతుర్ముఖేంద్రదేవేషు మనుష్యాశ్వగవాదిషు ।**
**చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మ మయ్యపి ॥**

(ఉత్తరము లగు దేవాదిశరీరములను ధరించిన వారియందును, మధ్యమములగు మనుజదేహములను ధరించినవారియందును, అధమములగు గోవు మున్నగు ప్రాణులయందును,

ఆకాశాది భూతములయందును, జగజ్జన్మాది హేతుభూత మగు నే యద్వితీయచైతన్యముగలదో ఆ చైతన్యము బ్రహ్మమగును.)

**ప్రజ్ఞానం బ్రహ్మ** : ఏకారణమువలన నంతట నుండు ప్రజ్ఞానము బ్రహ్మ మగునో యా కారణమువలన నాదేహమం దుండు ప్రజ్ఞానంబును బ్రహ్మమే యగు నని నిశ్చయించుట యీ వాక్యార్థమగును. అనఁగా నంతట నుండి ప్రజ్ఞానమున కేలక్షణము గలదో యా లక్షణము నా దేహందుండు ప్రజ్ఞానమున కుండుటచేత నా ప్రజ్ఞానమే బ్రహ్మ మగును.)

అవ. యజుర్వేదములోని బృహదారణ్యకోపనిషత్తునందుఁ గల "**అహం బ్రహ్మాఽస్మి**' యను మహావాక్యమందుఁ గల యహంశబ్దార్థము నిరూపింపఁబడుచున్నది.

**శ్లో॥ పరిపూర్ణః పరాత్మాఽస్మిన్ దేహే విద్యాధికారిణి ।**
**బుద్ధేస్సాక్షితయా స్థిత్వా స్ఫురన్నహమితీర్యతే ॥**

(స్వాభావికముగా దేశకాలవస్తువులచేత పరిచ్ఛిన్నత్వము లేని పరమాత్మ, మాయాకల్పిత మగు నీజగంబునందు శమాదిసాధనసంపన్నత్వముచేత జ్ఞానసంపాదనమునకు యోగ్యమైనట్టియు, వేదాంతశ్రవణాద్యనుష్ఠానవంతము నగు మనుష్యాది శరీరమునందు బుద్ధికి సాక్షిత్వముచేత నిర్వికారముగఁ, బ్రకాశించుచుండి లక్షణావృత్తివల్ల అహ మను పదముచేతఁ జెప్పఁబడు చున్నది. (ఈ లక్షణావృత్తి స్వరూపము పూర్వమే చెప్పఁబడెను.)

అవతారిక :- బ్రహ్మశబ్దార్థము నిరూపింపఁబడుచున్నది.

**శ్లో॥ స్వతఃపూర్ణః పరాత్మాఽత్ర బ్రహ్మశబ్దేన వర్ణితః ।**
**అస్మీత్యైక్యపరామర్శస్తేన బ్రహ్మ భవామ్యహమ్ ॥**

(స్వాభావికముగా దేశకాలవస్తువులచేత పరిచ్ఛిన్నత్వములేని పరమాత్మ "అహం బ్రహ్మాస్మి" అను మహావాక్యమందు 'బ్రహ్మ' మనుపదము చేత లక్షణావృత్తివల్లఁ జెప్పఁబడు చున్నది. ఈ మహావాక్యమునందుఁ గల '(అస్మి = అయితిని)' అను పదముచేత, "అహం" "బ్రహ్మ" అను రెండు పదములకును సామానాధికరణ్యముచే లభింపఁదగిన జీవబ్రహ్మైక్యమును ప్రతిపాదించు చున్నది. అందుచేత నేను బ్రహ్మమగుచున్నా నని యర్థము.)

అవ :- సామవేదమునందలి ఛాందోగ్యోపనిషత్తునందుఁ గల "**తత్త్వమసి**" అను మహావాక్యమునర్థమును బ్రకాశింపఁ జేయుటకొఱకు అందలి తత్పదలక్ష్యార్థము నిరూపింపఁ బడుచున్నది.

**శ్లో॥ ఏకమేవాద్వితీయం సన్నామరూపవివర్జితమ్ ।**
**సృష్టేః పురాధునాప్యస్య తాదృక్త్వం తదితీర్యతే ॥**

("సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అనుశ్రుతి చేత సృష్టికిc బూర్వము సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేని నామరూపరహిత మగు నే సద్వస్తువు ప్రతిపాదింపc బడియుండెనో, యాసద్వస్తువునకు సృష్ట్యుత్తరకాలమునందు విచారదృష్టిచే నట్టిస్వభావము '**తత్**' పదముచేత లక్షణావృత్తివల్ల బోధింపcబడుచున్నది.)

అవ :- త్వంపదలక్ష్యార్థము నిరూపింపcబడుచున్నది.

**శ్లో॥ శ్రోతుర్దేహేంద్రియాతీతం వస్త్వత్ర త్వంపదేరితమ్ ।**
**ఏకతా గ్రాహ్యతేఽసీతి తదైక్యమనుభూయతామ్ ॥**

(వేదాంతశ్రవణ మననాద్యనుష్ఠానముచేత మహావాక్యార్థజ్ఞానవంతుcడగు ముముక్షువు యొక్క స్థూల సూక్ష్మ కారణశరీరములకు సాక్షిత్వముచేత విలక్షణముగా వర్తించుచుండు సద్వస్తువే యీ మహావాక్యమందుcగల త్వంపదముచేత లక్షణావృత్తివల్లc జెప్పcబడుచున్నది. ఈ మహావాక్య మందలి యసిపదముచేతి "తత్ త్వం" అను రెండుపదములకును గల సామానాధి కరణ్యమువల్లc బొందcబడు పదార్థద్వయైక్యము శిష్యునిగుఱించి బోధింపcబడుచున్నది. కనుక ఆ తత్త్వంపదార్థము లకు జీవబ్రహ్మైక్యమును ముముక్షువు లనుభవింపవలయును.)

అవ :- అథర్వవేదమందలి "**అయమాత్మా బ్రహ్మ**" అను మహావాక్యమునందలి "**అయమాత్మా**" అను రెండుపదములకును నిర్ణయింపcబడిన యర్థము క్రమముగాc జెప్పc బడుచున్నది.

**శ్లో॥ స్వప్రకాశాపరోక్షత్వమయమిత్యుక్తితో మతమ్ ।**
**అహంకారాదిదేహాంతాత్ప్రత్యగాత్మేతి గీయతే ॥**

(అయం = (ఈ) అనుపదముచేత నాత్మకు స్వప్రకాశత్వమును నపరోక్షత్వమును గలిగియున్నదను నర్థము సమ్మత మగును. అదృష్టము లగు పుణ్యాదులవలె నాత్మకు నిత్యపరోక్షత్వము లేదని తెలుపుటకును ఘటాది జడపదార్థములకువలె నాత్మకు దృశ్యత్వము లేదని తెలుపుటకును ఈ శ్లోకమందు స్వప్రకాశాపరోక్షత్వమను విశేషణద్వయము చెప్పcబడినది. అహంకార ప్రాణేంద్రియ మనోదేహ సంఘాతరూప ప్రపంచము లోపల నాధారత్వసాక్షిత్వములచేత వర్తించుటవల్ల ప్రత్యగాత్మ యని చెప్పcబడును.)

అవ :- బ్రహ్మశబ్దార్థము నిరూపింపcబడుచున్నది.

**శ్లో॥ దృశ్యమానస్య సర్వస్య జగతస్తత్త్వమీర్యతే ।**
**బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకమ్ ॥**

(దృశ్యత్వముచేత మిథ్యారూపమగు నాకాశాది సర్వజగత్తునకు నాధారముగాను, ఆజగద్బాధ కవధిత్వముగాను, పారమార్థికమగు సచ్చిదానంద లక్షణముగల యే రూపము గలదో యా రూపము "**అయమాత్మా బ్రహ్మ**" యను మహావాక్యమునందలి బ్రహ్మశబ్దముచేతఁ జెప్పఁ బడుచున్నది. మీఁదఁ జెప్పఁబడినలక్షణములు గల బ్రహ్మము స్వప్రకాశమానుఁ డగు ప్రత్యగాత్మస్వరూపము గలది యగును. అనఁగాఁ బ్రత్యగాత్మయే బ్రహ్మమని యర్థము.)

**శ్లో॥ అనాత్మదృష్టేరవివేకనిద్రా-**
**మహం మమ స్వప్నగతిం గతోఽహమ్ ।**
**స్వరూపసూర్యేఽభ్యుదితే స్ఫుటోక్తే-**
**ర్గురోర్మహావాక్యపదైః ప్రబుద్ధః ॥**

(ఓగురూత్తమా! నాబ్రహ్మజ్ఞానాభావమువలన సంభూతమగు నవివేకమను నిద్ర నే నొందితి. ఆ యవివేకనిద్రయందు నేను, నాది యను స్వప్నావస్థలను జెందితిని. (నేను నాది యను స్వప్నములఁ గంటిని.) ఇప్పుడు మహావాక్యార్థ ముపదేశింపఁబడిన నేను బ్రహ్మస్వరూప మను సూర్యుఁ డుదయించుటంజేసి మేలుకొంటి నని తాత్పర్యము.)

**శ్లో॥ కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః ।**
**కార్యకారణతాం హిత్వా పూర్ణబోధోఽవశిష్యతే ॥**

(జీవుఁడు కార్యోపాధిగలవాఁడు. అనఁగా నజ్ఞానమే యుపాధిగాఁ గలవాఁడు. ఈశ్వరుఁడు కారణమే యుపాధిగాఁగలవాఁడు. అనఁగా మాయయే యుపాధిగాఁగలవాఁడు. ఉపాధు లయిన కార్యకారణములను దొలఁగించినచో శేషించునదియే **పూర్ణబోధము**.)

**శ్లో॥ శ్రవణం తు గురోః పూర్వం మననం తదనంతరమ్ ।**
**నిదిధ్యాసనమిత్యేతత్పూర్ణబోధస్య కారణమ్ ॥**

(పైనుడివియున్న పూర్ణబోధ ముదయించుటకుఁ బూర్వము సద్గురువువలన మహావాక్యార్థమును వినవలయును. అట్లు విన్న మహావాక్యార్థమును జక్కఁగ మననముఁ జేయవలయును. అట్లు మనన మొనర్చినవాక్యార్థమునే మాటిమాటికిని దలంపవలెను. ఈ విధముగ నొనరించినఁ బూర్ణబోధ మొనరించును. ఇదియే పూర్ణబోధమునకుఁ గారణము.)

**ఋగ్వేదమహావాక్యము** :- బ్రహ్మవిదాశీర్వాదపద్ధతి - 41-42 వాక్యములు.

**"సర్వాణ్యేతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవంతీతి వాక్యేన దేహేంద్రియాది**

**సాక్షిరూపం యత్ప్రజ్ఞానం త్వం పదార్థరూపం నిర్ణీతం తదేవైష బ్రహ్మేత్యాదివాక్యేన జగత్కారణతయా నిర్ణీతం పరంబ్రహ్మ న చానయోరీషదపి భేదోఽస్తీత్యైతరేయమహా-వాక్యజన్యజ్ఞానసిద్ధిర్నిరంతరం భూయాత్."**

(ఇవి యన్నియుఁ బ్రజ్ఞానమునకు నామధేయము లగుచున్న వనెడి వాక్యముచేత దేహేంద్రియాదిసాక్షిస్వరూపమైనదియు, త్వంపదార్థ స్వరూపము నగు నే ప్రజ్ఞానము నిర్ణయింపఁ బడినదో, యదియే "ఏష బ్రహ్మ" (ఇది బ్రహ్మము) అను నీ మొదలగు వాక్యములచే జగత్కారణముగా నిర్ణయింపబడిన పరబ్రహ్మ మగును. ఈ రెంటికిని లేశమైనను భేదము లే దనెడి యైతరేయోపనిషత్తునందుఁ జెప్పఁబడిన మహావాక్యమువల్లఁ గల్గిన జ్ఞానసిద్ధి నిరంతరము గల్గును గాక.)

**యతస్సర్వత్రావస్థితం ప్రజ్ఞానం బ్రహ్మాఽతో మయ్యవస్థితం ప్రజ్ఞానం బ్రహ్మైవ ప్రజ్ఞానత్వా విశేషాదిత్యైతరేయ మహావాక్యోక్తజీవబ్రహ్మైక్యజ్ఞానసిద్ధిర్నిరంతరం భూయాత్.**

(ఏ కారణమువలన సకలస్థలములం దుండు ప్రజ్ఞానము బ్రహ్మమో ఆ కారణమువలన నాయందును నెలకొనియుండు ప్రజ్ఞానము బ్రహ్మమే. ప్రజ్ఞానత్వావిశేషమువలన (ప్రజ్ఞానభేదము లేమింజేసి) ఇట్లని యైతరేయమహావాక్యమునందుఁ జెప్పఁబడిన జీవబ్రహ్మైక్యజ్ఞానసిద్ధి నిరంతరము గలుగును గాక.)

**యజుర్వేదమహావాక్యము** :- వివేకచూడామణి 252 శ్లో.

**శ్లో॥ అస్థూలమిత్యేతదసన్నిరస్య**
**సిద్ధం స్వతో వ్యోమవదప్రతర్క్యమ్ ।**
**అతో మృషామాత్రమిదం ప్రతీతం**
**జహీహి యత్స్వాత్మతయా గృహీతమ్ ।**
**బ్రహ్మాహమిత్యేవ విశుద్ధబుద్ధ్యా**
**విద్ధి స్వమాత్మానమఖండబోధమ్ ॥**

("అస్థూలమహ్రస్వ" మను శ్రుతిచేత నసద్రూప మగు ప్రపంచము నిరసింపఁబడి స్వయంజ్యోతియు, నూహింప యోగ్యముగాని పూర్ణజ్ఞానస్వరూపము నగు పరమాత్మ మాత్రము సత్య మని స్థాపింపఁబడెను. కనుక "**అహం బ్రహ్మాఽస్మి**" (= నేను బ్రహ్మమైతిని)అను నిర్మలబుద్ధిచేత నీకనఁబడుప్రపంచము అసత్య మని దీనిని విడిచి బ్రహ్మవస్తువు సత్య మైనదనియు నావస్తువే (బ్రహ్మమే) నే ననియుఁ దెలియుము.)

**సామవేదమహావాక్యము** :- వి.చూ.253 శ్లో.

**శ్లో॥ మృత్కార్యం సకలం ఘటాది సతతం మృన్మాత్రమేవాహితం**
**తద్వత్సజ్జనితం సదాత్మకమిదం సన్మాత్రమేవాఖిలమ్ ।**
**యస్మాన్నాస్తి సతః పరం కిమపి తత్సత్యం తదాత్మా స్వయం**
**తస్మాత్తత్త్వమసి ప్రశాంతమమలం బ్రహ్మాఽద్వయం యత్పరమ్ ॥**

(ఘటము మొదలగు సమస్తమృత్కార్యము మృత్తికకంటె నన్యము కానియట్లు సత్తునుండి జన్మించిన ప్రపంచ మంతయు సద్వస్తుకార్యమే కాని యన్యము కాదు కావున నంతయు సత్స్వరూపమే. భేదశూన్యమును శాంతరూపము నగు బ్రహ్మమే యా సత్తు కావున నా బ్రహ్మమే నే నైతిని.)

**అథర్వవేదమహావాక్యము** :- వి.చూ.233 శ్లో.

**శ్లో॥ బ్రహ్మైవేదం విశ్వమిత్యేవ వాణీ**
**శ్రౌతీ బ్రూతేఽథర్వనిష్ఠా వరిష్ఠా,**
**తస్మాదేతద్బ్రహ్మమాత్రం హి విశ్వం**
**నాధిష్ఠానాద్భిన్నతారోపితస్య ॥**

(ఈప్రపంచ మంతయు బ్రహ్మమే కాని వేఱు కాదు. (సర్వం హ్యేతత్ బ్రహ్మాఽయమాత్మా బ్రహ్మ సోఽయమాత్మా చతుష్పాత్ - మాండూక్యోపనిషత్) ఇట్లని అథర్వవేదవాక్కు చెప్పుచున్నది. కాన నీప్రపంచమంతయు బ్రహ్మమాత్రమే. ఆరోపింపఁబడిన జీవునకు అధిష్ఠానముకంటె వేఱుస్వరూపము లేదు. ఆరోపిత మెట్లనఁగా శుక్తిని శుక్తియని తెలిసికొనక రజత మని తలఁచుట. అధిష్ఠానము, శుక్తి. ఆశుక్తికంటె వేఱురూపముగా ఆరోపితరజత మేరీతిఁ గాదో యాలాగే బ్రహ్మమునం దారోపితమైన ప్రపంచము, బ్రహ్మముకంటె నన్యము కాదు.)

## (4) సూత్రము ఐ, ఔచ్

### (13) కాశికా.

**శ్లో॥ ఐఔచ్ బ్రహ్మస్వరూపస్సన్ జగత్స్వాంతర్గతం తతః ।**
**ఇచ్ఛయా విస్తరీకర్తుమావిరాసీత్కృపానిధిః ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** ఐఔచ్ బ్రహ్మస్వరూపస్సన్ = ఐఔచ్ బ్రహ్మస్వరూపము గానుండి (ఐ = జ్ఞానాకాశము, ఔ = మూఁడున్న రమాత్ర లేక ప్రణవధ్వని) తతః = అక్కారణమున, స్వాంతర్గతమ్ = తనలో లీనమైన, తత్ = ఆప్రసిద్ధమగు, జగత్ = జగత్తును, ఇచ్ఛయా =

సంకల్పమాత్రముచేత, విస్తరీకర్తుమ్ = పెంపుఁజేయుటకు, కృపానిధిః = దయాసముద్రుఁడగు పరమేశ్వరుఁడు, అవిరాసీత్ = ఆవిర్భవించెను.



శ్రీచక్రపటమును జూడుఁడు.

స్వాత్మభూతుఁ డన స్వయంసంపన్నుఁడు. అట్టి పరమేశ్వరుఁడు, జగత్తున కెట్లు కారణ మగు నను సంశయమును దొలఁగింప నీసూత్ర ముపపాదితము.

ఆకారణమున స్వాంతర్గత మగు జగత్తును విస్తరింపఁజేయఁ దలఁచిన వాఁడై జ్ఞానశక్తియుక్తుఁడైన యక్షరుఁ డనునది పూర్వసూత్రగతము (ఐ) అక్షరుఁడు (అ+ఇ = ఏ; అ+ఏ = ఐ) సంబంధము.

**తత్త్వవిమర్శినీ :** స్వాత్మభూతస్య పరమేశ్వరస్య జగత్కారణత్వం కథమిత్యా- శంకాయామాహ :- ఐఔజితి. తతః స్వాంతర్గతం జగద్విస్తారయితుమిచ్ఛుః, ఐ - జ్ఞానాదిశక్తియుక్తః, అక్షర ఇతి. అతః పూర్వసూత్రగత అకారేకారదీర్ఘయోగస్యైవ ఐకారత్వమేకత్వం చ సః ప్రజ్ఞానస్వరూపపరమేశ్వరో యః స పూర్వసూత్రగత అకారదీర్ఘ ఉకారదీర్ఘస్యైవ యోగే ఔకారత్వం యః స ప్రజ్ఞానాత్మా మాయాశబలితః స ఔకారో యః సః. ఆవిరిత్యావిర్భావే. ఉక్తంచ స్వరవిమర్శిన్యాం ''అకార ఉకారసంయోగా

త్సర్వసంభూతిరిష్యతే" ఇతి. ఇచ్ఛయా జగద్విస్తారయితు ముద్యుక్త ఇత్యర్థః. అత్రాహ, "ప్రణవేన జగద్వ్యాప్తం మాయాయామవతిష్ఠతే" ఇతి జ్ఞానోత్తమే. ఏవం తత్త్వసముదాయానాం త్రయోదశవర్ణాత్ శివాదిప్రకృత్యంతానాముద్భవః. ప్రకృతిపురుషవివేక ఉత్తరత్ర కథ్యతేఽ స్మిన్నుపసంహారత్వేన పఠ్యతే. అత్ర హ్రస్వదీర్ఘప్రభేదాచ్చతుర్దశస్వరాణామేవ సంకీర్తనం చతుర్దశభువన చతుర్దశచక్ర చతుర్దశ ప్రకారాణా మితి నిష్కర్షః. తదుక్తం శివగౌరీసంవాదే, మహామంత్రతత్త్వ ప్రకాశిన్యామ్–

**శ్లో॥ తత్త్వమంత్రం మహేశాని! మమ రూపం త్వమేవ హి ।**
**చతుర్దశాత్మకం చక్రం స్వరచక్రమితీరితమ్ ॥**

**శ్లో॥ త్రయోదశాత్మకం తుర్య మావయోర్మంత్రమంబికే! ।**
**ఉచ్ఛూనకాలే బింద్వాత్మా తస్మాదక్షరసంభవః ॥**

**శ్లో॥ బిందుస్ఫోటనమాత్రేణ వర్ణానాం చ సముద్భవః ।**
**తస్మాదాకాశముఖ్యాని భూతాని సమజాయత ॥**

**శ్లో॥ బిందుః శ్రీచక్రరాజస్య పరబ్రహ్మాత్మకస్త్వితి ।**
**చతుర్దశాత్మకం పశ్చాచ్చక్రాకారేణ సంభవః ॥**
**ఉత్పన్నభువనాన్యత్ర చతుర్దశ చతుర్దశ । ఇతి**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** కేవలాత్మస్వరూపుఁడైన పరమేశ్వరునికి లోకకారణత్వ మెట్లు సంభవించె నని ఆశంకించి చెప్పుచున్నాఁడు. పిమ్మట 'స్వాత్మ' తనలోఁబడిన లోకమును విస్తారపఱుచుటకు నిచ్ఛించినవాఁడై (ఐ) జ్ఞానము మున్నగు శక్తియుక్తుఁ డాయెను. అకారము, ఏకారమును చేరియే ఐ అని విశిష్టమైన ఒకవర్ణ మగుచున్నది. ఐకారమునకు ప్రజ్ఞానస్వరూపుఁ డైన పరమేశ్వరుఁడు అని యర్థము. అట్లే అకార ఓకారసంయోగమే ఔ అని అభిన్న వర్ణ మవుచున్నది. ఈ ఔకారమునకు మాయాశబలితుఁ (మాయోపాధికుఁ) డని యర్థము. కాన బ్రహ్మమే ప్రజ్ఞానాత్మగాను మాయాశబలితుఁడుగాను నావిర్భవించెను. ఈయర్థమే తత్త్వవిమర్శినిలో "అకార ఉకార సంయోగమువలన సర్వము సంభవించిన" దని చెప్పఁబడి యున్నది. అట్టి ఈశ్వరుఁడు స్వేచ్ఛగానే లోకమును విస్తారపఱుచుటకు ప్రయత్నించె నని భావము. ఇదియే జ్ఞానోత్తమ మను గ్రంథమందు 'ఈలోకము ప్రణవముచే వ్యాపింపఁబడి మాయలోనే ఉన్న' దని చెప్పఁబడి యున్నది. కాన శివాది ప్రకృత్యంతములైన తత్త్వసముదాయము నీత్రయోదశ వర్ణమునుండియే జనించెను. ప్రకృతి పురుషవివేకము పైని చెప్పఁబడును. అయినను నీసూత్రమం దుపసంహారముగా చెప్పఁబడుచున్నది. ఇచ్చట హ్రస్వదీర్ఘములచేతఁ బదునాల్గువర్ణములను జెప్పియుండుటకు భావ మేమనిన, పదునాలుగు భువనములును, పదునాలుగు చక్రములును

ఈ పదునాల్గు అక్షరముల ప్రకారాంతర మని తెలుపుటకే. ఇటులే మహామంత్రతత్త్వప్రకాశిని యందు శివగౌరీ సంవాదఘట్టమునఁ జెప్పఁబడినది. "ఓమహాదేవీ! (మహత్తు, అహంకారము, జీవుఁడు అనఁగా జీవదేహేంద్రియాది భావము) నా స్వరూపము తత్త్వమంత్రము. నీవే చతుర్దశాత్మకమగు స్వరచక్రముగఁ (ప్రణవధ్వనిగ) జెప్పఁబడినది. ఓయంబికా! త్రయోదశాత్మకమైన (శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము, అవ్యక్తము, మహత్తు, అహంకారము) ఇవి పదుమూఁడు తుర్యమంత్రము. ఉచ్ఛ్వానకాలమం దనఁగాఁ బ్రకృతిలయకాలమందు బిందుస్వరూప మగును (జీవదృష్టియే జగత్సృష్టి). అందుండి యక్షస సముత్పత్తి. బిందుస్ఫోటనమాత్రమున (ప్రణవధ్వని పగిలినపుడు) వర్ణము లుద్భవించెను. అందుండి యాకాశాదిభూతములు పుట్టెను. (ఈ విషయము 5,6 సూత్రములు "హ య వ రట్" "లణ్" చూడుఁడు.)

బిందువు శ్రీచక్రమునకుఁ బరబ్రహ్మాత్మకము. అది చతుర్దశాత్మక చక్రము. దానియందుఁ జతుర్దశభువనము లుత్పన్నములు.

**విశేషాంశములు** : పంచీకరణవార్తికము–

**శ్లో॥ వాచ్యవాచకనిర్ముక్తం హేయోపాదేయవర్జితమ్ ।**
**ప్రజ్ఞానఘనమానందం వైష్ణవం పదమశ్నుతే ॥**

(వాచ్యవాచక స్థితులకంటె వేఱైనదియును, త్యజింపఁ దగినదియును, గ్రహింపఁదగినది యును కానట్టిదియును, ప్రజ్ఞానఘనమమును, ఆనందమునగు వైష్ణవపదమును (అనఁగా మోక్షమును) అనుభవించుచున్నాఁడు.)

**శ్లో॥ యః పశ్యేత్సర్వగం శాంతమానందాత్మానమవ్యయమ్ ।**
**న తేన కించిదాప్తవ్యం జ్ఞాతవ్యం వాఽవశిష్యతే ॥**

(ఎవఁ డన్నిటియందును వ్యాపించియుండునదియును, శాంతమును, ఆనందమును, అవ్యక్తమును, నగు నాత్మను జూచుచున్నాఁడో యట్టి వానికిఁ బొందఁదగినదియును, దెలిసికొనఁ దగినదియు నేదియును లేదు.)

కైవల్యోపనిషత్–

**శ్లో॥ మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్ ।**
**మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాఽవ్యయమస్మ్యహమ్ ॥**

(సకలమును నాయందే పుట్టినది. అ ట్లుదయించినది సమస్తము నా యందే

నిలిచియున్నది. మఱియు సమస్తము నాయందే లయ మగుచున్నది. కాఁబట్టి యట్టి యద్వయ మగు బ్రహ్మము నేనే యని భావము.)

పతంజలి యోగసూత్రము :- 2-22.

**కృతార్థం ప్రతి నష్టమప్యనష్టం తదన్యసాధారణత్వాత్**

(వివేకజ్ఞానముచేతఁ గృతార్థుఁ డైనవానికి ననఁగా యోగికిమాత్రము దృశ్యము వ్యాపారశూన్యముగ నుండును. తక్కిన యజ్ఞానుల కెల్లను దృశ్యము మిగిలియుండును. కావున వారు బంధమునఁ దగిలినవా రగుచున్నారు. అనఁగా నట్టివారికిఁ బ్రపంచరూపమైన సంసారము నాశము కానేరదు. పురుషుఁ డొక్కఁడే యైనను పురుషుఁడు ప్రతిబింబించెడి యుపాధు లనేకవిధములుగ నుండుటచేత నా యుపాధులు నశించువఱకును సంసార బంధ ముండును.)

ఆత్మబోధము :-

**శ్లో॥ నిషిధ్య నిఖిలోపాధి న్నేతి నేతీతివాక్యతః ।**
**విద్యాదైక్యం మహావాక్యైర్జీవాత్మపరమాత్మనోః ॥**

(లోకమునం దనేకము లగు వంటరాళ్ళలో నొకమంచిరత్న మున్నప్పుడు పరీక్షకుని మాటచే వంటరాళ్ళు రత్నములు కావని తెలిసికొనువిధముగనే నామరూపాత్మకములగు సమస్తో-పాధులును ఆత్మ కానేర వని వేదమందు నిషేధించినంతవఱకుఁ దెలిసికొని సముద్రములు భూరూపోపాధివలన గొప్పవి చిన్నవి యను విభేదములు వ్యవహారమునం దున్నను భూరూపోపాధిని త్రోసిపుచ్చి విచారించినయెడల యథార్థముగ జలమంతయు నొకటిగనే స్ఫురించునట్లు జీవాత్మ పరమాత్మలకు కించిద్‌జ్ఞత్వసర్వజ్ఞత్వభేదము వ్యవహారమునందే కాని సుషుప్త్యవస్థయం దుండు నఖండానందస్వరూపమైన పరమార్థమందు లే దని మహావాక్యరూప మగు వేదముచేతఁ దెలిసికొన వలయును.)

**శ్లో॥ అజ్ఞానకలుషం జీవం జ్ఞానాభ్యాసాద్వినిర్మలమ్ ।**
**కృత్వా జ్ఞానం స్వయం నశ్యే జ్జలం కతకరేణువత్ ॥**

(అజ్ఞానకార్యభూతము లయిన యహంకారాదులచేతఁ గర్తృత్వభోక్తృత్వాద్యభిమాన వంతుఁడైన జీవునిజ్ఞానమనునది చిరకాలాభ్యాసముచేత నజ్ఞానమును నశింపఁజేయుటవలన పరిశుద్ధునిగఁ జేయుచున్నది. చిల్లగింజ (నఱుగఁదీసిన) గంధము బురదనీటిని బరిశుద్ధముగాఁ జేసి తానును తనరూపము తెలియకుండ దానియం దేలాగునఁ గలసిపోవుచున్నదో యాలాగే జ్ఞానము నాత్మయందు లీన మైపోవుచున్నది. అనఁగా నాత్మ త్రిపుటిరహితము.)

**శబ్దనిష్టమిదం జగన్నిశ్శబ్దం బ్రహ్మ ఉచ్యతే.**

భైరవయామిళమందు పరమశివుఁడు పార్వతికి:-

**శ్లో॥ మూలాధారం తథా స్వాధిష్ఠానం చ మణిపూరకమ్ ।**
**అనాహతం విశుద్ధ్యాఖ్యమాజ్ఞాచక్రాణి పార్వతి! ॥**

**శ్లో॥ త్రికోణరూపిణీ శక్తి - ర్బిందురూపశ్శివస్ స్మృతః ।**
**అవినాభావసంబంధ - స్తస్మాద్బిందుత్రికోణయోః ॥**

(ఓపార్వతీ! మూలాధార మనియు, స్వాధిష్ఠాన మనియు, మణిపూరక మనియు, అనాహత మనియు, విశుద్ధి యనియు, ఆజ్ఞాచక్ర మనియు షట్చక్రములు గలవు. ఈ యాఱుచక్రములకంటె భిన్నముగా శక్తి త్రికోణ స్వరూపిణి యనఁగాఁ ద్రికోణరూపముగల శక్తి యున్నది. శివుఁడు బిందు రూపుఁడుగఁ జెప్పఁబడుచున్నాఁడు. అక్కారణమున నోపార్వతీ! బిందు త్రికోణము లవినాభావ సంబంధములు. (అనఁగా నొకదానినుండి మఱియొకదానిని వేఱుపఱుప నసాధ్యము) అని యెఱుంగవలయును.)

సంహారక్రమమున శ్రీచక్రలేఖనము :-

ముందుగా నొకవృత్తమును (చక్రాకారమును) వ్రాసి యావృత్తములోఁ దొమ్మిదిగీఁత లడ్డముగ గీచి వానిలో నడిమిగీటుయొక్క కొనలు రెంటినుండి త్రికోణాకారము వచ్చులాగునఁ దన కాఱవది యగురేఖతోఁ జేర్చునది. ఇట్లే పైరేఖయొక్కకొనలు రెంటినుండి త్రికోణాకారముగాఁ దన కేడవదియగు రేఖతోఁ జేర్చునది. క్రిందనుండు ద్వితీయరేఖాప్రాంతములనుండి ముక్కోణాకారముగఁ దన కెనిమిదవరేఖతోఁ జేర్పవలయును. పిమ్మట అడుగునను పైని నుండుమూఁడవరేఖకొనలనుండి షట్కోణాకారము లిఖించునది. అప్పు డాకోణము లాఱును వృత్తము నంటియుండును. అనఁగా వృత్తము నంటియుండునట్లు కొలత చూచి వ్రాయవలయును.

ఈప్రకారము క్రిందిమూఁడురేఖలకును పైమూఁడురేఖలకును మధ్యను పొట్టిగా నున్నమూఁడురేఖలలో నడుగురేఖకొనలనుండి త్రికోణాకారముగాఁ దన కైదవరేఖతోఁ గలుపవలయును. ఇట్లే పైరేఖనుండి త్రికోణాకారముగఁ దన కైదవరేఖతోఁ జేర్చునది. మధ్యను మిక్కిలి హ్రస్వమై యున్న రేఖకొనలనుండి త్రికోణరూపముగఁ దనకు మూఁడవరేఖతోఁ జేర్చునది. ఇట్లు వ్రాయఁగాఁ జతుర్వింశతిమర్మస్థానములు నన్నియ సంధులును గలుగుచున్నవి. ఇదియే నవయోనిచక్రము.

త్రిపురతాపిన్యుపనిషత్ :-

**శ్లో॥ త్రిపురతాపినీ విద్యా వేద్యచిచ్ఛక్తివిగ్రహమ్ ।**
**వస్తుతశ్చిన్మాత్రరూపం పరతత్త్వం భజామ్యహమ్ ।**

తదేవ చక్రం శ్రీచక్రం తస్య నాభ్యామగ్నిమండలే సూర్యాచంద్రమసౌ తత్రౌంకారపీఠం పూజయిత్వా తత్రాక్షరం బిందురూపం తదంతర్గతవ్యోమరూపిణీం విద్యాం పరమాం స్మృత్వా మహాత్రిపురసుందరీమావాహ్య।

**శ్లో॥ క్షీరేణ స్నాపితే దేవి! చందనేన విలేపితే ।**
**బిల్వపత్రార్చితే మాతర్దుర్గేఽహం శరణం గతః ॥**

ఇత్యేకయార్చయాప్రార్థ్య మాయాలక్ష్మీమంత్రేణ పూజయేదితి భగవానబ్రవీ-దేతైర్మంత్రైర్భగవతీం యజేత్తతో దేవీ ప్రీతా భవతి స్వాత్మానం దర్శయతి తస్మాద్య ఏతైర్మంత్రైర్యజతి స బ్రహ్మ పశ్యతి స సర్వం పశ్యతి సోఽమృతత్వం చ గచ్ఛతి య ఏవం వేదేతి మహోపనిషత్.

**(ఇది శ్రీచక్రరహస్యము)**

.....(దేవీగాయత్రీమంత్రం) : కుళకుమారి విద్మహే, మంత్రకోటి సుధీమహి, తన్నః కాళీ ప్రచోదయాత్.

.....(సరస్వతీగాయత్రీమంత్రం) : "ఐం వాగీశ్వరి విద్మహే, క్లీం కామేశ్వరి ధీమహి, సౌస్తన్నశ్శక్తిః ప్రచోదయాత్."

**శ్లో॥ జ్ఞాననేత్రం సమాధాయ - సుమహత్పరమం పదమ్ ।**
**నిష్కళం నిశ్చలం శాంతం - బ్రహ్మోఽహ మితి సంస్మరే త్ ॥ ఇతి**

ఇత్యేకం పరం బ్రహ్మరూపం సర్వభూతాధివాసం తురీయం జానీతే సోఽక్షరే పరమే వ్యోమన్నధివసతి. య ఏతాం విద్యాం తురీయాం బ్రహ్మయోనిస్వరూపాం తామిహాయుషే శరణమహం ప్రపద్యే. ఆకాశాదనుక్రమేణ సర్వేషాం వా ఏతద్భూతానా-మాకాశః పరాయణం సర్వాణి హవా ఇమాని భూతాన్యాకాశాదేవ జాయంతే, ఆకాశ ఏవ లీయంతే, తస్మాదేవ భూతాని జీవంతి తస్మాదాకాశజం బీజం వింద్యా త్తదేవాకాశపీఠం స్పార్శనం పీఠం తేజఃపీఠమమృతపీఠం రత్నపీఠం జానీయా ద్యో జానీతే సోఽమృతత్వం చ గచ్ఛతి తస్మాదేతాం తురీయాం శ్రీకామరాజీయామేకాదశధా భిన్నామేకాక్షరం బ్రహ్మేతి యో జానీతే స తురీయం పదం ప్రాప్నోతి య ఏవం వేదేతి మహోపనిషత్."

(త్రిపురతాపిని విద్యచేతఁ దెలియందగిన చిచ్ఛక్తియే శరీరముగఁ గలదియును, యథార్థముగఁ జిద్రూపమును నగు పరతత్త్వమును నేను భజించెదను. ఆ చక్రమే శ్రీచక్రము. దాని నాభియం దగ్నిమండలము లైన సూర్యచంద్రులు. అందు ఓంకారపీఠమును బూజించి, యందు బిందురూపుఁడగు నక్షరునిని, దానియంతర్గత మగు నాకాశరూపిణియుఁ బరమయు నగు విద్యనును, స్మరించి మహా త్రిపురసుందరి నావాహనము చేసి "క్షీరేణ స్నాపితే దేవి! చందనేన విలేపితే, బిల్వపత్రార్చితే మాతర్దుర్గేఽహం శరణం గతః." (క్షీరస్నానము చేయింపఁబడిన దానవును, మంచి గంధముచేతఁ బూయఁబడిన దానవును, బిల్వదళంబులచేతఁ బూజింపఁబడిన దానవును నగు తల్లీ! దుర్గాదేవీ! నిన్ను శరణు సొచ్చెదను) అను భావము గల ఋక్కుచేత నాదేవిని బ్రార్థించి మాయాలక్ష్మీమంత్రము చేతఁ బూజింపవలయు నని భగవంతుఁడు చెప్పెను. ఈ మంత్రములతో భగవతిని పూజింప నాదేవి ప్రీతయై తనరూపమును జూపును. (ప్రత్యక్షమగును.) కాఁబట్టి యెవ్వఁడీ మంత్రములతో దేవీపూజ యొనరించునో వాఁడు బ్రహ్మమును సందర్శించును. వాఁడు సర్వమును సందర్శించును. ఇట్లు సర్వము నెఱుంగువాఁ డమృతత్వమును (మోక్షమును) బొందును. అని మహోపనిషత్తు.)

ఉపాసకుఁడు మహత్తు పరమునగు పదమునందు, అనఁగా బ్రహ్మమునందు జ్ఞాననేత్రము నిశ్చలముగ నుంచి నిష్కళమును నిశ్చలమును శాంతమును నగు బ్రహ్మము నేనని లెస్సగ స్మరింపవలయును. ఇట్లు అద్వితీయమును, సర్వభూతాశ్రయము, తురీయము నగు పరబ్రహ్మమునుగ నెవ్వఁడెఱుంగునో వాఁడు అక్షరమును పరమము నగు బ్రహ్మస్వరూపమును పొందు చున్నాఁడు. ఎవఁడు బ్రహ్మయోనిస్వరూపయు, తురీయయు నగు నీవిద్యను తెలిసికొనునో వాఁడును మోక్షము నొందును. ఆ బ్రహ్మవిద్య నిప్పుడాయువుకొఱకు శరణు చొచ్చెదను. ఆకాశాదిక్రమముగ నఖిలభూతములకు నాకాశమే (అనఁగా బ్రహ్మమే) మూలకారణము. ఈభూతము లన్నియు నాకాశమునుండియే పుట్టుచున్నవి. ఆకాశమునందే లయము నందుచున్నవి. ఆ యాకాశమువల్లనే యుద్భవిల్లిన యెల్లభూతములును జీవించుచున్నవి. కాఁబట్టి యాకాశమువలన నుదయించిన బీజము నెఱుంగ నగును. అదియే యాకాశపీఠము, వాయుపీఠము, అగ్ని పీఠము, అమృత పీఠము, రత్నపీఠము అని ఎఱుంగనగును. అ ట్లెఱుంగువాఁ డమృతత్వము నందును. కాఁబట్టి శ్రీకామరాజ సంబంధియుఁ బదునొకండు భేదములు గలదియు నగు నీతురీయను ఏకాక్షర మగు బ్రహ్మ మని యెవఁ డెఱుంగునో వాఁడు తురీయస్థానము నందును. ఎవఁ డీవిధముగఁ దెలిసికొనునో వాఁడు తురీయము నందును – అని మహోపనిషత్తు.)

భావనోపనిషత్తు :–

**శ్లో॥ స్వావిద్యాపదతత్కార్యం శ్రీచక్రోపరిభాసురమ్ ।**
**బిందురూపశివాకారం రామచంద్రపదం భజే ।**

ఓం ఆత్మానమఖండమండలాకారమావృత్య సకలబ్రహ్మాండమండలం స్వప్రకాశం ధ్యాయేత్, శ్రీగురుః, పరమకారణభూతా శక్తిః, తేన నవరంధ్రరూపో దేహః. నవశక్తిమయం శ్రీచక్రం. దేహో నవరత్నద్వీపః ... ... (శ్రీచక్రపూజా వివరం) సత్సంగపరిపూరితతానుస్మరణం గంధమ్ ... ... సమస్త విషయాణాం మనసః స్థైర్యేణానుసంధానం కుసుమమ్. తేషామేవ సర్వదా స్వీకరణం ధూపః. పవనావచ్ఛిన్నోర్ధ్వజ్వలనసచ్చిదుల్కాకాశదేహో దీపః. సమస్త యాతాయాతవర్జం నైవేద్యం. అవస్థాత్రయైకీకరణం తాంబూలమ్. మూలాధారాదాబ్రహ్మ-రంధ్రపర్యంతం బ్రహ్మరంధ్రాదామూలాధారపర్యంతం గతాగతరూపేణ ప్రాదక్షిణ్యమ్. తురీయావస్థా నమస్కారః. దేహహన్య ప్రమాతృతా నిమజ్జనం బలిహరణం. సత్యమస్తి కర్తవ్యమకర్తవ్యమౌదాసీన్యనిత్యాత్మవిలాపనం హోమః. స్వయం తత్పాదుకానిమజ్జనం పరిపూర్ణధ్యానమేవం ముహూర్తత్రయం భావనయా యుక్తో జీవన్ముక్తో భవతి. తస్య దేవతాత్మైక్యసిద్ధిః, చింతితకార్యాణ్యయత్నేన సిద్ధ్యంతి స ఏవ శివయోగీతి కథ్యతే. కాదిహాదిమతోక్తేన భావనా ప్రతిపాదితా, జీవన్ముక్తో భవతి య ఏవం వేద ఇత్యుపనిషత్.

## (5) సూత్రము. హ య వ రట్.

### (14) కాశికా.

**శ్లో॥ భూతపంచకమేతస్మాద్ధయవరణ్మహేశ్వరాత్ ।**
**వ్యోమవాయ్వంబువహ్న్యాఖ్యభూతాన్యాసీత్స ఏవ హి ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** అవతారిక : మొదటినాలుగుసూత్రములు నచ్చులనుగుఱించి చెప్పఁబడినవి. ఇవి యాత్మప్రతిపాదకములు. ఈయైదవసూత్రము మొదలుకొని హల్లులవిషయము చెప్పఁబడుచున్నది. హల్లులు జీవుని భోగ్యవస్తువులను గుఱించి చెప్పుచున్నవి.)

ఏతస్మాత్ = ఈ (పూర్వసూత్రములచేత నిరూపింపఁబడిన), మహేశ్వరాత్ = మహేశ్వరునివలన (జీవునకుముందు మహదహంకారమునుండి) భూతపంచకమ్ = పంచ మహాభూతములు, (అభూత్ = ఆయెను. పుట్టెనని భావము.) (తేషామ్ = ఆ పంచమహా-భూతములలో,) వ్యోమవాయ్వంబువహ్న్యాఖ్యభూతాని, వ్యోమ = ఆకాశము, వాయు = వాయువు, అంబు = జలము, వహ్ని = అగ్ని, ఆఖ్యభూతాని = అనుపేరుగల భూతములు, హయవరట్ = హ, య, వ, ర అనునవి, ఆసీత్ = ఆయెను (అనఁగా హ = ఆకాశము, య = వాయువు, వ = జలము, ర = అగ్నియు నయ్యెనని భావము.) సః + ఏవ హి = ఆ పరమేశ్వరుఁడే, వ్యోమవాయ్వంబువహ్న్యాఖ్యభూతాని = ఆకాశము, వాయువు, జలము, అగ్ని అను భూతములుగా, ఆసీత్ = ఆయెను. పరిణమించె నని భావము.

**తత్త్వవిమర్శినీ :** తత ఆత్మానస్సకాశాదాకాశాదిభూతసంభవమాహ – భూత– పంచకమితి. స ఏవ పరమేశ్వర ఏవ.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** ఆ యాత్మనుండి పంచభూతములు పుట్టిన వని భూతపంచక మిత్యాదిశ్లోకములచే చెప్పుచున్నాఁడు.

**(15) కాశికా**

**శ్లో॥ హకారాద్వ్యోమసంజ్ఞం చ యకారాద్వాయుసంజ్ఞితః ।**
**వకారాజ్జలసంజ్ఞశ్చ రేఫోఽగ్నిరితి శైవవాక్ ॥**

**శ్లో॥ (హకారాద్వ్యోమసంజ్ఞం చ యకారాద్వాయురుచ్యతే ।**
**రకారాద్వహ్నిస్తోయం తు వకారాదితి శైవవాక్ ॥) (పాఠాంతరము)**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** హకారాత్ = హకారమువలన, వ్యోమసంజ్ఞం చ = ఆకాశమను సంజ్ఞగలదియును, యకారాత్ = యకారమువలన, వాయుసంజ్ఞితః = వాయు వనుసంజ్ఞ గలదియు, వకారాత్ = వకారమువలన, జలసంజ్ఞశ్చ = జలమను సంజ్ఞ గలదియును, రేఫః = రేఫము, అగ్నిః = అగ్ని యను సంజ్ఞ గలదియును, (అభూత్ = ఆయెను) ఇతి = అని, శైవవాక్ = ఈశ్వరవాక్యము.

పంచభూతములు :– వాని గుణములు (తన్మాత్రరూపములు) వాని యాశ్రయములు.

1. పృథివి – ముక్కు – గంధము. 2 అప్పు – నాలుక – రసము. 3. తేజస్సు – కన్ను – రూపము. 4. వాయువు – చర్మము – స్పర్శము 5. ఆకాశము – చెవి – శబ్దము.

(i) 1. ఆత్మవలన నాకాశము కలిగెను. 2. ఆకాశమువలన జ్ఞాతయు, వ్యానవాయువును, శ్రోత్రమును, శబ్దమును, వాక్కును గలిగెను. (ii) 3. ఆకాశమువలన వాయువు కలిగెను. 4. వాయువువలన మనస్సు, వ్యానవాయువును, త్వక్కును, స్పర్శమును, పాణియును గలిగెను. (iii) 5. వాయువువలన నగ్ని కలిగెను. 6. అగ్నివలన బుద్ధియు, నుదానవాయువును, చక్షుస్సును, రూపమును, పాదమును కలిగెను. (iv) 7. అగ్నివలన జలము గలిగెను. 8. జలమువలనఁ జిత్తమును, సమానవాయువును, జిహ్వయును, రసమును, పాయువును గలిగెను. (v) 9. జలమువలన భూమి కలిగెను. 10. భూమివలన నహంకారమును, అపానవాయువును, ఘ్రాణేంద్రియమును, గంధమును, ఉపస్థేంద్రియమును గలిగెను.

**తత్త్వవిమర్శినీ :** "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయో రగ్నిః, అగ్నే రాపః" ఇతి శ్రుతేః. ఏతస్మాత్పరమేశ్వరాత్ భూతపంచకం ఆకాశాది ప్రపంచకారణమాసీత్.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** ఈ యాత్మనుండియే ఆకాశము పుట్టెను. ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్ని నుండి నీరు ఇత్యాదిశ్రుతి ప్రకారము ఈ పరమేశ్వరునుండి ప్రపంచకారణమై ఆకాశాదిపంచభూతములును కలిగినవని భావము.

విశేషాంశములు :- తైత్తిరీయము, ఆనందవల్లి, 1-వ అనువాకము.

"ఓం బ్రహ్మవిదాప్నోతి పరం, తదేషాఽభ్యుక్తా, సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ, యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్, సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ. బ్రహ్మణా విపశ్చితేతి, తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నం, అన్నాత్పురుషః, స వా ఏష పురుషోఽన్నరసమయః, తస్యేదమేవ శిరః, అయం దక్షిణః పక్షః, అయముత్తరః పక్షః, అయమాత్మా, ఇదం పుచ్ఛం ప్రతిష్ఠా, తదప్యేష శ్లోకో భవతి."

(పరబ్రహ్మమును దెలిసికొనిన జ్ఞాని పరబ్రహ్మమునే పొందుచున్నాఁడు. ఈ యర్థమునే యీఋక్కు చెప్పుచున్నది. బ్రహ్మము సత్యమును జ్ఞానమును అనంతము నైయున్నది. ఇట్టి పరబ్రహ్మము శ్రేష్ఠమగు అవ్యాకృత మమనుపేరుగల హృదయాకాశమునందలి బుద్ధిగుహయం దున్నది. దీనిని దెలిసికొనువాఁడు సర్వజ్ఞస్వరూప మగు నాపరబ్రహ్మముతోడ సమస్తకామములను బొందుచున్నాఁడు. ఇదివఱకు '**బ్రహ్మవిదాప్నోతి పరం**' అనుశ్రుతిని వివరించి మరల నాయర్థమునే యింకను వివరించుటకు నుత్తరగ్రంథ మారంభింపఁబడుచున్నది. ఆత్మశబ్దవాచ్యమును ఈ మంత్రమునందుఁ జెప్పఁబడిన సత్యజ్ఞానానంతస్వరూపమునగు పరబ్రహ్మమునుండి శబ్దమే గుణముగా సమస్తభూతములకు నవకాశమిచ్చు నాకాశము పుట్టెను. ఆ యాకాశమునుండి శబ్దస్పర్శము లను రెండుగుణములుగల వాయువు పుట్టెను. ఆ వాయువునుండి శబ్దస్పర్శ-రూపములను మూఁడుగుణములుగల యగ్ని పుట్టెను. ఆ యగ్ని వలన శబ్దస్పర్శరూపరసము లను నాలుగు గుణములుగల యుదకము పుట్టెను. ఆ యుదకమునుండి శబ్దస్పర్శరూపరసగంధము లను నైదుగుణములుగల భూమి పుట్టెను. ఆ భూమివలనఁ దరుగుల్మలతాదులును, సమస్త సస్యములును, ఇవియే స్వరూపముగాఁగల యోషధులును పుట్టెను. రేతో రూపముగాఁ బరిణమించిన యా యన్నమువలన శిరసు కరచరణములు మున్నగునవయవములతోఁ గూడిన యాకృతిగల పురుషుఁడు పుట్టెను. ఆ పురుషుఁ డన్నరసస్వరూపుఁడు. (సర్వావయవము లవలనఁ బురుషాకృతిగా భావన చేయఁబడిన తేజస్సంభూతమగు రేతస్సువలనఁ బుట్టిన యాపురుషుని యనాత్మస్వరూపములగు శిరస్సు, కరచరణములు మున్నగు వెలియాకారవిశేషములం దాత్మభావన చేయుబుద్ధి, యాధార మేదియు లేక మిక్కిలి రహస్యమై లోపలనుండు ప్రత్యగాత్మయే విషయముగాఁ గలదియును నిరాలంబన మైనదియు నగుటకు శక్యమైనది కాదని వెలుపల కనుపడుచుండు

శరీరమునకు నాత్మసామ్యమును గల్పించుటచే శాఖాగ్రచంద్రనిదర్శనముం బోలె నా బుద్ధిని లోపల ప్రవేశింపఁజేయుటకుఁ జెప్పుచున్నాఁడు.) ఇట్లు రేతస్సువలనఁ బుట్టియున్న రసరూపమైన యాపురుషునకు సమస్తావయవములలోఁ బ్రసిద్ధముగా నుండునదియే శిరస్సు. ఈ దేహదక్షిణభాగము దక్షిణపక్షము. ఉత్తరభాగము ఉత్తరపక్షము. సర్వావయవములకు నీ దేహ మధ్యభాగమే యాత్మ. గోపుచ్ఛాకృతిగానుండు నీదేహపునాభిక్రింది ప్రదేశమగు పాదాదిక మీ దేహమును నిలుపుట కాధారమై పుచ్ఛాకృతిగా నున్నది. ఇట్లుండు నీ పురుషాకృతిని ప్రధానముగాఁ జేసికొని వెనుకఁ జెప్పఁబోయెడు ప్రాణమయాదికోశముల స్వరూపత్వసిద్ధియును, మూసయందుఁ గరగిఁ పోయఁబడిన తామ్రవిగ్రహమువలెనే యగుచున్నది.)

## (6) సూత్రము. లణ్.

### (16) కాశికా.

**శ్లో॥ ఆధారభూతం భూతానామన్నాదీనాం చ కారణమ్ ।**
**అన్నాద్రేతస్తతో జీవః కారణత్వాల్లణీరితమ్ ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** అన్నాత్ = అన్నమునుండి, రేతః = వీర్యమును, తతః = ఆ రేతస్సునుండి, జీవః = జీవుఁడును (కలుగుచున్నారు. కాఁబట్టి,) కారణత్వాత్ = కారణ మగుటచేత, అన్నాదీనామ్ = అన్నము మొదలగువానికిని, కారణమ్ = కారణ మైనదియు, భూతానామ్ = ఉద్భిజ్జములు, (బీజము వలనఁ బుట్టిన చెట్లు చేమలు మొదలగునవి) స్వేదజములు (చెమ్మటవలనఁ బుట్టిన నల్లులు దోమలు మొదలగునవి) జరాయుజములు, (గర్భకోశమువలనఁ బుట్టిన మనుజులు, మృగములు, మొదలగు ప్రాణులు) అండజములు, (గ్రుడ్డునుండి పుట్టిన కోళ్ళు బాతులు మొదలగునవి) అనఁబడు చతుర్విధ భూతకోటికి, ఆధారభూతమ్ = ముఖ్యాధార మైనభూమి, లణ్ = లణ్ణు, ఇతి = అని, ఈరితం = చెప్పఁబడెను.

**తత్త్వవిమర్శినీ :** న స్వస్మిన్సూత్రే భూతపంచకమాసీదిత్యుక్తం తత్రాకాశాది భూతచతుష్టయమేవోక్తం న పృథివీత్యాకాంక్షాయాం యదాధారస్వరూపం తత్సర్వకారణ-మితి సూత్రాంతరమవోచత్. ఆధారేతి. భూతానాం ప్రాణిజాతానాం ఉద్భిజ్జ స్వేదజ జరాయుజాండజానాం ప్రధానకారణత్వాదాధారభూతం పృథ్వీ పునశ్చాన్నాదీనాం కారణం "**అన్నాద్రేతః**" ఇతి న్యాయాత్ ఏతేషాం కారణత్వాత్ప్రత్యేకత్వేన లణిత్యుదీరితమిత్యర్థః.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** పూర్వసూత్రములో (హయవరట్) పంచభూతములు కలిగెనని చెప్పఁబడినది గాని, ఆకాశము మున్నగు నాలుగుభూతముల యుత్పత్తియే చెప్పఁబడినది. భూమి జనించె నని చెప్పఁబడలే దని శంక కలుగఁగా "ఆధారభూత" మిత్యాదిని నీ సూత్రములో

చెప్పుచున్నాఁడు. ఏ పృథ్వి ఆధారముగానున్నదో అది సర్వమునకును కారణ మని వేఱుసూత్రము ప్రతిపాదింపఁబడినది. ఉద్భిజ్జము (భూమిని చీల్చుకొని పుట్టినది – వృక్షాదులు), స్వేదజము (చెమ్మట, ఉష్ణముచేఁ గలుగునవి – దోమలు మున్నగునవి), జరాయుజము (గర్భకోశమునుండి జనించునవి – మనుష్యమృగాదులు), అండజము (గ్రుడ్డులోనుండి పుట్టునవి – కోళ్ళు బాతులు మొదలగునవి) అగు నాలుగువిధములగు ప్రాణివర్గములకును ప్రధానకారణ మగుటచే నాధార మైనదియు, "**పృథివ్యా ఓషధయః ఓషధీభ్యోఽన్నం అన్నాత్పురుషః**" అను న్యాయముచే అన్నాదులకు కారణమై నైనదగు పృథివి ప్రత్యేకముగా "**లణ్**" అను సూత్రముచే ప్రతిపాదింపఁబడినది.

విశేషాంశములు :- అయిదవసూత్రముచేత భూతచతుష్టయము చెప్పఁబడియె. అయిదవ దగు భూమిసంజ్ఞకభూతము 'లణ్' అను నాఱవసూత్రముచేతఁ జెప్పఁబడె నని యెఱుంగునది.

పూర్వసూత్రములోఁ జెప్పిన త్రిపురతాపినీయోపనిషత్తులో "తస్మాదాకాశజం బీజం విద్యాత్తదేవాకాశపీఠం స్పార్శనం పీఠమమృతపీఠం జానీయాత్" చూడుఁడు.

కఠోపనిషత్ 2 5-12:-

**శ్లో॥ ఏకో వశీ సర్వభూతాంతరాత్మా**
**ఏకం బీజం బహుధా యః కరోతి ।**
**తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా-**
**స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥**

(ఏ యాత్మ సమానాధికములు లేనిదై బీజభూతమైన యవ్యక్తమగు తన్ను నామరూప-భేదములచేత ననేకవిధములఁ జేయుచున్నదో బుద్ధి యనెడి గుహయం దుంచఁబడిన యాపరమాత్మను బ్రత్యక్షము చేసికొనిన జ్ఞానులకు నిత్యమగు బ్రహ్మానందసుఖము కలుగుచున్నది. అజ్ఞానుల కిట్టి సుఖము కలుగదు.)

భగవద్గీత - 15 అ

**శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।**
**క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥**

(లోకమునందు క్షరుఁడు అక్షరుఁడు అని యిద్దఱు పురుషులు గలరు. బ్రహ్మాది-స్థావరాంతమగు శరీరములసముదాయము క్షరము (నశించునది) అనియును, పర్వతము నశించినను శిలాసముదాయము నశింపనట్లు శరీరములు నశించినను నిర్వికారముగా నుండు-వాఁడు (కూటస్థుఁడు) అక్షరుఁడు, అనఁగా సంసారాశ్రయమగు మాయాశక్తిప్రవాహరూపమున

నశించనిది అని చెప్పఁబడుచున్నాఁడు. ఇచ్చట క్షరాక్షరులును పైని "**ఉత్తమః పురుషస్త్వన్యః**" అని మఱియొకఁడును చెప్పఁబడియున్నాఁ డని భ్రమఁజెంద నక్కఱలేదు. అవివేకులు, శరీరాత్మలే పురుషు లని భ్రాంతిఁ జెంది చెప్పుట వాడుక గనుక అట్లు చెప్పి రెండవసగముశ్లోకముచే పురుషులు కా దని తెలియఁజేసెను.)

**శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।**
**యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥**

(నాశరహితుఁడును, నారాయణుఁ డను పేరుగల సకలప్రాణినియంత యును, అనఁగా సర్వజ్ఞుఁడును, భూర్భువస్సువర్లోకము లను మూఁడు లోకములను తన దగు మాయాశక్తిచేత ప్రవేశించి ధరించువాఁడును, వెనుకఁ జెప్పియున్న క్షరాక్షరులకంటె నితరుఁడును విలక్షణుఁడును శ్రేష్ఠుఁడు నగు పురుషుఁడు పరమాత్మ యని వేదములచేతఁ జెప్పఁబడుచున్నాఁడు. **పరమాత్మ జీవధర్మముచేత శరీరముకంటెను పరమత్వముచేత మాయకంటెను విలక్షణుఁడు.**)

**శ్లో॥ యస్మాత్క్షరమతీతోఽహమక్షరాదపి చోత్తమః ।**
**అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥**

(అశ్వత్థ మనుపేరు గల సంసారమాయావృక్షమునకు అనఁగా క్షరమునకుఁ గారణమైనదియును, మాయయు నగు చేతనముకంటె నుత్కృష్టతముఁడ నగు నన్ను పరమాత్మను లోకులును వేదములును పురుషోత్తముఁ డని పొగడుచున్న వని, అనఁగా పరమాత్మయగు నేనే పురుషోత్తముఁడను.)

అధ్యాత్మోపనిషత్తు :-

**అంతశ్శరీరే నిహితో గుహాయామజ ఏకో నిత్యమస్య పృథివీ శరీరం యః పృథివీ-మంతరే సంచరన్యం పృథివీ న వేద, యస్యాఽఽపశ్శరీరం య ఆపోఽన్తరే సంచరన్య-మాపో న విదుః, యస్య తేజశ్శరీరం యస్తేజోఽన్తరే సంచరన్యం తేజో న వేద, యస్య వాయుశ్శరీరం యో వాయుమంతరే సంచరన్ యం వాయుర్న వేద, యస్యాఽహంకార శ్శరీరం యోఽహంకారమంతరే సంచరన్ యమహంకారో న వేద, యస్య చిత్తం శరీరం యశ్చిత్తమంతరే సంచరన్ యం చిత్తం న వేద, యస్యాఽవ్యక్తం శరీరం యోఽవ్యక్తమంతరే సంచరన్ యమవ్యక్తం న వేద, యస్యాఽక్షరం శరీరం యోఽక్షరమంతరే సంచరన్ య-మక్షరం న వేద, యస్య మృత్యుశ్శరీరం యో మృత్యుమంతరే సంచరన్ యం మృత్యు ర్న వేద, స ఏష సర్వభూతాంతరాత్మాఽపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః.**

(శరీరమధ్యమందలి దహరాకాశమందుండి సర్వసాక్షియై నిర్వికారుఁడై సర్వబుద్ధిప్రేరకుఁ

డై యుండునట్టి పరమాత్మకు భూమి మొదలగు నియమ్యశరీరములు తప్ప వేఱుశరీరములు లేవు. అట్టిశరీరముల నందియు వానికిఁ గూడ నంతరుఁడై యాశరీరములకు గోచరుఁడు గాక వానిని (ఆశరీరములను) దెలిసికొనుచు వానిని తమ నియమితవిషయములందుఁ బ్రవర్తింపఁ జేయునట్టి యంతర్యామియే నారాయణుఁడు. అనాది కర్మవాసనాపరంపరలచే వైషమ్య-నైర్ఘృణ్యములు లేక సకలభూతములను స్వస్వవ్యాపారములయందు నిర్వికారుఁడై ప్రవర్తింపఁ జేయుచు సర్వప్రేరకుఁడై యున్నాఁడు గనుక నంతర్యామి యని యెఱుంగవలయును. ప్రత్యగభిన్న-పరబ్రహ్మ రూపుఁడైన నారాయణుఁడే సకలతత్త్వాంతర్యామి, స్వయంప్రకాశచిద్రూపుఁడు, భేదత్రయవిహీనుఁ డనియు నెఱుంగవలయును. వృక్షమునకు వృక్షాంతరము సజాతీయ భేదము. శిలాదికము విజాతీయభేదము. శాఖాపత్రపుష్పాదులు స్వగతభేదము. ఇవి యెల్లరకును పల్లములే కనుక నీ లోకదృష్టాంతము చేతనే బ్రహ్మమునం దిట్టి భేదము లెవ్వియు లేవు. బ్రహ్మమునకు సజాతీయమైన బ్రహ్మము మఱియొకటి లేదు కాఁబట్టి బ్రహ్మమునకు సజాతీయభేదము లేదు. బ్రహ్మమునకు విజాతీయ మైనది మాయ (లేనిది) యది మిథ్యాపదార్థము కాఁబట్టి బ్రహ్మమునకు విజాతీయభేదముగూడ లేదు. బ్రహ్మమునకు సచ్చిదానందనిత్యశుద్ధాదులు స్వగతభేదము లున్న వనరాదు. అవి (ఆ సచ్చిదానందాదులు) అఖండైకరసబ్రహ్మస్వరూపములై విరుద్ధములై యనృత-జడదుఃఖాది మిథ్యాపదార్థములను వ్యావర్తింపుచు నఖండబ్రహ్మబోధకములు. కాఁబట్టి బ్రహ్మమునకు స్వగతభేదము సైతము లేదు. అట్టి నారాయణుఁడే **యపహతపాప్మ** యని భావము.)

గీత 13 అ. 33 శ్లో.

**శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యా - దాకాశం నోపలిప్యతే ।**
**సర్వత్రావస్థితో దేహే - తథాత్మా నోపలిప్యతే ॥**

(అన్నిటిని వ్యాపించియున్న యాకాశము సూక్ష్మమగుటవలన దేని నెట్లంటదో యట్లే సర్వశరీరములయం దుండు పరమాత్మ యాశరీరమముల చేతను, తద్గుణదోషములచేతను నంటఁ బడదు.)

ఉత్తరగీత 11-8

**శ్లో॥ ఆకాశవత్సూక్ష్మశరీరమాత్మా**
**న దృశ్యతే వాయువదంతరాత్మా ।**
**స బాహ్యాభ్యంతరనిర్మలాత్మా**
**జ్ఞానోల్కయా పశ్యతి చాంతరాత్మా ॥**

(ఆత్మ యాకాశమువలె సూక్ష్మశరీరము గలవాఁడు. అనఁగా అతీంద్రియుఁడు కాఁ

బట్టి కనఁబడఁడు. మఱియును, ఆత్మ వాయువువలెను సైతము కనఁబడఁడు అయినను, బాహ్యాభ్యంతరములయందు నిర్మలమైన స్వరూపము గలవాఁడును, అంతర్ముఖమైన చిత్తముకలవాఁడును నైన జీవుఁడు జ్ఞాన మను దీపముచే జీవబ్రహ్మైక్యమును జూచుచున్నాఁడు. అనఁగా నిర్వికల్పసమాధి గలవాఁడై స్వస్వరూపానుభవము కలవాఁ డగు చున్నాఁడు.)

అపరోక్షానుభూతి :-

**శ్లో॥ చైతన్యస్యైకరూపత్వాద్భేదో యుక్తో న కర్హిచిత్ ।**
**జీవత్వం చ మృషా జ్ఞేయం రజ్జౌ సర్పగ్రహో యథా ॥**

(చైతన్య మేకరూప మైయుండుటవలన నేస్థితియందును దానికి భేదము కల్పించుట యుక్తము కాదు. త్రాటియందు సర్పజ్ఞానమువలె జీవత్వము మిథ్య యని తెలియఁదగినది.)

నిరాలంబోపనిషత్ :-

**కిం బ్రహ్మ ... కా ప్రకృతిః? - కిం బ్రహ్మేతి హోవాచ : - మహదహంకార-పృథివ్యప్తేజోవాయ్వాకాశాత్మకత్వేన బృహద్రూపేణాండకోశేన కర్మజ్ఞానార్థరూపతయా భాసమానమద్వితీయమఖిలోపాధివినిర్ముక్తం తత్సకలశక్త్యుపబృంహితమనాద్యంతం శుద్ధం శివం శాంతం నిర్గుణమిత్యాదివాచ్యమనిర్వాచ్యం చైతన్యం బ్రహ్మ.**

**ప్రకృతిరితి చ :- బ్రహ్మణస్సకాశాన్నానావిచిత్రజగన్నిర్మాణసామర్థ్యకబుద్ధిరూప-బ్రహ్మ శక్తిరేవ ప్రకృతిః.**

(బ్రహ్మ మెయ్యది? ప్రకృతి యెయ్యది? అనుప్రశ్నలు వచ్చినపుడు బ్రహ్మ మెయ్యది యను ప్రథమప్రశ్నమున కియ్యది సమాధానము :-

మహత్తు, అహంకారము, పృథివి, అప్పు (జలము), తేజస్సు (అగ్ని), వాయువు, ఆకాశము అనువాని స్వరూపమును; స్థూలరూపమునునగు నండకోశముచేతఁ గర్మార్థరూపముగను జ్ఞానార్థరూపముగను దోఁచచుచున్నదియు, నద్వితీయమును, స్థూలసూక్ష్మాది సమస్తోపాధులచేతను విడువఁబడు నదియు, నా యా యుపాధ్యాదులసర్వశక్తుల కుపబృంహితంబును, ఆద్యంతములు లేనిదియు, శుద్ధము, శివము, శాంతము, నిర్గుణము మున్నగు శబ్దముల చేతఁ జెప్పఁబడునదియును, అనిర్వాచ్యము (ఇట్టిదని నిర్వచింప శక్యము కానిదియు) నగు చైతన్యము **బ్రహ్మము.**

ప్రకృతి యెయ్యది? యను ద్వితీయప్రశ్నమున కియ్యది సమాధానము:-

బ్రహ్మముయొక్క సాన్నిధ్యమువలన నానావిచిత్రములుగ నుండు జగత్తును నిర్మించు సమర్థత గలదియు, బుద్ధిరూపయునగు బ్రహ్మశక్తి యేది గలదో యదియే **ప్రకృతి.**)

ఉత్తరగీత - 2 అ,37,38,39,40 శ్లోకములు.

**ఏవం బ్రహ్మాండనిలయం తస్మిన్ దేహే ప్రతిష్ఠితమ్.**

(బ్రహ్మాండం బంతయును, నాదేహమందే కల్పింపఁబడెను.)

ప్రకృతిలయక్రమ మీక్రిందిశ్లోకములలోఁ జెప్పబడినది.

**శ్లో॥ బ్రహ్మాండరూపిణీ పృథ్వీ తోయమధ్యే ప్రలీయతే ।**
**అగ్నినా పీయతే తోయం వాయునా గ్రస్యతేఽనలః ॥**

**శ్లో॥ ఆకాశం తు పిబేద్వాయుం మనస్యాకాశమేవ చ ।**
**బుద్ధ్యహంకారచిత్తే చ క్షేత్రజ్ఞః పరమాత్మని ॥**

**శ్లో॥ తుర్యం చ తుర్యాతీతం చ శివస్థానమనామయమ్ ।**
**గ్రసేత్సమస్తమాత్మేతి ధ్యాయంశ్చ పరమాం గతిమ్ ॥**

(బ్రహ్మాండరూపమగు భూమి, ఉదకమందు లీన మగుచున్న దనియును, అగ్నియం దుదకము లీనమగుచున్న దనియును, వాయువునందు అగ్ని లీన మగుచున్న దనియును, ఆకాశము మనస్సునందు లీన మగుచున్న దనియును, మనస్సు బుద్ధియందు లీన మగుచున్న దనియు, బుద్ధి అహంకారమునందు లీన మగుచున్న దనియును, అహంకారము చిత్తమునందు లీనమగుచున్నదనియును, చిత్తము క్షేత్రజ్ఞునియందు లీన మగుచున్న దనియును, క్షేత్రజ్ఞుఁడు పరమాత్మయందు లీన మగుచున్నాఁ డనియును, పరమాత్మ తుర్యమునందు లీన మగుచున్నాఁ డనియును, తుర్యము అనామయమును తుర్యాతీతమునునైన శివస్థానమునందు లీన మగుచున్న దనియును, సర్వమును పరమాత్మయందు లీన మగుచున్న దనియును, అంతయును పరమాత్మ స్వరూపమే యనియును ధ్యానము చేయువాఁడు సర్వోత్తమమైన గతిని అనఁగా **మోక్షమును** పొందుచున్నాఁడు.)

గౌడపాదకారిక :- ఆగమప్రకరణము.

**శ్లో॥ అనాదిమాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే ।**
**అజమనిద్రమస్వప్నమద్వైతం బుధ్యతే తదా॥**

(జీవుఁ డెప్పుడు అనాదియగు మాయారూపమైన నిద్రనుండి మేలుకొను చున్నాఁడో యప్పుడే తత్త్వాగ్రహణరూపమైన నిద్రయును అన్యథా గ్రహణరూపమైన స్వప్నమును లేకపోవుటచేతనే జన్మాదులు లేని యద్వయస్వరూపమైన స్వయంప్రకాశమగు తుర్యాత్మను దెలిసికొను చున్నాఁడు.)

**శ్లో॥ ప్రపంచో యది విద్యేత నివర్తేత న సంశయః ।**
**మాయామాత్రమిదం ద్వైతమద్వైతం పరమార్థతః ॥**

(ప్రపంచ మనుపేరుగల యీద్వైతమున్నయెడల దానికిఁ గారణము లగు తత్త్వా-గ్రహణాన్యథా గ్రహణములయొక్క నాశముచేతనే యది రజ్జువు నందు సర్పభ్రమవలెనే నశించు చున్నది. ఈ ద్వైతము రజ్జుసర్పమువలెను, ఇంద్రజాలికుని మాయవలెను కేవలము మాయారూప మైయున్నది. యథార్థముగా నిది యంతయు నద్వయస్వరూపమగు పరమాత్మగానే యున్నది.)

**శ్లో॥ వికల్పో వినివర్తేత కల్పితో యది కేనచిత్ ।**
**ఉపదేశాదయం వాదో జ్ఞాతే ద్వైతం న విద్యతే ।**

(ఎవనిచేతనైనను ప్రపంచాదిభ్రాంతిరూపమగు ద్వైతము కల్పితమైన దాయెనేని రజ్జువునందు సర్పాదిభ్రమవలెనే యథార్థజ్ఞానముచేత నివర్తించుచున్నది. గురూపదేశనిమిత్తకమైన గురుశిష్యాదిభేదము జ్ఞానముకంటెఁ బూర్వము రజ్జుసర్పమువలెనే కల్గి గురూపదేశకార్యమైన జ్ఞానము తెలియఁబడెనేని మరల లేనిదై సర్వము నద్వయస్వరూప మగు పరిపూర్ణ మైనయాత్మగానే యున్నది.)

హరిమీడేస్తవము :-

**శ్లో॥ మూర్తామూర్తే పూర్వమపోహ్యాథ సమాధౌ**
**దృశ్యం సర్వం నేతి చ నేతీతి విహాయ ।**
**చైతన్యాంశే స్వాత్మని సంతం చ విదుర్యం**
**తం సంసారధ్వాంతవినాశం హరిమీడే ॥**

(మొదట చిత్తమునకు మంచి యునికిపట్టయిన చిన్మాత్రమైన (తమకంటె వేఱుగాని) శ్రీవిష్ణువునం దారోపింపఁబడియుండు దృశ్యాదృశ్యముల నాత్మ కాదని నిషేధించి సద్రూపుఁడై మిగిలియున్న యెద్దానిని శ్రీహరి యని తెలిసికొనుచున్నారో, చీఁకటివంటి సంసారాజ్ఞానమును బోఁగొట్టునట్టి యాపరబ్రహ్మమైన హరిని స్తుతించుచున్నాను.)

**శ్లో॥ ఓతం ప్రోతం యత్ర చ సర్వం గగనాంతం**
**యోఽస్థూలానణ్వాదిషు సిద్ధోఽక్షరసంజ్ఞః ।**
**జ్ఞాతాఽతోఽన్యే నేత్యుపలభ్యో నచ వేద్య-**
**స్తం సంసారధ్వాంతవినాశం హరిమీడే ॥**

(ఏ శ్రీవిష్ణువునందు అవ్యాకృతాకాశపర్యంతమైన యీ సమస్తప్రపంచమును పడుగునుం-బేకయుంబోలెఁ గల్పింపఁబడియున్నదో, ఏ శ్రీహరి "**అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘమలోహిత-**

**మస్నేహ**" మిత్యాది యుపనిషద్వాక్యములయందు అక్షరస్వరూపుఁ డని ప్రకటింపఁబడియున్నాఁడో, ఏశ్రీహరికంటె వేఱుజ్ఞాత లేఁడని తెలిసినను ఏశ్రీహరివిషయములవలెఁ దెలియఁదగినవాఁడు కాఁడో సంసారాంధకారవినాశకుఁడైన యాశ్రీహరిని స్తుతించుచున్నాను.)

**శ్లో॥ తావత్సర్వం సత్యమివాభాతి యదేత-**
**ద్యావత్సోఽస్మీత్యాత్మని యోఽజ్ఞో నహి దృష్టః ।**
**దృష్టే యస్మిన్ సర్వమసత్యం భవతీదం**
**తం సంసారధ్వాంతవినాశం హరిమీడే ॥**

(ఏ శ్రీహరియే తానని తెలియునంతపర్యంతము సమస్తప్రపంచము సత్యముగాఁ బ్రకాశించునో, ఏ శ్రీహరి తనకంటె నన్యము కాఁడని తెలియఁగనే యీసమస్తము మాయ మైపోవునో యట్టి సంసారాంధకారవినాశకుఁడైన శ్రీహరిని స్తుతించుచున్నాను.)

"**అన్నా ద్రేతః**" - పంచాగ్ని విద్యావివరణము, బృహదారణ్యకము, vi, 1,2.

ప్రథమబ్రాహ్మణము :-

**ఓం యో హవై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ స్వానాం భవతి ప్రాణో వై జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ స్వానాం భవత్యపి చ యేషాం బుభూషతి య ఏవం వేద.**

(ఓం. ఎవఁడు ప్రాణమును జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వగుణయుక్తముగఁ దెలిసికొనుచున్నాఁడో వాఁడు తనతోఁ జేరినవారిలో జ్యేష్ఠుఁడును శ్రేష్ఠుఁడునై యుండును. (ప్రాణమును జ్యేష్ఠ మనుటకుఁ గారణ మే మనఁగా - చక్షురాదీంద్రియములకంటెను బ్రాణము మొదటిది. ఆదియందు ప్రాణము లేనియెడల శుక్లశోణితములకు పిండత్వము సిద్ధింపదు. కావునఁ బ్రాణమే మొదటిది.) జ్యేష్ఠత్వమును శ్రేష్ఠత్వమును గలుగవలయు నని కోరి ప్రాణము నుపాసించువానికంటె నట్టిటింగినవాఁడు శ్రేష్ఠుఁడు. (అందుచేత శ్రేష్ఠత్వమును సిద్ధించినది.)

ద్వితీయబ్రాహ్మణము :-

**శ్వేతకేతుర్హ వారుణేయః పంచాలానాం పరిషదమాజగామ, స ఆజగామ జైబలిం ప్రవాహణం పరిచారయ మాణం తముదీక్ష్యాఽభ్యువాద కుమారా 3 ఇతి. స భో 3 ఇతి ప్రతిశుశ్రావాఽనుశిష్టో న్వసి పిత్రేత్యోమితి హోవాచ.**

(ఈబ్రాహ్మణములో కర్మద్వారా పంచాగ్నిదర్శనము ఉత్తరమార్గమును పొందుటకు సాధన మని విధింపఁబడుచున్నది. విద్వాంసుఁడును, అరుణపుత్త్రుఁడునగు శ్వేతకేతువు ప్రవాహజైబలి యనురాజుకడ కేఁగి యాసంస్థానవిద్వాంసులను జయింపఁదలంచెను. ఆరాజు (ఈతనివిద్వద్గర్వ-

ముని మునుపే తెలిసికొన్నవాఁడై యితనిని లొంగఁదీయుతలంపుతోఁ గుమారా 3 యని సంబోధించెను. దానికి శ్వేతకేతువు ప్రభో 3 (ఓ) అని పలికెను.

రాజు – తండ్రిపంపున వచ్చితివా యేమి?

శ్వేత – ఔను. సంశయముల నడుగవచ్చును.

రాజు – (అయిదు ప్రశ్నలు శ్వేతకేతువు నడిగెను.)

అవి యేవి యనఁగా :-

**... ... వేత్థో యతిథ్యామాహుత్యాం హుతాయామాపః పురుషవాచో భూత్వా సముత్థాయ వదంతీ 3 ఇతి... ...**

1. గతించినవారును, ఒక్క నాడీ మార్గముగాఁ బోవువారు నగుప్రజలలోఁ గొంద ఱొకమార్గమును గొందఱు మఱొకమార్గమును (ఇట్లు వ్యత్యాసముగా) పొందుచున్నారు గదా! ఆ విషయము నీకుఁ దెలియునా?

2. అట్లు పోవువారు మరల నెట్లీలోకమునకు వచ్చెదరు?

3. ఇ ట్లప్పుడప్పుడు మరణము నొందిన యనేకులచే నాయూర్ధ్వలోకము పూర్తి కాలే దని తెలియునా?

4. ఎన్ని యాహుతు లొనర్చిన యెడల జలము పురుషాకృతి నొంది మాటలాడునో తెలియునా?

5. మనుష్యులకు గతించినమీఁదట దేవయాన మనియు, పితృయాన మనియు రెండు మార్గములు గల వనియు, నామార్గములమూలమున నన్నియుఁ బోవుచున్న వనియు, ఆమార్గములు మాతయగు నీభూమికిని పిత యగు స్వర్గమునకును నడుమ నున్న వనియు (అనఁగా నివి యండకపాలములకు లోపలనుండు మార్గములు గాని ఆత్యంతికాఽమృతత్వము నిచ్చెడిమార్గములు గా వని) వినియున్నాముగదా! ఆ మార్గములప్రతిపదము (అనఁగా) వానిం బొందుటకు సాధనమును (అనఁగా) ఏకర్మము నొనర్చినచో నవి సిద్ధించునదియుఁ దెలియునా?

"నీ వడిగినప్రశ్నలలో దేనికిని బదులు నాకుఁ దెలియదు" అని శ్వేతకేతువు రాజునకుఁ జెప్పె. అనంతరము తండ్రియొద్దకుం జని యిచ్చటి వృత్తాంత మంతయు సవిస్తరముగఁ దండ్రికిం జెప్పె. ఈప్రశ్నములకు బదులు నాకునుం దెలియదు. మన మిరువుర మారాజుకడ కేఁగి యడుగుదమని తండ్రి చెప్పఁగా శ్వేతకేతువు తండ్రినిమాత్రము పొమ్మని చెప్పెను. తండ్రి యగునారుణి పిమ్మట రాజుకడకుం జనఁగా నారాజు మిక్కిలి గౌరవించి, "ఇంకను, వలసినదాని నడిగిన నిచ్చెదను" అనెను. అంతనారుణి 'నాకుమారుని నడిగినయైదుప్రశ్నములకు నుత్తరము చెప్పవలయును.' అని యడుగ రాజు 'ఇవి దేవసంబంధమైనవి. వీనిని నడుగవలదు. మానుష సంబంధమైనదాని నడుగుము' అని చెప్పెను.

ఆరుణి – నాకు బంగారము మున్నగు వస్తువు లక్కఱలేదు. వాని కొఱకు రాలేదు. నే నడిగినదానిని జెప్పుము.

రాజు – అట్లయిన శాస్త్రప్రకారముగ (గురుశిష్యక్రమముగ) నన్నడుగవలయును.

ఆరుణి – నీవు గురుఁడవు. నేను శిష్యుఁడను. ఉపదేశింపుము. అని రాజును గోరెను.

రాజు – ఓ ఆరుణీ! కోపింపకుము. మాతాతయెడల మీతాత యెట్టి ప్రీతి నుంచెనో యట్టిప్రీతి నీవు నాయం దుంచవలయును. ఇపుడు నీ కుపదేశించువిద్యను పూర్వ మే బ్రాహ్మణునకును జెప్పలేదు. తెలియనే తెలియదు. ఇది క్షత్రియులకుమాత్రమే పరంపరగాఁ దెలియును.

గీత 4 అ. 1,2 శ్లో. చూడుఁడు – శ్రీభగవా నువాచ.

**శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।**
**వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥**
**ఏవం పరంపరాప్రాప్తమిమం రాజర్షయో విదుః.**

అట్టిదానిని నీకుఁ జెప్పెదను.

**అసౌ వై లోకోఽగ్నిర్గౌతమ! తస్యాదిత్య ఏవ సమిద్రశ్మయో ధూమోఽహరర్చి-ర్దిశోఽఙ్గారా అవాంతరదిశో విస్ఫులింగా స్తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవాశ్శ్రద్ధాం జుహ్వతి తస్యా ఆహుత్యై సోమో రాజా సంభవతి.**

(ప్రవాహణమహారాజు శ్వేతకేతువును తా నడిగినప్రశ్నలలో నాల్గవదియగు "**వేత్థో యతిథ్యామాహుత్యాగ్ హుతాయా మాపః పురుషవాచో భూత్వా సముత్థాయ వదంతీ**" అను ప్రశ్న కుత్తరమమును, తక్కినప్రశ్నలయొక్క నిజమును నిర్ణయించుటకు ముందుగా చెప్పుచున్నాఁడు.)

(ఈలోకము (స్వర్గలోకము) అగ్ని. (ఈలోకము నగ్ని యని భావింపవలయును.) వాని కాదిత్యుఁడు సమిత్తు – కట్టెలు. దానికిఁ గిరణములు పొగ. అహస్సు (పగలు) జ్వాల. దిక్కులు అంగారములు (నిప్పు). విదిక్కులు విస్ఫులింగములు (అగ్నికణములు). ఇట్టి యగ్నియందు ఇంద్రాదిదేవతలు శ్రద్ధను (జలమును) హోమము చేసెదరు. ఆయాహుతినుండి సోమరాజు (చంద్రుఁడు) కలుగుచున్నాఁడు.)

**పర్జన్యో వా అగ్నిర్గౌతమ! తస్య సంవత్సర ఏవ సమిదభ్రాణి ధూమో విద్యుదర్చి-రశనిరంగారా హ్రాదునయో విస్ఫులింగాస్తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవా స్సోమం రాజానం జుహ్వతి తస్యా ఆహుత్యై వృష్టిస్సంభవతి.**

(పర్జన్యుఁడు (వర్షాభిమానిదేవత యగు నింద్రుఁడు) అగ్ని (ద్వితీయాగ్ని). దీనికి సంవత్సరము (కాలము) సమిత్తు. మేఘములు పొగ.

| సంఖ్య | అగ్ని | సమిత్తు | ధూమః (పొగ) | జ్వాల | అంగారాః (నిప్పులు) | విస్ఫులింగాః (అగ్నికణములు) | హోమః | జననమ్ |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | అసౌ లోకః (స్వర్గలోకః) | ఆదిత్యః (సూర్యుఁడు) | సూర్య కిరణములు | పగలు | దిక్కులు | అవాంతరదిశః విదిక్కులు | శ్రద్ధ అను జలము | సోమరాజు (చంద్రుఁడు) |
| 2. | పర్జన్యుఁడు (ఇంద్రలోకము లేక చంద్రలోకము) | సంవత్సరః కాలము | మేఘము | విద్యుత్ (మెఱుము) | పిడుగు | ఉఱుములు (మేఘగర్జనములు) | సోమరాజు | వర్షము |
| 3. | అయం లోకః (భూలోకము) | భూమి | పార్థివాగ్ని (గంధకము చెకుముకి) | రాత్రి | చంద్రుఁడు | నక్షత్రములు | వర్షము | అన్నము |
| 4. | పురుషుఁడు (మనుజుఁడు) | తెఱవఁబడిన నోరు | శ్వాసము (ప్రాణము) | నోరు (శబ్దము మాటలు) | కన్ను | చెవి | అన్నము | తేజస్సు |
| 5. | స్త్రీ | ఉపస్థము | లోమాని (వెంద్రుకలు) | యోని (గర్భకోశము) | మిథునకర్మము (గర్భాధానము) | అభినందః (సంయోగానందము) | రేతస్సు | పురుషుఁడు |

| సంఖ్యా | అగ్ని | సమిత్తు | ధూమః (పొగ) | జ్వాల | అంగారాః (నిప్పులు) | విస్ఫులింగాః (అగ్నికణములు) | హోమః | జననమ్ |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- | --- |
| 6. | నిజాగ్ని | నిజేంధన ములు | నిజ ధూమము | నిజ జ్వాల | నిజాంగారము | నిజ స్ఫులింగములు | పురుషుఁడు | పురుష ప్రకాశము (ఆత్మ) |
| | ఇందు 1 మొదలుకొని 5 వఱకును కల్పితాగ్ను లనియు 6వది నిజాగ్ని యనియు నెఱుంగ వలయును | | | | | | | పింగళనాడి మూలమున బ్రహ్మలోకమునకుఁ బోయి క్రమముక్తిని బొందును.) |
| | ఇదే విషయము ఛాందోగ్యంబునందలి 5వ ప్రపాఠకంబున మొదటి పది (10) ఖండములలోఁ జెప్పఁబడి యున్నది. | | | | | | | |

మెఱుము జ్వాల. పిడుగు నిప్పులు. ఉఱుములు విస్ఫులింగములు. ఈయగ్నియందు దేవతలు (ప్రాణములు) సోమరాజును హోమముచేసెదరు. అందుండి వర్షము కలుగుచున్నది. చంద్రునియందుండుజలము సూర్యకిరణములచేత నాకర్షింపఁబడి మేఘములై వాన కురియుచున్నది. అనఁగాఁ బైని జెప్పిన కర్మపరిపాకము ప్రాణములతోఁగూడ వర్షించుచున్నవి.)

**అయం వై లోకోఽగ్ని ర్గౌతమ! తస్య పృథివ్యేవ సమిదగ్నిర్ధూమో రాత్రిరర్చి-శ్చంద్రమా అంగారా నక్షత్రాణి విస్ఫులింగాస్తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవా వృష్టిం జుహ్వతి తస్యా ఆహుత్యా అన్నం సంభవతి.**

(ఈభూలోకము తృతీయాగ్ని. భూమి సమిత్తు. పార్థివాగ్ని ధూమము. రాత్రి జ్వాల. చంద్రుఁడు నిప్పు. నక్షత్రములు విస్ఫులింములు. ఈయగ్నియందు దేవతలు (ప్రాణములు) వర్షమును హోమము చేసెదరు. అందుండి యన్నము కలుగుచున్నది. (వర్షమువలన ధాన్యాదులు కలుగుటం బట్టి అన్నము లభించుచున్నది.) పైని చెప్పినకర్మపరిపాకము ప్రాణముతో నన్నమగుచున్నది.)

**పురుషో వా అగ్నిర్గౌతమ! తస్య వ్యాత్తమేవ సమిత్ ప్రాణో ధూమో వాగర్చిశ్చక్షు-రంగారాశ్శ్రోత్రం విస్ఫులింగాస్తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవా అన్నం జుహ్వతి తస్యా ఆహుత్యై రేతస్సంభవతి.**

(పురుషుఁడు (మనుజుఁడు) చతుర్థాగ్ని. వాని తెఱవఁబడిననోరు సమిత్తు. ప్రాణము ధూమము. మాటలు జ్వాల. నేత్రము లగ్ని. శ్రోత్రములు విస్ఫులింగములు. ఈయగ్నియందు దేవతలు (ప్రాణములు) అన్నమును హోమము చేయుచున్నారు. అందువలన రేతస్సు గలుగుచున్నది. (అనఁగా బైని చెప్పినకర్మపరిపాకము రేత స్సగుచున్నది.)

**యోషా వా అగ్నిర్గౌతమ! తస్యా ఉపస్థ ఏవ సమిల్లోమాని ధూమో, యోని రర్చిర్యదంతః కరోతి తేఽంగారా అభినందా విస్ఫులింగాస్తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవా రేతో జుహ్వతి, తస్యా ఆహుత్యై పురుషస్సంభవతి, స జీవతి యావజ్జీవత్యథ యదా మ్రియతే.**

(స్త్రీ పంచమాగ్ని, ఉపస్థము సమిత్తు, వెంద్రుకలు ధూమము, యోని జ్వాల, మిథునకర్మము నిప్పు, అందువలనఁ గల్గు నానందము విస్ఫులింగములు. ఈ యగ్ని యందు దేవతలు (ప్రాణములు) రేతస్సును హోమము చేసెదరు. అందువలనఁ బురుషుఁడు కలుగు-చున్నాఁడు. ఇట్లు పుట్టినవాఁడు భూమియందు వాని యాయుఃపర్యంతము జీవించుచున్నాఁడు. వాఁడు గతించి నపుడు.)

**అథైనమగ్నయే హరంతి తస్యాగ్నిరేవాగ్నిర్భవతి సమిత్సమిద్ధూమో ధూమోఽర్చి-**

**రంగారా అంగారా విస్ఫులింగా విస్ఫులింగాస్తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవాః పురుషం జుహ్వతి, తస్యా ఆహుత్యై పురుషో భాస్వరవర్ణస్సంభవతి.**

(శరీరపతనానంతరము శవమును దహించుటకై కొనిపోయెదరు. (ఋత్విక్కులై పుత్త్రాదులు శవమును అగ్నియందు హోమము చేయుటకు శ్మశానమునకుఁ గొనిపోయెదరు.) ఆయగ్ని నిజాగ్నియె. (మున్ను చెప్పినట్లు కల్పితాగ్ని కాదు.) అట్లే ధూమము, జ్వాల, అంగారము, విస్ఫులింగము ఇవి నిజమైనవి. నిజాగ్ని యందే పురుషుని హోమముచేసెదరు. అందుండి పురుషుఁడు ప్రకాశముగలవాఁ డగుచున్నాఁడు.)

## (7) సూత్రము. ఞ మ ఙ ణ నమ్

### (17) కాశికా

**శ్లో॥ శబ్దస్పర్శౌ రూపరసగంధాశ్చ ఞమఙణనమ్ ।**
**వ్యోమాదీనాం గుణా హ్యేతే జానీయాత్సర్వవస్తుషు ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** శబ్దస్పర్శౌ = శబ్దమును, స్పర్శమును, రూపరసగంధాశ్చ = రూపము, రసము, గంధమును, ఞమఞణనమ్ = ఞ, మ, ఙ, ణ, న అనునవి. అనఁగా ఞ = శబ్దము, మ = స్పర్శము, ఙ = రూపము, ణ = రసము, న = గంధము – అని యెఱుంగునది. ఏతే = ఈ శబ్దాదులు, సర్వవస్తుషు = సకల పదార్థములయందు (నుండునట్టి,) వ్యోమాదీనామ్ = ఆకాశాదిపంచమహాభూతములయొక్క, గుణాః = గుణములు (అని), జానీయాత్ = ఎఱుంగ వలయును.

**తత్త్వవిమర్శినీ :** తతః పృథివ్యాదీనాం కారణత్వేన స్థితానాం తన్మాత్రాణా– ముత్పత్తిక్రమమాహ – శబ్దస్పర్శావితి. వ్యోమాదీనాం గుణానేకైకకారణే తాన్ జానీయా– త్సర్వవస్తుషు ఇతి షట్త్రింశద్వర్ణాః సర్వజగత్కారణభూతస్య సర్వరూపపురుషస్య సర్వే గుణా అభవన్ననునాసికా ఇత్యర్థః.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** పృథివ్యాదిస్థూల భూతములకు కారణములైన పంచతన్మాత్రల యుత్పత్తిక్రమమును చెప్పుచున్నాఁడు – శబ్దస్పర్శౌ ఇత్యాదిచే. ఈగుణములు క్రమముగా ఆకాశాదిభూతములగుణము లనియు, వానికే కారణము లనియు, ఇవి అన్ని వస్తువులలోను నుండు ననియు నెఱుంగునది. ముప్పదియాఱు వర్ణములలో సమస్తజగత్తులకును కారణభూతుఁ డును సమస్తజగద్రూపుఁడును ఐన పురుషునియొక్క సమస్తగుణములు ననునాసికములైనవి అని యర్థము.

విశేషాంశములు :– ఇరువదినాలు గనాత్మతత్త్వము లెవ్వి యనఁగా జ్ఞానేంద్రియము

లైదును, కర్మేంద్రియములు లైదును, జ్ఞానేంద్రియతన్మాత్ర లైదును, ప్రాణాదు లయిదును, అంతః కరణములు నాలుగును (ఈయిరువది నాలుగును అనాత్మతత్త్వములు).

1. జ్ఞానేంద్రియములు 5 : 1. శ్రోత్రము (చెవి), 2. త్వక్కు (చర్మము), 3. చక్షుస్సు (కన్ను), 4. జిహ్వ (నాలుక), 5. ఘ్రాణము (ముక్కు), వీనికి జ్ఞానేంద్రియపంచక మని పేరు.

2. కర్మేంద్రియములు 5 : 1. వాక్కు (నోరు), 2. పాణి (చేతులు), 3. పాద (కాళ్లు), 4. పాయువు (మలవిసర్జనస్థానము), 5. ఉపస్థము (మూత్రవిసర్జనస్థానము), వీనికిఁ గర్మేంద్రియపంచక మని పేరు.

3. జ్ఞానేంద్రియతన్మాత్రలు 5 : 1. శబ్దము, 2. స్పర్శము, 3. రూపము, 4. రసము, 5. గంధము, వీనికిఁ బంచతన్మాత్ర లని పేరు.

4. ప్రాణములు 5 : 1. ప్రాణము, 2. అపానము, 3. వ్యానము, 4. ఉదానము, 5. సమానము, వీనికిఁ బంచప్రాణము లని పేరు.

5. అంతఃకరణమములు 4 : 1. మనసు, 2. బుద్ధి, 3. చిత్తము, 4. అహంకారము, ఈనాల్గింటిని అంతఃకరణచతుష్టయ మందురు. వీనితో హృదయము చేర నంతఃకరణపంచక మని కొందఱందురు.

**జ్ఞానేంద్రియములు**

| అధ్యాత్మము | అధిభూతము (తన్మాత్రలు) | అధిదైవతము |
|---|---|---|
| 1. శ్రోత్రము | శబ్దము | దిక్కు |
| 2. త్వక్కు | స్పర్శము | వాయువు |
| 3. చక్షుస్సు | రూపము | సూర్యుఁడు |
| 4. జిహ్వ | రసము | వరుణుఁడు |
| 5. ఘ్రాణము | గంధము | అశ్వినులు |

**కర్మేంద్రియములు**

| అధ్యాత్మము | అధిభూతము (తన్మాత్రలు) | అధిదైవతము |
|---|---|---|
| 1. వాక్కు | వచనము | అగ్ని |
| 2. పాణి | ఆదానము | ఇంద్రుఁడు |
| 3. పాదము | గమనము | విష్ణువు |
| 4. పాయువు | విసర్గము | మృత్యువు |
| 5. ఉపస్థము | ఆనందము | బ్రహ్మ |

**అంతఃకరణ చతుష్టయము**

| అధ్యాత్మము | అధిభూతము (తన్మాత్రలు) | అధిదైవతము |
|---|---|---|
| 1. మనస్సు | మననము | చంద్రుఁడు |
| 2. బుద్ధి | నిశ్చయము | బృహస్పతి |
| 3. చిత్తము | చింతనము | క్షేత్రజ్ఞుడు |
| 4. అహంకారము | అభిమానము | రుద్రుఁడు |

గీత. 2 అ.14 శ్లో :-

**శ్లో॥ మాత్రాస్పర్శాస్తు కౌంతేయ! శీతోష్ణసుఖదుఃఖదాః ।**
**ఆగమాపాయినోఽనిత్యాస్తాంస్తితిక్షస్వ భారత! ॥**

(ఓయర్జునుఁడా! పంచతన్మాత్రలవలనఁ బుట్టిన శ్రోత్రాదీంద్రియములయొక్క శబ్దాదివిషయములు చలి, వేఁడి మొదలగు సుఖదుఃఖములను గలుగఁజేయునవిగాను, సంయోగవియోగములు గలిగినవిగాను, ఒకప్పుడుండి మఱియొకప్పుడు లేకుందునవిగాను, అస్థిరములుగాను ఉన్నవి. కాఁబట్టి యో యర్జునుఁడా! ఆ శీతోష్ణాదులను సహింపుము.)

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు జీవభావనవలనఁ గలుగునవి యని యెఱుంగ వలయును. తన్మాత్ర లనఁగా జీవాంతర్గతశక్తులు.

జ్ఞానేంద్రియములు పుణ్యపాపములను చేర్చుటకుఁగాని తగ్గించుటకుఁ గాని కారణము లగుచున్నవి.

హరిమీడే స్తవము :- 27,8,15,14 శ్లోకములు.

**శ్లో॥ క్షేత్రజ్ఞత్వం ప్రాప్య విభుః పంచముఖైర్యో**
**భుఙ్క్తేఽజస్రం భోగ్యపదార్థాన్ ప్రకృతిస్థః ।**
**క్షేత్రేక్షేత్రేఽప్స్వింద్రువదేకో బహుధాఽఽస్తే**
**తం సంసారధ్వాంతవినాశం హరిమీడే ॥**

(సర్వవ్యాపకుఁడైన యేశ్రీహరి యవిద్యాతత్కార్యములయందుఁ బ్రతిబింబరూపుఁడుగా నుండి జీవభావము నొంది పంచేంద్రియములచేత శబ్దాది విషయముల నెల్లప్పుడు ననుభవించు చున్నాఁడో, ఒక్కఁడైన యేశ్రీహరి ప్రతిశరీరాంతఃకరణోపాధులందును అనేకపాత్రములయందలి యుదకము లందుఁ జంద్రునివలె ననేకవిధములుగ నున్నాఁడో సంసార మను చీఁకటిని పోఁ గొట్టువాఁడైన యా శ్రీహరిని స్తుతించుచున్నాను.)

**శ్లో॥ మాత్రాతీతం స్వాత్మవికాసాత్మవిబోధం**
**జ్ఞేయాతీతం జ్ఞానమయం హృద్యుపలభ్య ।**
**భావగ్రాహ్యానందమనన్యం చ విదుర్యం**
**తం సంసారధ్వాంతవినాశం హరిమీడే॥**

(ఇంద్రియగోచరము కానిదియు, ప్రత్యగాత్మస్వరూపమువలనఁ గలిగినవికాసముతోఁ గూడిన యంతఃకరణవిశేషజ్ఞానము కలదియు, జ్ఞేయముల కన్నిటికిని బైదియు, జ్ఞానస్వరూపమును నైనదేనిని హృదయమునందుఁ జూచి జ్ఞానులు కల దని తెలిసికొనఁదగినదానినిగాను, ఆనంద-మమునుగాను, వస్త్వంతరరహితముగాను నెఱుఁగుచున్నారో, సంసార మను నంధకార మును బోఁగొట్టునట్టివాఁ డైన యా హరిని స్తుతించుచున్నాను.)

**శ్లో॥ పశ్యఞ్ చ్ఛృణ్వన్నత్ర విజానన్ రసయన్ సం-**
**జిఘ్రన్ బిభ్రద్దేహమిమం జీవతయేత్థమ్ ।**
**ఇత్యాత్మానం యం విదురీశం విషయజ్ఞం**
**తం సంసారధ్వాంతవినాశం హరిమీడే ॥**

(జీవభావముచే దేహమును ధరించుచుఁ జూచుచు వినుచు బుద్ధిచేత నిశ్చయించుచు రుచిచూచుచు నాఘ్రాణించుచు విషయములను దెలిసికొనునట్టితమ్ము ఏ శ్రీహరినిగా మహాపురుషులు దెలిసికొనుచున్నారో సంసారధ్వాంతవినాశకుఁడైన యా హరిని స్తుతించుచున్నాను.)

**శ్లో॥ సర్వత్రైకః పశ్యతి జిఘ్రత్యథ భుఙ్క్తే**
**స్పృష్టా శ్రోతా బుధ్యతి చేత్యాహురిమం యమ్ ।**
**సాక్షీ చాస్తే కర్తృషు పశ్యన్నితి చాన్యే**
**తం సంసారధ్వాంతవినాశం హరిమీడే ॥**

(బ్రహ్మాదిస్థావరాంతములైన సమస్తకార్యకారణసంఘాతములందును బ్రవేశించిన దై వాస్తవముగా నొక్కటే యైన ననేకముగా విభక్తమై చూచుచున్నాఁడు, ఆఘ్రాణించుచున్నాఁడు, భుజించుచున్నాఁడు, స్పృశించుచున్నాఁడు, వినుచున్నాఁడు, తెలిసికొనుచున్నాఁడు అని అజ్ఞానుల చేతను, ఆలాగే కార్యకారణోపాధులు తమతమకార్యములు చేయుచుండఁగా వాని కెల్ల సాక్షియై తాను దేనికిని కర్త కాకయున్నాఁడని జ్ఞానులచేతను, ఏ యపరోక్షానుభూయమానమైన బ్రహ్మము చెప్పఁబడుచున్నదో సంసారమను చీఁకటిని పోఁగొట్టువాఁడైన యా హరిని స్తుతించుచున్నాఁ డను.)

గౌడపాదకారిక, ఆగమప్రకరణము :- 16,17,28,29.

**శ్లో॥ అనాదిమాయయా సుప్తో - యదా జీవః ప్రబుధ్యతే ।**
**అజమనిద్రమస్వప్న - మద్వైతం బుధ్యతే తదా ॥**

(తత్త్వాగ్రహణరూపమైన (వస్తువు తత్త్వమును దెలియకయుండుట) బీజాత్మకమగు నిద్రచేతను, అన్యథాగ్రహణలక్షణ మగు (ఒకవస్తువును వేఱుగ గ్రహించుట) అనాదికాల ప్రవృత్తమును మాయాలక్షణము నగు నాతండ్రి, నాపుత్త్రుఁడు, నాపశువులు, నాక్షేత్రము, నేను వీనికి ప్రభువ ననెడి స్వప్నముచే జాగ్రత్స్వప్నములు రెంటియందును సర్వమును జూచుచున్న జీవుఁ డెప్పు డీమాయారూపమగు నిద్రనుండి మేలుకొనుచున్నాఁడో యప్పుడే తత్త్వాగ్రహణరూపమైన నిద్రయు, నన్యథాగ్రహణరూపమైన స్వప్నమును లేక పోవుటచేతనే జన్మాదులు లేని యద్వయస్వరూపమును స్వయంప్రకాశము నగు తుర్యాత్మను దెలిసికొనుచున్నాఁడు.)

**శ్లో॥ ప్రపంచో యది విద్యేత నివర్తేత న సంశయః ।**
**మాయామాత్రమిదం ద్వైతమద్వైతం పరమార్థతః ॥**

(ప్రపంచ మనుపేరుగల యీద్వైత మున్న యెడల దానికిఁ గారణము లగు తత్త్వా-గ్రహణాన్యథాగ్రహణములయొక్క నాశముచేతనే యది రజ్జువు నందు సర్పభ్రమవలె నశించుచున్నది. ఈ ద్వైతము రజ్జుసర్పమువలెను, ఐంద్రజాలికునిమాయవలెను, కేవలము మాయారూప మైయున్నది. యథార్థముగా నిది యంతయు సద్వయస్వరూప మగు పరమాత్మగానే యున్నది.)

**శ్లో॥ ప్రణవం హీశ్వరం విద్యా - త్సర్వస్య హృది సంస్థితమ్ ।**
**సర్వవ్యాపినమోంకారం - మత్వా ధీరో న శోచతి ॥**

(జనుఁడు స్మరణజ్ఞానమునకు స్థానమైన హృదయమునందున్న యీశ్వరుని ఓంకారముగాఁ దెలిసికొనవలయును. ఇట్లు సర్వవ్యాపకమైన యోంకారమును దెలిసికొనిన జ్ఞాని శోకనిమిత్తమైన యజ్ఞానాదులనాశమువలన దుఃఖింపఁడు.)

**శ్లో॥ అమాత్రోఽనంతమాత్రశ్చ ద్వైతస్యోపశమశ్శివః ।**
**ఓంకారో విదితో యేన స మునిర్నేతరో జనః ॥**

(ఓంకారమును ఆకారాదిమాత్రలును, విశ్వాదిపాదములును లేనటువంటి సమస్త-ద్వైతోపశమముగల పరమమంగళస్వరూపమునుగఁ దెలిసికొనినవాఁడే పరమార్థతత్త్వమును మననము చేయునట్టి మహర్షి యగును కాని యన్యుఁడు కాఁజాలఁడు.)

## (8) సూత్రము. ఝ భఞ్

### (18) కాశికా.

**శ్లో॥ వాక్పాణీ చ ఝభ ఞ్ఞాసీ ద్విరాడ్రూపచిదాత్మనః ।**
**సర్వజంతుషు విజ్ఞేయం స్థావరాదౌ న విద్యతే ॥**
**వర్గాణాం తుర్యవర్ణా యే కర్మేంద్రియమయా హి తే ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** సర్వజంతుషు = సకలప్రాణులయం దుండునట్టివియు, ఝభఞ్ = ఝకారభకారస్వరూపములు నగు, వాక్పాణీ = వాగింద్రియ పాణీంద్రియములు, విరాడ్రూపచిదాత్మనః = విరాడ్రూపుఁడగు శివునియొక్క (వాగింద్రియపాణీంద్రియసముదాయము) ఆసీత్ = ఆయెను. స్థావరాదౌ = వృక్షములు మొదలగువానియందు, న విద్యతే = (చిదాత్మయొక్క, వాక్పాణిసముదాయము) లేదని, విజ్ఞేయమ్ = ఎఱుంగనగును. వర్గాణాం = వర్గములయొక్క తుర్యవర్ణాః = నాల్గవవర్ణములు (ఘ, ఝ, ఢ, ధ, భ), యే = ఏవి గలవో, తే = అవి (ఘ, ఝ, ఢ, ధ, భ అను నక్షరములు), కర్మేంద్రియమయా హి = కర్మేంద్రియస్వరూపములు గదా!

**తత్త్వవిమర్శినీ :** సూత్రాభ్యాం కర్మేంద్రియవర్గముద్ఘాటయతి వాక్పాణీచేతి. చిద్రూపస్య శివస్య ప్రాణిజాతస్య చ ఝకారభకారౌ స్థావరాదిషు వినా విరాడ్రూపం విజ్ఞేయ-మిత్యర్థః.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** (పిమ్మట రెండుసూత్రములచే కర్మేంద్రియవర్గసంభవమును విశదపఱచుచున్నాఁడు. చిద్రూపుఁడైన శివునికి ప్రాణివర్గమునకును, ఝకార భకారములు, క్రమముగా వాగింద్రియముగాను, పాణీంద్రియముగాను అయినవి. ఇవి స్థావరాదులయందు లేవు. ఇవియే విరాడ్రూప మని తెలిసికొన వలయును.)

## (9) సూత్రము. ఘ ఢ ధష్

### (19) కాశికా.

**శ్లో॥ ఘఢధష్ సర్వభూతానాం పాదపాయూ ఉపస్థకః ।**
**కర్మేంద్రియగణా హ్యేతే జాతా హి పరమార్థతః ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** సర్వభూతానాం = సకలప్రాణులయొక్క, పాదపాయూ = పాదములును, గుదమును, ఉపస్థకః = ఉపస్థమును (స్త్రీపురుష చిహ్నమును), ఘఢధష్ = (వరుసగ) ఘకార, ఢకార, ధకార స్వరూపములు. ఏతే = ఈ, కర్మేంద్రియగణాః = కర్మేంద్రియసముదాయము, పరమార్థతః = పరమశివునివలన, జాతా హి = పుట్టినవిగదా!

కర్మేంద్రియతన్మాత్రలు :- వచనము, గమనము, గ్రహణము, విసర్జనము, ఆనందము.

**తాత్పర్యము :** స్థావరాదులందుఁ దప్పఁ దక్కినసకలజంతువులందుఁగల ఝకార భకారాత్మకములైన వాగింద్రియ పాణీంద్రియములును ఘకారఢకారధకారాత్మకములైన సకలభూత పాదపాయూపస్థములును బరమశివునివలన సంజనితము లని యెఱుంగునది. అనఁగా కచటతప యనువర్గపంచకమునందలి చతుర్థవర్ణములు కర్మేంద్రియస్వరూపము లని భావము.

**తత్త్వవిమర్శినీ :** అథ క్రమప్రాప్తం పాదాదికమాహ ఘఢధషితి. పరమార్థతః పరమశివసకాశాత్ ఇమే కర్మేంద్రియగణాః సర్వజంతూనాం పాదపాయూపస్థా ఘఢధవర్ణా జాతా ఇత్యర్థః.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** ఇచ్చట క్రమప్రాప్తమైన పాదాదిసృష్టిని చెప్పుచున్నాఁడు. పరమశివునివలననుండి పుట్టిన ఘ, ఢ, ధ, వర్ణంబులు సమస్త ప్రాణులయొక్క పాదేంద్రియ, గుదేంద్రియ, ఉపస్థేంద్రియములుగా నయిన వని యర్థము.

## (10) సూత్రము. జ బ గ డ దశ్

### 20. కాశికా.

**శ్లో॥ శ్రోత్రత్వఙ్నయనఘ్రాణ - జిహ్వా ధీంద్రియపంచకమ్ ।**
**సర్వేషామపి జంతూనా - మీరితం జబగడదశ్ ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** సర్వేషాం జంతూనామపి = సకలజంతువులయొక్కయు, ధీంద్రియపంచకమ్ = జ్ఞానేంద్రియపంచకమైన, శ్రోత్రత్వఙ్నయనఘ్రాణజిహ్వాః = చెవి, చర్మము, కన్ను, ముక్కు, నాలుక యను నింద్రియములు, జబగడదశ్ = జ, బ, గ, డ, ద లని, ఈరితమ్ = చెప్పఁబడినది.

**వర్గతృతీయవర్ణములు జ్ఞానేంద్రియపంచక** మని భావము. కాఁబట్టి 7-వ సూత్ర విశేషాంశములతో దీనికి సమన్వయము.

**తత్త్వవిమర్శినీ :** క్రమప్రాప్తం జ్ఞానేంద్రియసంభవమాహ శ్రోత్రేతి. '**వర్గాణాం మధ్యవర్ణోత్థో జ్ఞానేంద్రియగణః స్మృత**' ఇతి వచనశాసనాత్ జబగడదవర్ణసంభవో జ్ఞానేంద్రియగణ ఇతి సర్వత్ర సర్వేషాం ప్రాణిజాతానామేతే వర్ణా జ్ఞానేంద్రియాణాం జనకా ఇతి వా విజ్ఞేయమిత్యర్థః.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** ఇచ్చట జ్ఞానేంద్రియసముదాయమును చెప్పుచున్నాఁడు జ్ఞానేంద్రియసముదాయము వర్గములయొక్క మధ్యవర్ణంబులనుండి జనించిన వను న్యాయము

రీతిగా జబగడదలు సమస్తప్రాణులయొక్క జ్ఞానేంద్రియములైన వని భావము. లేక సమస్తప్రాణుల జ్ఞానేంద్రియముల కివియే జనకంబు లని భావము.

విశేషాంశములు : వి.చూ.

**శ్లో॥ బుద్ధీంద్రియాణి శ్రవణం త్వగక్షి**
**ఘ్రాణం చ జిహ్వా విషయావబోధనాత్ ।**
**వాక్పాణిపాదా గుదమప్యుపస్థః**
**కర్మేంద్రియాణి ప్రవణేన కర్మసు ।**

(వనితాదివిషయములు వేనివలనఁ దెలియఁబడునో అవి జ్ఞానేంద్రియములు. ఆ జ్ఞానేంద్రియములు త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు. క్రియలం దాసక్తములు కర్మేంద్రియములు. అవి వాక్పాణిపాదపాయూపస్థములు.)

## (11) సూత్రము ఖ ఫ ఛ ఠ థ చ ట తవ్

### (21) కాశికా

**శ్లో॥ ప్రాణాదిపంచకం చైవ మనోబుద్ధిరహంకృతిః ।**
**బభూవ కారణత్వేన ఖఫఛఠథచటతవ్ ॥**

### (22) కాశికా

**శ్లో॥ వర్గద్వితీయవర్ణోత్థాః ప్రాణాద్యాః పంచ వాయవః ।**
**మధ్యవర్గత్రయాజ్జాతా అంతఃకరణవృత్తయః ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** ప్రాణాది = ప్రాణము మొదలగు (వాయువుల యొక్క) పంచకం చైవ = అయిదును (అనఁగా ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమాన మనువాయువు లయిదును), మనః = మనస్సును, బుద్ధిః = బుద్ధియును, అహంకృతిః = అహంకారమును (అను), ఖఫఛఠథచటతవ్ = ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, తలు ఎనిమిదియును, కారణత్వేన = (జగత్తునకు) కారణముగ, బభూవ = ఉండెను. వర్గద్వితీయవర్ణోత్థాః – వర్గ = కచటతపవర్గము లయిదింటియొక్క, ద్వితీయవర్ణ = రెండవవర్ణములనుండి, ఉత్థాః = బయలువెడలినవి. ప్రాణాద్యాః = ప్రాణముమొదలగు, పంచవాయవః = అయిదువాయువులు, మధ్యవర్గత్రయాత్ = నడిమి వర్గములు మూఁటినుండి (అనఁగా కవర్గపవర్గములు తప్ప తక్కిన చటతవర్గములు మూఁటి (మొదటి యక్షరము) నుండి, అంతఃకరణవృత్తయః = అంతరింద్రియములయొక్క వృత్తులు మూఁడును, భూతాః = ఉత్పన్నములు.

**తత్త్వవిమర్శినీ :** తతః ప్రాణాదిపంచకమనోబుద్ధ్యహంకారాస్సముస్మీల్యంత ఇత్యాహ.

– ప్రాణాదీతి. ఏతైరష్టవర్ణైః ప్రాణాదిపంచకమనోబుద్ధ్యహంకారా జగతాం కారణత్వేన సంభూతా ఇత్యర్థః.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** తర్వాత ప్రాణాదిపంచవాయువులును, మనసు, బుద్ధి, అహంకారములును జనించిన వని చెప్పుచున్నాఁడు. ఈ యెనిమిదివర్ణములచేతనే ప్రాణము మున్నగు పంచవాయువులును, మనోబుద్ధ్యహంకారంబులును లోకములకు కారణములై సంభవించె నని భావము.

విశేషాంశములు : ఈ సూత్రము **పంచప్రాణాంతఃకరణములను** ప్రతిపాదించుచున్నది.

ఖ = ప్రాణవాయువు, ఫ = అపానవాయువు, ఛ = వ్యానవాయువు, ఠ = ఉదానవాయువు, థ = సమానవాయువు, చ = మనస్సు, ట = బుద్ధి, త = అహంకారము.

"**ఏకోనవింశతిముఖః**" (మాండూక్యము) = పందొమ్మిది ముఖములు. అవి యే వనఁ గా:–

జ్ఞానేంద్రియములు – 5, జ్ఞానేంద్రియతన్మాత్రలు – 5, కర్మేంద్రియములు – 5, అంతఃకరణములు – 4, మొత్తము – 19. ఇవి ఉకారముయొక్క విరివి.

కేనోపనిషత్ :–

**శ్లో॥ యత్ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే ।**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥ 1–8**

(జనులు నాసికాద్వారములం దుండునట్టిదిగాను, అంతఃకరణము ప్రాణము అను నీ రెంటివృత్తులతోఁ గూడినట్టిదిగాను, పృథివీకార్యముగా నుండు నట్టి ఘ్రాణేంద్రియముచేత గంధమువలె దేనిని విషయముగాఁ జేయుటలేదో, ఏ చైతన్యస్వరూపముచేత ఘ్రాణేంద్రియము స్వవిషయమునందుఁ బ్రవేశించు చున్నదో, దానిని బ్రహ్మస్వరూప మని తెలిసికొనుము.)

**శ్లో॥ యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్ ।**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥ 1–5**

(జను లే సాకారమైన యీశ్వరాదుల నుపాసించెదరో యది పరమాత్మస్వరూపము కాదు. మనసునందు వ్యాపించియుండునదియు నగు స్వరూప మెయ్యదియో యదే పరమాత్మ స్వరూప మని తెలిసికొనుము.)

పంచీకరణవార్తికము :–

**అపంచీకృతమహాభూతాని పంచతన్మాత్రాణి, తత్కార్యం చ పంచప్రాణాః, దశేంద్రియాణి మనోబుద్ధిశ్చేతి సప్తదశకం లింగం భౌతికం హిరణ్యగర్భ ఇత్యుచ్యతే.**

**ఏతత్సూక్ష్మశరీరమాత్మనః. కరణేషూపసంహృతేషు జాగరితసంస్కారజః ప్రత్యయః సవిషయః స్వప్న ఇత్యుచ్యతే. తదుభయాభిమాన్యాత్మా తైజసః. ఏతత్త్రయముకారః.**

(అపంచీకృతమహాభూతములును, పంచతన్మాత్రలును, దానికార్యమును, అనఁగా పంచప్రాణములు, దశేంద్రియములు, మనసు, బుద్ధి యను నీ పదునేడుతత్త్వములు చేరినది లింగము, భౌతికము, హిరణ్యగర్భము అని చెప్పఁబడును. ఇది యాత్మకు సూక్ష్మశరీరము. కరణము లణఁగినపుడు జాగ్రత్సంస్కారమువల్లఁ గలిగిన ప్రత్యయము విషయముతోఁ గూడి స్వప్న మనఁబడును. ఈ రెంటియొక్క యభిమాని యైన యాత్మ తైజసుఁ డనఁ బడును. ఈ మూఁడును ఉకారము.)

**జ్ఞానేంద్రియాణి పంచైవ పంచ కర్మేంద్రియాణి చ.**

(జ్ఞానేంద్రియము లైదు కర్మేంద్రియము లైదు.)

**శ్లో॥ శ్రోత్రత్వఙ్నయనఘ్రాణజిహ్వా ధీంద్రియపంచకమ్ ।**
**వాక్పాణిపాదపాయూపస్థాః కర్మేంద్రియపంచకమ్ ॥**

(శ్రోత్రము, చర్మము, కన్ను, ముక్కు, నాలుక అను నీ యైదును జ్ఞానేంద్రియములు. వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థము నను నీ యైదును కర్మేంద్రియములు.)

**శ్లో॥ మనోబుద్ధిరహంకార - శ్చిత్తం చేతి చతుష్టయమ్ ।**
**సంకల్పాఖ్యం మనోరూపం - బుద్ధిర్నిశ్చయరూపిణీ ॥**

(మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము అను నీ నాలుగును అంతఃకరణచతుష్టయ మనఁబడును. మనస్స్వరూపము సంకల్ప మనియు, నిశ్చయస్వరూపము బుద్ధి యనియును దెలియునది.)

**శ్లో॥ అభిమానకరస్తద్వ - దహంకారః ప్రకీర్తితః ।**
**అనుసంధానరూపం చ - చిత్తమిత్యభిధీయతే ॥**

(అభిమానస్వరూప మహంకార మనియును, అనుసంధానరూపము చిత్తమనియును జెప్పఁబడును.)

**శ్లో॥ ప్రాణోఽపానస్తథా వ్యాన ఉదానాఖ్యస్తథైవ చ ।**
**సమానశ్చేతి పంచైతాః కీర్తితాః ప్రాణవృత్తయః ॥**

(ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అను నీ యైదును ప్రాణవృత్తులు.)

**శ్లో॥ ఖవాయ్వగ్న్యంబుక్షితయో భూతసూక్ష్మాణి పంచ చ ।**
**అవిద్యాకామకర్మాణి లింగం పుర్యష్టకం విదుః ॥**

(ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి అను నీ సూక్ష్మభూతము లైదును, అవిద్యాకామకర్మములును లింగ మనియు, పుర్యష్టకమనియుఁ జెప్పఁబడును.)

వివేకచూడామణి :-

**శ్లో॥ మనస్తు సంకల్పనాదిభి-**
**ర్బుద్ధిః పదార్థాధ్యవసాయధర్మతః ।**
**అత్రాఽభిమానాదహమిత్యహంకృతి-**
**స్స్వార్థానుసంధానగుణేన చిత్తమ్ ॥**

(సంకల్పవికల్పాత్మకము మనసు. నిశ్చయాత్మకమైనది బుద్ధి. నే నను నభిమానమువల్ల నహంకార మనియు, తనప్రయోజనమును దలఁచుసమయంబునఁ జిత్త మనియును దెలియఁ దగినది.)

పంచప్రాణములు :-

**శ్లో॥ ప్రాణాపానవ్యానోదానసమానా భవత్యసౌ ప్రాణః ।**
**స్వయమేవ వృత్తిభేదాద్వికృతిభేదాత్సువర్ణసలిలవత్ ॥**

(ప్రాణవాయు వొక్కటే బంగరునీరు (కరఁగినబంగారు) ఏకరూపముగ నున్నను పోఁతపోయఁబడి వృత్తిభేదమువలనను, వికృతిభేదము వలనను వేర్వేఱువిగ్రహములైనట్లుగ నా యా స్థానములయం దుండి యా యా నామములచేత వ్యవహరింపఁబడును.)

**శ్లో॥ ఉచ్ఛ్వాసనిశ్శ్వాసవిజృంభణక్షు-**
**త్ప్రస్యందనాద్యుత్క్రమణాదికాః క్రియాః ।**
**ప్రాణాదికర్మాణి వదంతి తద్‌జ్ఞాః**
**ప్రాణస్య ధర్మా వశనాపిపాసే ॥**

(ప్రాణాదికర్మధర్మముల నెఱిఁగినవా రగుపండితులు ఉచ్ఛ్వాసము నిశ్శ్వాసము మొదలగు కర్మములు ప్రాణాపానాదులచేతఁ జేయఁబడు ననియు, నాఁకలిదప్పులు రెండుమాత్రము ప్రాణధర్మములు గాని వేఱొకదానివి గా వనియుఁ జెప్పుదురు.)

అంతఃకరణము :-

**శ్లో॥ నిగద్యతేఽంతఃకరణం మనో ధీ-**
**రహంకృతశ్చిత్తమితి స్వవృత్తిభిః ।**

(అంతరింద్రియము మన స్సనియు, బుద్ధి యనియు, నహంకారమనియుఁ, చిత్త మనియు స్వవృత్తులచేత నాల్గువిధములుగ నుండును.)

**శ్లో॥ అంతఃకరణమేతేషు చక్షురాదిషు వర్ష్మణి, ।**
**అహమిత్యభిమానేన తిష్ఠత్యాభాసతేజసా ॥**

(నేత్రాదీంద్రియములందును దేహమందును అంతఃకరణము నే నను నభిమానముచే చిదాభాస మను జీవతేజస్సుచేత నున్నది.)

(క్రింది మూఁడశ్లోకములచేత నంతఃకరణములును పంచప్రాణములును మిథ్య యని తెలియుచున్నది.)

**శ్లో॥ దేహేంద్రియప్రాణమనోఽహమాదయ-**
**స్సర్వే వికారా విషయాస్సుఖాదయః ।**
**వ్యోమాదిభూతాన్యఖిలం చ విశ్వ**
**మవ్యక్తపర్యంతమిదం హ్యనాత్మా ॥**

(శరీరేంద్రియప్రాణమనోఽహంకారాదులు, వనితాదివిషయములు, సుఖదుఃఖాదులు, ఆకాశము మొదలగు భూతములు, సమస్తప్రపంచము, మాయవఱకు ని దంతయు నాత్మకాదు.)

**శ్లో॥ మాయా మాయాకార్యం - సర్వం మహదాదిదేహపర్యంతమ్ ।**
**అసదిదమనాత్మకం త్వం - విద్ధి మరుమరీచికాకల్పమ్ ॥**

(మహత్తత్త్వము మొదలు దేహమువఱకు నంతయు మాయాకార్యము. ఇది నిర్జలభూమియందలి యెండమావులతో సమానమైనది.)

వి.చూ. శ్లో. 126,226,134,135,136 చూడుఁడు.

హరిమీడేస్తవము :-

**శ్లో॥ కోఽప్యేవాన్యాదాత్మని న స్యాదయమేష-**
**హ్యేవానందః ప్రాణితి చాపానితి చేతి ।**
**ఇత్యస్తి త్వం వక్త్యుపపత్త్యా శ్రుతిరేషా**
**తం సంసారధ్వాంతవినాశం హరిమీడే ॥**

(కార్యకారణసంఘాతమైన యీ దేహమందు చిదానందస్వరూపుఁడైన యాత్మ లేనియెడల నే పురుషుఁడును ప్రాణాదివ్యాపారమును చేయనేరఁడు. అందువలన పరమాత్మయే జీవభావమును బొంది ప్రాణాపానాది వ్యాపారములను జేయుచున్నాఁ డని యెవని యస్తితను ఉపపత్తిపూర్వకముగా తైత్తిరీయోపనిషత్తు చెప్పుచున్నదో సంసారధ్వాంతవినాశకుఁడైన యా శ్రీహరిని స్తుతించుచున్నాను.)

**శ్లో॥ ప్రాణోఽత్రాహం వాక్శ్రవణాదీని మనో వా**
**బుద్ధిర్వాఽహం వ్యస్త ఉతాహోపి సమస్తః ।**
**ఇత్యాలోచ్య జ్ఞప్తిరిహాఽస్మీతి విదుర్యం**
**తం సంసారధ్వాంతవినాశం హరిమీడే ॥**

(ఈ శరీరమునందు నేను ప్రాణమా? వాగాదీంద్రియములా? మనసా? బుద్ధియా? లేక ప్రాణాదు లన్నిటిసముదాయమా? లేక యీ సకలమునకును సాక్షిస్వరూపుఁడనా? అని యాలోచించి ప్రాణాదులకంటె వేఱైవానికెల్ల సాక్షియై యున్న జ్ఞప్తియే నే నని యే శ్రీహరిని దెలిసికొనుచున్నారో, సంసారధ్వాంతవినాశకుఁడైన యా శ్రీహరిని స్తుతించుచున్నాను.)

**శ్లో॥ నాహం ప్రాణో నైవ శరీరం న మనోఽహం**
**నాహం బుద్ధిర్నాహమహంకారధియౌ చ ।**
**యోఽత్ర జ్ఞాంశస్సోఽస్మ్యహమేవేతి విదుర్యం**
**తం సంసారధ్వాంతవినాశం హరిమీడే ॥**

(నేను ప్రాణము కాను, శరీరము కాను, మనసు కాను, బుద్ధియుఁ గాను, అహంకారము కాను. మఱెవ్వ రన నీ ప్రాణాదికమునందు ఎవఁడు జ్ఞానస్వరూపుఁడో యా విష్ణువే నే నని యెవనిని దెలిసికొనుచున్నాఁడో సంసారధ్వాంతవినాశకుఁడైన యా శ్రీహరిని స్తుతించుచున్నాను.)

**శ్లో॥ ప్రాణానాయమ్యోమితి చిత్తం హృది రుధ్వా**
**నాన్యత్ స్మృత్వా తత్పునరత్రైవ విలాప్య ।**
**క్షీణే చిత్తే భాదృశిరస్మీతి విదుర్యం**
**తం సంసారధ్వాంతవినాశం హరిమీడే ॥**

(యోగు లింద్రియనిగ్రహము చేసి ప్రణవపూర్వకముగా నంతఃకరణమును హృదయాకాశమందు నిలిపి వేఱుతలంపు లేక యాయంతఃకరణమును హృదయాకాశమునందు లయింపఁజేసి యది (అంతఃకరణము) వృత్తిశూన్యమైన వెనుక ప్రకాశజ్ఞానస్వరూపుఁడైన యెవనిని తమ్ముఁగఁ దెలిసికొనుచున్నారో సంసారధ్వాంతవినాశకుఁడైన యా శ్రీహరిని స్తుతించుచున్నాను.)

## (12) సూత్రము. క పయ్

### (23) కాశికా

**శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ సర్వేషామేవ సమ్మతమ్ ।**
**సంభూతమితి విజ్ఞేయం కపాభ్యామితి నిశ్చితమ్ ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** సర్వేషామేవ = సమస్తలోకములకును, సంభూతమ్ = కారణమైయున్న (పుట్టిన దని), ప్రకృతిమ్ = ప్రకృతిని, పురుషం చైవ = పురుషునిని, కపయ్ =

క, ప, వర్ణములు (క = ప్రకృతి (అనఁగా నిరువదియైదనాత్మతత్త్వములు), ప = పురుషుఁడు), స్యాత్ = అగును, ఇతి = అని, నిశ్చితమితి = నిశ్చయింపఁబడిన దని, విజ్ఞేయమ్ = తెలియఁ దగినది.

**తాత్పర్యము :** ఆద్యంతవర్గములయందలి యాద్యక్షరములకలయికచేత సకల కారణము లగు ప్రకృతిపురుషులసంపుటీభావము స్పష్ట మగుచున్నది. ఈ వర్ణద్వయమే ప్రకృతిపురుష లని యెఱుంగనగును.)

**తత్త్వవిమర్శినీ :** తతస్సర్వప్రాణికారణత్వేనాద్యంతవర్గద్వయాక్షరగ్రహణేన సంపుటీభావం ప్రకృతిపురుషాభ్యాం ప్రకాశయతి. ప్రకృతిమితి. కకారపకారజాతౌ ప్రకృతి–పురుషావిత్యర్థః.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** పిమ్మట సమస్తప్రాణులకును కారణముగా మొదటివర్గము యొక్క మొదటి యక్షరమును, కడపటి వర్గముయొక్క మొదటి యక్షరమును ఇచ్చట గ్రహించియుండుట వలన ప్రకృతిపురుషులచే సంపుటీభావమును (సమస్తమును ప్రకృతిపురుషాంతర్గతమును) వెల్లడి చేయుచున్నారు. ప్రకృతిపురుషులు యథాసంఖ్యముగా కకారపకారములనుండి కలిగిన వని భావము.

విశేషాంశములు :–

సర్వప్రాణికారణత్వేన = అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు, జరాయుజములు అను సకలప్రాణులకును గారణ మగుట చేత.

నిరాలంబోపనిషత్తు :–

**కా ప్రకృతిః? కః పరమాత్మా ?**

**ప్రకృతిరితి చ – బ్రహ్మణస్సకాశాన్నానావిచిత్రజగన్నిర్మాణసామర్థ్యకబుద్ధిరూప–బ్రహ్మశక్తిరేవ ప్రకృతిః.**

(ఏది ప్రకృతి? ఏది పరమాత్మ? బ్రహ్మముయొక్క సాన్నిధ్యము వలన నానావిచిత్రములు గల జగమును నిర్మించుసమర్థత గలదియు బుద్ధి రూపయు నగు బ్రహ్మశక్తి యేది గలదో యదియే ప్రకృతి.)

**పరమాత్మేతి చ. – దేహాదేః పరత్వాత్, బ్రహ్మైవ పరమాత్మా.**

(దేహముకంటెను, ప్రాణములు మున్నగువానికంటెను బర మగుటం జేసి బ్రహ్మమే పరమాత్మ.)

శుకరహస్యోపనిషత్ :-

**శ్లో॥ యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః ।**
**తస్య ప్రకృతిలీనస్య యః పరస్స మహేశ్వరః ॥**

(సకలవేదములమొదట నుచ్చరింపఁబడునదియు, నట్లే వేదాంతము నందు నిరూపింపఁ బడినదియు, ప్రకృతియం దణఁగియున్నదియు నగునా ప్రణవమున కవ్వల నుండువాఁడు **మహేశ్వరుఁ** డనఁబడును.)

కఠోపనిషత్ :-1.3.

**శ్లో॥ ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధిర్బుద్ధేరాత్మా మహాన్పరః ॥**

(ఇంద్రియములకంటె విషయములు శ్రేష్ఠములు. అర్థముల (విషయముల) కంటె మనస్సు శ్రేష్ఠమైనది. మనసుకంటె బుద్ధి శ్రేష్ఠమైనది. బుద్ధి కంటె మహాత్ముఁడైన యాత్మ (మహత్తత్త్వము, ఈశ్వరతత్త్వము, సూత్రాత్మ) శ్రేష్ఠమైనది.)

**శ్లో॥ మహతః పరమవ్యక్త - మవ్యక్తాత్పురుషః పరః ।**
**పురుషాన్న పరం కించి - త్సా కాష్ఠా సా పరా గతిః ॥**

(మహత్తత్త్వముకంటె నవ్యక్తతత్త్వము శ్రేష్ఠమైనది. (దీనినే మాయ ప్రకృతి యందురు.) అవ్యక్తతత్త్వముకంటెను పరమాత్మ శ్రేష్ఠమైనది. పరమాత్మకంటె శ్రేష్ఠ మైనది వే ఱేదియు లేదు. అదియే (పొందఁదగినస్థానము) దిక్కు. అదియే పరమగతి (మోక్షము).

**శ్లో॥ ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే ।**
**దృశ్యతేత్వగ్రయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥**

(ఈయాత్మ సకలభూతములయందును మఱుఁగై యున్నది; ప్రకాశించుటలేదు; సూక్ష్మదృష్టిగలవారి (వివేకుల) చేత సూక్ష్మముగను, ఏకాగ్రముగను నుండుబుద్ధిచేతఁ దెలియఁ బడుచున్నది.)

**శ్లో॥ యచ్ఛేద్వా ఙ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేత్ జ్ఞాన ఆత్మని ।**
**జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాంత ఆత్మని ॥**

(వివేకియైనవాఁడు వాగాదీంద్రియములను మనసునందు లయింపజేయవలయును. మనసును బుద్ధ్యాత్మయందు లయింపఁజేయవలయును. ఆ బుద్ధ్యాత్మను మహదాత్మయందు (మహత్తత్త్వము, ఈశ్వరతత్త్వము, మున్నుగలిగిన విజ్ఞానము) లయ మొందింపవలెను. ఆ మహదాత్మను శాంతాత్మ (పరమాత్మ) యందు లయ మగునట్లు చేయవలయును.)

భగవద్గీత - అ.7. శ్లో 4.

**శ్లో॥ భూమిరాపో౽నలోవాయుః ఖం మనోబుద్ధిరేవ చ ।**
**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥**

(పృథ్వీతన్మాత్ర - గంధగుణమును, ఉదకతన్మాత్ర - రస గుణమును, అగ్ని తన్మాత్ర - రూపగుణమును, వాయుతన్మాత్ర - స్పర్శగుణమును, ఆకాశ తన్మాత్ర - శబ్దగుణమును, మనసునకుఁ గారణమైన యహంకారతత్త్వమును, మహత్తత్త్వమును, అవ్యక్తమును అని నాదు ప్రకృతి యెనిమిది విధములుగా నున్నది.)

**శ్లో॥ అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।**
**జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్ ॥**

(ఓయర్జునా! ఇదివఱకుఁ జెప్పఁబడిన క్షేత్రరూపమైన యపర ప్రకృతి అపరిశుద్ధమును, అనర్థమును గలుగఁజేయునదియును, సంసారరూపమును, బంధనాత్మకమైనదియు నగుటచేత నికృష్ట మైనది. ఇట్టి నీచప్రకృతికంటె నితరమైన నా యపరప్రకృతి క్షేత్రజ్ఞరూప మైనదియు, సర్వోత్తమ మైనదియు, ప్రాణధారణమునకుఁ గారణ మైనదియు, నాకు నాత్మభూతయై యున్నది. అట్టి నా ప్రకృతి లోపలఁ బ్రవేశించి స్వకర్మమూలకముగా నీ కనఁబడుచున్న లోకమును సర్వమును ధరించుచున్నది.)

**శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయాదురత్యయా ।**
**మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ॥**

(ఓయర్జునా! అధికభక్తితో నన్ను సేవించుచు, నన్నే శరణుచొచ్చువారు దేవుఁడ నగు నా సంబంధమైనదియు (లేక) అద్భుతమైన సామర్థ్యము గలదియు, నధికకష్టముతోఁ దాఁటఁ దగినదియు నగు నా మాయను తరింతురు.)

**శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవ చ ।**
**ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ! ॥**

(ఓకృష్ణా! ప్రకృతి యెట్టి స్వరూపముగలది? పురుషుఁ డెవ్వఁడు? క్షేత్ర మనఁగా నెయ్యది? క్షేత్రజ్ఞుఁ డనఁబడువాఁ డెవ్వడు? జ్ఞాన మెట్టిది? జ్ఞేయ మన నెద్ది? వీని స్వరూపమును నాకుఁ జక్కఁగఁ దెలుపుము.)

**శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।**
**వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్ ॥**

(ఓ యర్జునుఁడా! ప్రకృతిపురుషు లను క్షేత్రక్షేత్రజ్ఞుల నిద్దఱిని ఆదిరహితులనుగాఁ

దెలిసికొనుము; పృథివి మొదలగు పంచమహాభూతములును, త్వక్కు మొదలగు జ్ఞానేంద్రియములు (తెలిసికొనునట్టి యింద్రియములు) అయిదును, వాక్కు మొదలగు కర్మేంద్రియములు (పనిచేయునట్టి యింద్రియములు) అయిదును, బుద్ధియును అనుపదునాఱు వికారములను, సత్త్వరజస్తమోగుణ రూపములగు సుఖదుఃఖమోహములను మాయవలనఁ బుట్టినవానిని గానే తెలిసికొనుము.)

**శ్లో॥ కార్యకారణకర్తృత్వహేతుః ప్రకృతిరుచ్యతే ।**
**పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే ॥**

(శరీరమును ఇంద్రియములను సృజించుటకు (చేయుటకు) కారణము మాయ (ప్రకృతి) యని కపిలాదులు చెప్పిరి. మఱియును సుఖదుఃఖమోహముల ననుభవించువాఁడు పురుషుఁడు (జీవుఁడు) అనియు మహర్షులు చెప్పిరి.)

**శ్లో॥ పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్ ।**
**కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు ॥**

(జీవరూపుఁడైన పరమపురుషుఁడు కార్యకారణరూపమైనదియు, అవిద్యారూప మైనదియు నగు ప్రకృతియందు (దేహమునందు) న్న కారణమువలనఁ బ్రకృతిజన్యములగు సుఖదుఃఖాదులను పొందుచున్నాఁడు. సుఖదుఃఖమోహాదుల ననుభవించునది యవిద్యయైనను దివ్యములును రాక్షసములును మానుషములునగు యోనులయందు సంసారము చేయుటకు జీవునకు సుఖదుఃఖమోహాత్మకములైన విషయములయందలి యభిలాషయే కారణమగుచున్నది. అనఁగా విషయాభిలాష లేనివారికి సాంసారికములైన సుఖదుఃఖమోహములు లేవు.)

**శ్లో॥ ఉపద్రష్టానుఽమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః ।**
**పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్పురుషః పరః ॥**

(యజ్ఞమునందు సోమయాజియు, ఋత్విక్కులును యజ్ఞకార్యములయందుఁ బ్రవేశించి పని చేయుచుండఁగా ఋత్విగాదుల కుఁ గలుగు లోపాలోపములను గనిపట్టుటకు యజ్ఞకర్మ మందుఁ గుశలుఁడైన యుపద్రష్ట యెట్లు సమీపమం దుండి చూచునో యట్లే దేహాదులవ్యాపారముల యందుఁ బ్రవేశింపక సాక్షిభూతుఁడుగా సమీపముననుండి చూచువాఁడును అనఁగా నుపద్రష్టయు, దేహేంద్రియాదులవ్యాపారములయందుఁ బ్రవర్తింపకపోయినను సన్నిధిమాత్రముచేతఁ బ్రవర్తించినవానియ ట్లనుకూలుఁడును, చైతన్యాధ్యాసవిశిష్టములును సంహితములునైన దేహేంద్రి-యాదులను ధరించు వాఁడును (లేక) పోషించువాఁడును, బుద్ధియొక్క సుఖదుఃఖమోహాత్మకములైన అనుభవములను నిర్వికారుఁడై పొంది స్వరూపచైతన్యముచేత ప్రకాశింపఁజేయువాఁడును, సర్వాత్ముఁడును, స్వతంత్రుఁడును అగుటవలన మహేశ్వరుఁడును, అవిద్యచే ప్రత్యగాత్మగా

కల్పితములైన దేహేంద్రియాదులకంటె నుత్కృష్టమైన యాత్మయును, అనఁగా పరమాత్మయును అని శ్రుతులచేఁ జెప్పఁబడు పురుషుఁడు (జీవుఁడు) ఈశరీరమం దున్నప్పటికిని దేహేంద్రియాదుల కంటె నన్యుఁడని యెఱుంగుము. అనఁగా నవిద్యా సంసర్గముచేతఁ బురుషుఁడు సంసారి యైనను వాస్తవముగా సంసారికాఁడు.)

**శ్లో॥ య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।**
**సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥**

(ప్రకృతి నేనే. వాని ననుభవించువాఁడును నేనే. అనునట్టి యజ్ఞానము తొలఁగి పరమాత్మజ్ఞానము గలుగ నా పరమాత్మజ్ఞానముచేత జీవాత్మ పరమాత్మలను భేదములేక తానే పరమాత్మ యనియు, నా పరమాత్మయే తా ననియు, మాయావికారము లైన సుఖదుఃఖ మోహాదులతోఁ గూడినది ప్రకృతి యనియు నెవ్వఁడు తెలిసికొనునో వాఁడు శాస్త్రోక్తప్రకారముగా నడచుకొన్నను నడచుకొనకపోయినను (అట్టిజ్ఞాని యెట్లు ప్రవర్తించినను) మరల జన్మమును బొందఁడు. జ్ఞానోత్పత్తికాలమునందలి శరీరము విడిచిన పిదప ముక్తిని పొందు నని భావము.)

**శ్లో॥ మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్ ।**
**సంభవస్సర్వభూతానాం తతో భవతి భారత! ॥**

(ఓ యర్జునుఁడా! సకలకార్యములకంటె నధిక మైన దగుటవలన మహత్తనియు, సకలమును వృద్ధిఁ బొందించుట (ధరించుట) వలన బ్రహ్మమనియు జెప్పఁబడు త్రిగుణాత్మకమైన మాయ యీశ్వరుఁడైన నా యొక్క గర్భస్థానము. అట్టి గర్భస్థానమునందు (అనఁగా మహత్తనియు బ్రహ్మమనియుఁ జెప్పఁబడుత్రిగుణాత్మకమైన మాయయందు) హిరణ్యగర్భుఁడు మొదలగు సకలప్రాణులయొక్కయు జన్మమునకుఁ గారణమగు బీజము (గర్భము)ను క్షేత్రక్షేత్రజ్ఞ లనెడి ప్రకృతిద్వయముయొక్క శక్తిమంతుఁడగు, నీశ్వరుఁడనైన నేను ఉంచుచున్నాను. ఆ గర్భమునుండి హిరణ్యగర్భుఁడును తన్మూలమున సకలభూతములును గలుగును)

**శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।**
**క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥**

(క్షరుఁడు, అక్షరుఁడు నను నీ యిరువురు పురుషులలో బ్రహ్మాదిస్థావరాంతమగు శరీరములసముదాయము క్షరశబ్దవాచ్యము (నశించునది) అనియు, పర్వతము నశించినను శిలాసముదాయము నశింపనట్లు శరీరములు నశించినను నిర్వికారముగ నుండువాఁడు (కూటస్థుఁడు) అక్షరశబ్దవాచ్యుఁ డనియుఁ జెప్పఁబడుచున్నాఁడు. ఇచ్చట క్షరుఁడు, అక్షరుఁ డను నిరువురు పురుషులును, ఉత్తరశ్లోకమునందు "ఉత్తమః పురుషస్త్వన్యః" అని మఱియొక పురుషుఁడును

జెప్పఁబడియున్నా రని భ్రమపడఁగూడదు. అవివేకులు శరీరాత్మలే పురుషు లనుభ్రాంతిఁ జెంది చెప్పుట వాడుక గనుక నీ యర్ధశ్లోకముచే ముం దిట్లు చెప్పి యుత్తరార్ధముచేత పురుషులు కారని తెలియఁజేసెనని యెఱుంగునది.)

**శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।**
**యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥**

(నాశరహితుఁడును, నారాయణుఁ డను పేరుగల సకలప్రాణిని యంతయును, (అనఁగా సర్వజ్ఞుఁడును) భూర్భువస్సువర్లోకము లను ముల్లోకములను తన మాయాశక్తిచేతఁ బ్రవేశించి ధరించువాఁడును, పూర్వశ్లోకమునందు నుడివియున్న క్షరాక్షరులకంటె నితరుఁడును, విలక్షణుఁడును, శ్రేష్ఠుఁడునగు పురుషుఁడు పరమాత్మ యని వేదములచేతఁ జెప్పఁబడుచున్నాఁడు. పరమాత్మ జీవధర్మముచేత శరీరముకంటెను, పరమత్వముచేత మాయకంటెను విలక్షణుఁ డని యెఱుంగునది.)

**శ్లో॥ యస్మాత్ క్షరమతీతోఽహ - మక్షరాదపి చోత్తమః ।**
**అతోఽస్మి లోకే వేదే చ - ప్రథితః పురుషోత్తమః ॥**

(అశ్వత్థ మనుపేరుగల సంసారమాయావృక్షమున కనఁగా క్షరము నకుఁ గారణమైనదియును, మాయయు నగు చేతనముకంటె నుత్కృష్టతముఁడవగునన్ను (పరమాత్మను) లోకములును వేదములును పురుషోత్తముఁ డని పొగడుచున్నవి. పురుషోత్తముఁ డని యా కారణమునఁ బ్రఖ్యాతిఁ గాంచితిని.)

హరిమీడేస్తవము :-

**శ్లో॥ యేనాఽఽవిష్టో యస్య చ శక్త్యా యదధీనః**
**క్షేత్రజ్ఞోఽయం కారయితా జంతుషు కర్తుః ।**
**కర్తా భోక్తాఽఽత్మాఽత్ర హి చిచ్ఛక్త్యధిరూఢ-**
**స్తం సంసారధ్వాంతవినాశం హరిమీడే ॥**

(పరమేశ్వరునిచేతను, పరమేశ్వరునిమాయచేతను ఆవేశింపఁబడినవాఁ డగుటచేత జీవుఁడు పరమేశ్వరున కధీనుఁడై సర్వవ్యాపారములం దున్నాఁడు సర్వభూతములయందును గర్మములను జేయువానిని ప్రేరేపించువాఁ డనియు, నీ దేహమందుఁ బాలించువాఁ డనియు, లయింపఁజేయువాఁ డనియు, నాత్మయనియుఁ బ్రసిద్ధ మైయున్నవాఁడు. మఱియు సంసారాంధ-కారవినాశకుఁడు. అట్టి యా హరిని స్తుతించుచున్నాను.)

**శ్లో॥ యుక్త్యాఽఽలోద్య వ్యాసవచాంస్యత్ర హి లభ్యః**
**క్షేత్రక్షేత్రజ్ఞాంతరవిద్భిః పురుషాఖ్యః ।**
**యోఽహం సోఽసౌ సోఽస్మ్యహమేవేతి విదుర్యం**
**తం సంసారధ్వాంతవినాశం హరిమీడే ॥**

(వేదవ్యాసులవారిబ్రహ్మసూత్రములను బాగుగ విచారించి, తర్కాది ప్రమాణములచేత దేహాదులయొక్కయు, జీవులయొక్కయు భేదము నెఱుంగు వారు, పరమాత్మ యీ దేహేంద్రియ సంఘాతమందే పొంద శక్యుఁ డని యెఱుంగుచున్నారు. మఱియు "నేనే యా పరమేశ్వరుఁడు, పరమేశ్వరుఁడే నేను" అనియు, నట్టి పరమేశ్వరుఁడే సంసారధ్వాంతవినాశకుఁడైన శ్రీహరియనియు నెఱుంగుదురు. అట్టి హరిని స్తుతించుచున్నాను.)

వివేకచూడామణి :-

**శ్లో॥ అవ్యక్తనామ్నీ పరమేశశక్తి - రనాద్యవిద్యా త్రిగుణాత్మికా పరా।**
**కార్యానుమేయా సుధియైవ మాయా - యయా జగత్సర్వమిదం ప్రసూయతే ॥**

(అవ్యక్త మను పేరుగల త్రిగుణాత్మిక యగుమాయ పండితునిచేతఁ గార్యమునుబట్టి యూహింపఁదగియున్నది. దానిచేతనే కాన్పించు నీ ప్రపంచమంతయు సృజింపఁబడెను.)

**శ్లో॥ స న్నాప్యసన్నాప్యుభయాత్మికా నో**
**భిన్నాప్యభిన్నాప్యుభయాత్మికా నో ।**
**సాంగాప్యనంగా హ్యుభయాత్మికా నో**
**మహాద్భుతాఽనిర్వచనీయరూపా ॥**

(మాయ కీ రీతిరూపము గల దని చెప్పనలవికాదు; ఏలాగున నుండు నదియుఁ గాదు; లేనిదయుఁ గాదు. బ్రహ్మముకంటె వేఱు గాదు; వేఱు గానిదియును గాదు; లేనిదియును గాదు, అత్యాశ్చర్యకర మైనది. ఇటువంటి దని వచింప నలవి కానిది.)

**శ్లో॥ శుద్ధాద్వయబ్రహ్మవిబోధనాశ్యా**
**సర్పభ్రమో రజ్జువివేకతో యథా ।**
**రజస్తమస్సత్త్వమితి ప్రసిద్ధా**
**గుణాస్తదీయాః ప్రథితైః సర్వకార్యైః ॥**

(త్రా డను తెలివిచేతఁ బా మనుభ్రాంతి తొలఁగునట్లు నద్వయము (తనకంటె నన్యము మఱెద్దియు లేనిది) అగు బ్రహ్మజ్ఞానముచేత మాయ తొలంగును.)

వి.చూ. 369,370,519 శ్లోకములు చూడుఁడు.

## (13) సూత్రము. శ ష సర్

### (24) కాశికా

**శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి - గుణానాం త్రితయం పురా ।**
**సమాశ్రిత్య మహాదేవ - శ్శషసర్ క్రీడతి ప్రభుః ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** పురా = సృష్టికిఁ బూర్వము, శషసర్ = శషసస్వరూపమైన,

సత్త్వమ్ = సత్త్వము, రజః = రజస్సు, తమః = తమస్సు, ఇతి = అను, గుణానామ్ = గుణములయొక్క, త్రితయమ్ = మూఁటిని, సమాశ్రిత్య = ఆశ్రయించి, ప్రభుః = ప్రభువగు, మహాదేవః = మహాదేవుఁడు, క్రీడతి = విహరించుచున్నాఁడు.

**(25) కాశికా**

**శ్లో॥ శకారాద్రాజసం రూపం - షకారాత్తామసోద్భవః ।**
**సకారాత్సత్త్వసంభూతి - రితి త్రిగుణసంభవః ॥**

**ప్రణవవల్ల్యాఖ్యయా :** శకారాత్ = శవర్ణమువలన, రాజసం రూపం = రజోగుణ రూపమును, షకారాత్ = షవర్ణమువలన, తామసోద్భవః = తామసగుణోత్పత్తియు, సకారాత్ = సవర్ణమువలన, సత్త్వసంభూతిః = సత్త్వగుణోత్పత్తియు, ఇతి = అను, త్రిగుణసంభవః = త్రిగుణములపుట్టుక.

**తత్త్వవిమర్శినీ :** తతోఽవస్థాత్రయం నిరూపయతి-సత్త్వమితి. పురా సృష్టేః ప్రాక్ శషసవర్ణసంభూతాన్ రజస్తమోగుణానాశ్రిత్య పరమశివః సర్వభూతేషు క్రీడతీత్యర్థః.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** తర్వాత అవస్థాత్రయంబును నిరూపించుచున్నాఁడు. సృష్ట్యా-రంభమున శషసవర్ణసంభూతములైన సత్త్వరజస్తమోగుణముల నాశ్రయించి పరమశివుఁడు సమస్తభూతములయందును క్రీడించుచున్నాఁడు.

విశేషాంశములు : 24,25. కాశికలు సంపూర్ణబ్రహ్మవిచారమును బ్రతిపాదించు చున్నవి.

హరిమీడేస్తవము :

**శ్లో॥ పశ్యన్ శుద్ధోఽప్యక్షర ఏకో గుణభేదా-**
**న్నానాకారాన్ స్ఫాటికవద్భాతి విచిత్రః ।**
**భిన్నశ్ఛిన్నశ్చాయమజః కర్మఫలైర్య-**
**స్తం సంసారధ్వాంతవినాశం హరిమీడే ॥**

(ఏ యాత్మ సుఖదుఃఖసంబంధము లేనివాఁడును, నాశము లేని వాఁడును, జననరహితుఁడును, అద్వితీయుఁడు నైయున్నను సత్త్వరజస్తమోగుణపరిణామభేదము లైన దేవనరతిర్యగాది నానాకారములను చూచుచు కర్మఫలములచే నానారూపములు గలవాఁడై పరిచ్ఛిన్నుఁడునై లత్తుకమొదలగు నుపాధులచేత స్ఫటికశిల నానారూపములుగఁ బ్రకాశించునట్లు ప్రకాశించుచు దేహాంతరమందుఁ దెలియఁబడనివాఁడై యున్నాఁడో సంసారాంధకారవినాశకుఁ డైన యా శ్రీహరిని స్తుతించుచున్నాను.)

భగవద్గీత, 2 అ. 45 శ్లో. :-

**శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున! ।**
**నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥**

(ఓ యర్జునుఁడా! కర్మములను దెలుపునట్టి వేదములు, సకలదుఃఖములను గలిగించునట్టి సంసారమే విషయముగాఁ గలవి. కాఁబట్టి నీ వట్టిసంసారమును వదలుకొనుటకొఱకు నిష్కాముఁడవును, శీతోష్ణాదిద్వంద్వములను సహించువాఁడవును, యోగక్షేమములు లేనివాఁడవునై యాత్మజ్ఞానము గలిగియుండుము.)

భ.గీ. 7 అ. 12 శ్లో.

**శ్లో॥ యే చైవ సాత్త్వికా భావా - రాజసాస్తామసాశ్చ యే ।**
**మత్త ఏవేతి తా న్విద్ధి - న త్వహం తేషు తే మయి ॥**

(సత్త్వగుణమువలనఁ గలుగు శమదమాదులును, రజోగుణమువలనఁ గలుగు దర్ప-హర్షాదులును, తమోగుణమువలనఁ గలుగు శోకమోహాదులును ప్రాణులకు స్వకర్మవశమువలనఁ గలుగుచున్నవి. అవి యన్నియును నావలననే కలిగిన వని తెలిసికొనుము. అట్లు కలిగినను సంసారులవలె నేను వానికి వశుఁడను కాను. అవి నా యధీనము లై యున్నవి.)

**శ్లో॥ త్రిభిర్గుణమయైర్భావై - రేభిస్సర్వమిదం జగత్ ।**
**మోహితం నాభిజానాతి - మామేభ్యః పరమవ్యయమ్ ॥**

(ఓ యర్జునుఁడా! త్రివిధములును సత్త్వరజస్తమోగుణవికారములు నైన శమదమదర్పహర్ష శోకమోహాదిపదార్థములచేతఁ గాన్పించుచున్న యీ ప్రపంచమంతయు మోహితమగుచు నీ గుణములకంటె విలక్షణుఁడను, నాశము లేనివాఁడను నైన నన్నుఁ దెలిసికొనలేక యున్నది.)

భ.గీత : 7 అ. - 14 శ్లో., 13 అ. - 20,21 శ్లో., 14 అ. - 3 శ్లో.,

వి.చూ : 110,111,112 శ్లో. చూడుఁడు.

భ.గీత , 14 అ. 4 శ్లో.

**శ్లో॥ సర్వయోనిషు కౌంతేయ! మూర్తయస్సంభవంతి యాః ।**
**తాసాం బ్రహ్మ మహద్యోనిరహం బీజప్రదః పితా ॥**

(కుంతీపుత్త్రుఁడవైన యో యర్జునుఁడా! దేవపితృమనుష్యపశుమృగాదిసకలయోనుల యందును బుట్టు పలువిధములైన శరీరములకు మాయ తల్లి యనియు, పరమేశ్వరుఁడ నగు నేను గర్భాధానకర్త యగు తండ్రి ననియు నెఱుంగుము.)

**శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో! దేహే దేహినమవ్యయమ్ ॥**

(ఆజానుబాహుఁడవైన యో యర్జునుఁడా! భగవన్మాయవలనఁ గలిగిన సత్త్వము, రజస్సు, తమస్సు అనునట్టి (రూపరసాదిగుణములకంటె భిన్నములైన) మూఁడు గుణములు నాశరహితుఁడైన జీవాత్మను మాయావికారములైన సుఖదుఃఖాదులచేతఁ బ్రకృతిజన్యమును, శరీరేంద్రియ సంఘాతమునగు నీ దేహమునందు బంధించి దేహమే యాత్మ యను భ్రాంతిని గలిగించు చున్నవి.)

**శ్లో॥ సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।**
**ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ ॥**

(సత్త్వగుణంబువలన జ్ఞానమును (వివేకమును) రజోగుణమువలనఁ దఱుఁగని యాశయు, తమోగుణమువలన నజాగ్రత్త, విరుద్ధజ్ఞానము, అజ్ఞానమును బుట్టుచున్నవి.)

**శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి ।**
**గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥**

(సుఖదుఃఖాకారములగు కర్మములను జేయుటకును, ఆ కర్మఫలముల ననుభవించుటకును, కార్యకారణరూపముల నందినవై గుణములే కర్తలుగ నున్నవి కాని మఱియొకఁడు వీనిని జేయువాఁడును, అనుభవించువాఁడును లేఁడనియు; కార్యకారణవిషయాకారముగఁ బరిణమించిన సత్త్వాదిగుణములకంటె నితరుఁడై యా గుణములు చేయువ్యాపారములకు సాక్షిభూతుఁ డైన వాఁడు తానే యనియు నెఱింగినవాఁడు వాసుదేవుఁడ నగు నా భావమును పొందును. అనఁగా నాలో నైక్యము నందును.)

**శ్లో॥ గుణానేతానతీత్య త్రీ - న్దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుఃఖై - ర్విముక్తోఽమృతమశ్నుతే ॥**

(జీవుఁడు దేహోత్పత్తికిఁ గారణభూతములైన సత్త్వరజస్తమోగుణముల నతిక్రమించి జననమరణములు వార్ధక్యము దుఃఖములు మున్ను గాఁగల వాని నందక ముక్తుఁ డగును. అనఁగా నాలో నైక్యమగును.)

**శ్లో॥ కైర్లింగై స్త్రీన్గుణానేతా - నతీతో భవతి ప్రభో! ।**
**కిమాచారః కథం చైతాం - స్త్రీన్గుణానతివర్తతే? ॥**

(ఓ కృష్ణా! సత్త్వాదిగుణముల నతిక్రమించినవాఁ డెట్టి లక్షణములు గలిగియుండును?

ఎట్టి యాచారము గలిగియుండును? త్రిగుణముల నెట్లు జయించును? వీనిని దెలియఁ జెప్పుము ప్రభూ! అని యర్జునుఁ డడిగెను.)

**శ్లో॥ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।**
**స గుణాన్సమతీత్యైతాన్బ్రహ్మభూయాయ కల్పతే ॥**

(వ్యభిచరింపనట్టి భక్తిచేత సకలభూతాంతర్యామియును, ఈశ్వరుఁడనగు నన్నే సేవించువాఁడు సత్త్వాదిగుణములను, వానికార్యములను, అతిక్రమించి బ్రహ్మత్వమును బొంద శక్తుఁ డగును.)

వివేకచూడామణి :-

**శ్లో॥ విక్షేపశక్తీరజసః క్రియాత్మికా - యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ।**
**రాగాదయోఽస్యాః ప్రభవంతి నిత్యం - దుఃఖాదయో యే మనసో వికారాః ॥**

(విక్షేపశక్తి రజోగుణమైనది గాన రజోగుణముచేతఁ బుట్టు రాగద్వేషాదులను బుట్టించును. అనాది యగు ప్రవృత్తిరూపధర్మమును బుట్టించును.)

**శ్లో॥ సత్త్వం విశుద్ధం జలవత్తథాపి**
**తాభ్యాం మిళిత్వా సరణాయ కల్పతే ।**
**యత్రాత్మబింబః ప్రతిబింబితస్సన్**
**ప్రకాశయత్యర్క ఇవాఖిలం జడమ్ ॥**

(సత్త్వగుణ మతినిర్మలము, రజస్తమోగుణములతోఁ గలసి జలమువలె చిత్ప్రతిబింబమున కాధార మగుచున్నది. రజస్తమోయుక్తసత్త్వమందు ప్రతిఫలించిన చిదాత్మ సూర్యునివలె సమస్త జడవస్తువులను బ్రకాశింపఁజేయును)

**శ్లో॥ మిశ్రస్య సత్త్వస్య భవంతి ధర్మా**
**అమానితాద్యా నియమా యమాద్యాః ।**
**శ్రద్ధా చ భక్తిశ్చ ముముక్షుతా చ**
**దైవీ చ సంపత్తిరసన్నివృత్తిః ॥**

(అభిమానము లేమిడి మున్నగు గుణములు కార్యములు సల్పుచు మర్యాదను ధనమునట్లు గాపాడుట, వ్రతాదులు సలుపుట, యమాదినిష్ఠయు, శ్రద్ధాభక్తులు, మోక్షేచ్ఛ, దైవసంపద, అసత్తులగు దేహదారాదులయందు ప్రవృత్తి లేకయుండుట సత్త్వగుణధర్మములు.)

**శ్లో॥ విశుద్ధసత్త్వస్య గుణాః ప్రసాద-**
**స్స్వాత్మానుభూతిః పరమా ప్రశాంతిః ।**

**తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా**
**యయా సదానందరసం సమృచ్ఛతి ॥**

(ప్రసన్నత, స్వానుభవము, శ్రేష్ఠమగు నంతరింద్రియనిగ్రహము, తృప్తియు, మిక్కిలి సంతసమును, ఆనందరసప్రాప్తియుఁ గలిగించునట్టి పరమాత్మనిష్ఠ అను నివి యన్నియు శుద్ధసత్త్వగుణములు.)

**శ్లో॥ అవ్యక్తమేతత్త్రిగుణైర్నిరుక్తం**
**తత్కారణం నామ శరీరమాత్మనః ।**
**సుషుప్తిరేతస్య విభక్త్యవస్థా**
**ప్రలీనసర్వేంద్రియబుద్ధివృత్తిః ॥**

(సత్త్వరజస్తమోగుణములచే యుక్తమగు మాయ జీవునికిఁ గారణ శరీర మని చెప్పఁ బడినది. సమస్తేంద్రియబుద్ధివృత్తులు లీనము లగునేసుషుప్తి గలదో యదియే కారణశరీరముయొక్క విభజనస్థితి.)

**శ్లో॥ అతస్సమాధత్స్వ యతేంద్రియస్సన్**
**నిరంతరం శాంతమనాః ప్రతీచి ।**
**విధ్వంసయ ధ్వాంతమనాద్యవిద్యయా**
**కృతం తదేకత్వవిలోకనేన ॥**

(నిగ్రహింపఁబడిన యింద్రియములు గలవాఁడవై, శాంతమైన మనసు గలవాఁడవై బ్రహ్మవిషయమందు సమాధియుక్తుఁడవు గమ్ము. అనాది యగు నజ్ఞానముచే కలిగింపఁబడిన చీఁకటిని ధ్వంసము చేయుము.)

**శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటతరం – యోఽసౌ సమజ్జృంభతే**
**ప్రత్యగ్రూపతయా సదాహమహమిత్యంతః స్ఫుర న్నేకధా ।**
**నానాకారవికారభాగిన ఇమాన్ – పశ్యన్నహం ధీముఖాన్**
**నిత్యానందచిదాత్మనా స్ఫురతి తం – విద్ధి స్వమేతం హృది ॥**

(జాగ్రదాద్యవస్థాత్రయమం దెవఁడు చక్కఁగఁ బ్రకాశించునో, ఎవఁడొకటేవిధముగ "నేను నేను" అని లోపల ప్రకాశించువాఁడై నానాకారములగు వికారములను బొందిన యహంకారము బుద్ధి మొదలగువానిని జూచువాఁడై నిత్యానందజ్ఞానస్వరూపముచే హృదయమందు ప్రకాశించునో వాఁడే నే నని తెలియుము.)

**శ్లో॥ బ్రహ్మానందనిధిర్మహాబలవాతాఽహంకారఘోరాహినా**
**సంవేష్ట్యాత్మని రక్ష్యతే గుణమయైశ్చండైస్త్రిభిర్మస్తకైః ।**

విజ్ఞానాఖ్యమహాసినా శ్రుతిమతా విచ్ఛిద్య శీర్షత్రయం-
నిర్మాల్యాహిమిమం నిధిం సుఖకరం ధీరోఽనుభోక్తుం క్షమః ॥

(బ్రహ్మానంద మనుగొప్పనిధి బలయుక్తమైన పెనుఁబాముచేఁ జుట్టఁబడియున్నది. అది సత్త్వరజస్తమము లను మూఁడుతలలు గలది. అది యహంకారముగ నున్నది. విజ్ఞాన మనుపెద్ద కత్తితో దాని మూఁడు తలలు ఛేదించి యా బ్రహ్మానంద మనునిధిని ధీరుఁడనుభవింప సమర్థుఁ డగును.)

శ్లో॥ అతీవ సూక్ష్మం పరమాత్మతత్త్వం
న స్థూలదృష్ట్యా ప్రతిపత్తుమర్హతి ।
సమాధినాఽత్యంతసుసూక్ష్మవృత్త్యా
జ్ఞాతవ్యమార్యైరతిశుద్ధబుద్ధిభిః ॥

(విశేషసూక్ష్మమగు పరమాత్మతత్త్వము స్థూలదృష్టిచేత నిశ్చయింప వీలుగాదు. కాఁబట్టి అతిసూక్ష్మవృత్తిగల సమాధియందు నిర్మలబుద్ధిగల పండితులచేతఁ దెలియఁదగినది గాని యితరుల కది తెలియ సాధ్యము కాదు.)

శ్లో॥ యథా సువర్ణం పుటపాకశోధితం
త్యక్త్వా మలం స్వాత్మగుణం సమృచ్ఛతి ।
తథా మనస్సత్త్వరజస్తమోమలం
ధ్యానేన సంత్యజ్య సమేతి తత్త్వమ్ ॥

(బంగారు పుటము పెట్టుటఁచేత బరిశోధింపఁబడినదై నిర్మలమై తన శుద్ధస్వరూపము బొందునట్లు, మనస్సు బ్రహ్మధ్యాన మనుపుటముచేత సత్త్వరజస్తమోగుణములను విడిచి నిర్మలమై బ్రహ్మతత్త్వమును బొందును.)

శ్లో॥ నిరంతరాభ్యాసవశాత్తదిత్థం
పక్వం మనో బ్రహ్మణి లీయతే యదా ।
తదా సమాధిస్సవికల్పవర్జిత-
స్స్వతోఽద్వయానందరసానుభావకః ॥

(నిరంతరాభ్యాసముచేతఁ బక్వమైనదై మనసు బ్రహ్మమునం దణఁగి పోవుకాలమందు వికల్పరహిత మైన సమాధి తనకుఁ దానే శ్రేష్ఠానంద మనుభవింపఁజేయును.)

శ్లో॥ సమాధినానేన సమస్తవాసనా - గ్రంథేర్వినాశోఽఖిలకర్మనాశః ।
అంతర్బహిస్సర్వత ఏవ సర్వదా - స్వరూపవిస్ఫూర్తిరయత్నతస్స్యాత్ ॥

(ఈ సమాధిచే సమస్తవాసనాక్షయము, కర్మనాశము, స్వరూపదర్శనము కలుగుచున్నది.)

## (14) సూత్రము. హల్

### (26) కాశికా

**శ్లో॥ తత్త్వాతీతః పరస్సాక్షీ సర్వానుగ్రహవిగ్రహః ।
అహమాత్మా పరో హల్స్యామితి శంభుస్తిరోదధే ॥**

ఇతి శ్రీమన్నందికేశ్వరవిరచితా చతుర్దశసూత్రవ్యాఖ్యా కాశికాఖ్యా సంపూర్ణా.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** తత్త్వాతీతః = చతుర్దశ తత్త్వముల కతీతుఁడును, పరః = పరుఁడును, సాక్షీ = సర్వసాక్షియును, సర్వానుగ్రహవిగ్రహః = సర్వానుగ్రహస్వరూపుఁడును, అపరః = తనకంటెఁ బరవస్తువు లేనివాఁడును, ఆత్మా = బ్రహ్మము నగు, అహమ్ = నేను, హల్ = హకారము, స్యామ్ = అగుదును, ఇతి = అని, శంభుః = పరమశివుఁడు, తిరోదధే = అదృశ్యుఁడాయెను.

**తాత్పర్యము :** నృత్తావసానమున నటరాజరాజగు పరమశివుఁడు సకలముని శ్రేష్ఠులకును ఢక్కానినాదవ్యాజమున బ్రహ్మతత్త్వము నుపదేశించి యదృశ్యుఁడయ్యెను.

**తత్త్వవిమర్శినీ :** సర్వతత్త్వజనకః స్వయం తత్త్వాతీతః ఇతి జ్ఞాపనార్థమేవైతత్సూత్రం చకారేత్యాహ. తత్త్వాతీత ఇతి. సర్వానుగ్రహవిగ్రహః, సాక్షీ తత్త్వాతీతః హల్ స్యామితి ఢక్కా నినాదవ్యాజేన సర్వేషాం మునిజనానాం తత్త్వముపదిశ్య శంభుస్తిరోదధే ఇత్యర్థః. **'హకారః శివవర్ణస్స్యా దితి శైవాగమస్థితి'** రితి శివమ్.

ఇతి శివతత్త్వవిద్యాపారావారపారీణ శ్రీమద్వ్యాఘ్రపాదమునిసుత శ్రీమదుపమన్యు-మునీంద్రవిరచితా ఆదిసూత్రకాశికావ్యాఖ్యా తత్త్వవిమర్శినీ సంపూర్ణా.

**ప్రణవవల్ల్యాఖ్యయా :** శ్రీపరమశివుఁడు సమస్తతత్త్వములకును జనకుఁ డనియు, తానీ తత్త్వములు దాఁటినవాఁడనియు, చూపుటకై ఈ సూత్రమును రచించె నని చెప్పుచున్నాఁడు.

నేను నిగ్రహానుగ్రహశక్తి గలవాఁడను, అన్నిటికిని సాక్షి యైన వాఁడను, ఈ సమస్తతత్త్వములను దాఁటినవాఁడ ననియు నీ హల్ సూత్రములో ఢక్కా శబ్దవ్యాజముతో సమస్తమునిజనులకును తన యాత్మతత్త్వమును బోధించి శివుఁ డంతర్హితుం డాయె నని యర్థము.

విశేషాంశములు : శ్వేతాశ్వతరోపనిషత్తు, 6 అ. 11 మం :-

**శ్లో॥ ఏకో దేవస్సర్వభూతేషు గూఢ-
స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా ।**

కర్మాధ్యక్షస్సర్వభూతాధివాస-
స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ ॥

(ఈ మంత్రమునం దా పరమాత్మనే అరచేతియం దున్న యుసిరికపండు వలెనే ప్రత్యక్షముగాఁ జూపించుచు నా పరమాత్మను దెలిసికొనుటవల్లనే పరమపురుషార్థప్రాప్తి గలుగుచున్నది. ఇతర మైనదానిచే కలుగ దని చూపించుచున్నాఁడు. స్వయంప్రకాశమానుఁడై అద్వితీయుఁడగు పరమాత్మ సర్వప్రాణులందు రహస్యమై యుండువాఁడును, ప్రాణులుచేయు సర్వకర్మముల కధిష్ఠాతయును, సర్వప్రాణులందును నివసించియుండువాఁడును, సర్వమును జూచువాఁడును, చేతనస్వరూపుఁడును, ఉపాధిలేనివాఁడును, సత్త్వాది గుణములు లేనివాఁడును నగుచున్నాడు.)

శ్లో॥ క్వాహం మందమతిః క్వేయం నందికేశస్య కాశికా ।
వ్యాఖ్యా తస్యాశ్చ భగవదుపమన్యుప్రసాదితా ॥

శ్లో॥ వ్యాఖ్యా పదపదార్థజ్ఞై రచితా యది శోభతే ।
మాదృశై రచితా చేత్ స్యాత్ మూలకారవిడంబనా ॥

శ్లో॥ తథాపి బాలిశత్వేన ప్రేరితః కించిదుక్తవాన్ ।
పండితాః క్షంతుమర్హంతి సాహసం మమ చేదృశమ్ ॥

శ్లో॥ అథవా భగవానాహ 'భావస్థో భ్రామయామ్యహమ్' ।
ఇతి యత్తేన నద్ధోఽహం వర్మణా కిం ను మే క్షతిః ?

శ్లో॥ స్వయం సంసిద్ధోఽపి ప్రతిహతవికర్మాపి కృపయా ।
క్షిపన్నానమ్రాణాం హృదయచిరబద్ధం గురుతమః ॥

శ్లో॥ గిరౌ శోణే నిత్యం జయతి రమణాఖ్యో మమ గురు ।
ర్దధామ్యేనాం భక్త్యా చరణయుగళే తస్య తు మునేః ॥

శ్లో॥ తత్కృపాలేశమాత్రేణ వ్యాఖ్యైషా పరికల్పితే ।
అనేన ప్రీయతాం దేవో రమణో మద్గురుః ప్రభుః ।

ఓం తత్సత్.
ఓం శ్రీరమణార్పణమస్తు.

***